# అనర్ఘ రాఘవము.

(ఐదు ఆశ్వాసములు)

బిజ్జుల తిమ్మ భూపాలుడు.



వాసవి ముద్రాక్షరశాల, కర్నూలు.

1931.

చ॥ తన మధురాధరాధర సుధారసముం బతి వేఁడఁ బొడ్డుఁగో
న్నన నజు వామలోచనమునన్ గన నన్న యొనర్చి చూపి యుం
తనె యదియున్ నిమీలనమునందగ నవ్వుచుఁ దన్మనోరథం
బనువుగఁ జేయునిందిర మదాయతనంబున నిల్పుఁగావుతన్. 5

మ॥ "వెలిదమ్మిన్ గను నేకనాళమున నావిర్భూతి నొందెన్ జతు
ర్దలజాతంబులు వేచియుండమె వికాసం బొందఁగా నెంతవిం
తలొ యంచున్ సురకోటి వల్కు హరియుద్యన్నాభినాళీకమం
దెలమిం దోఁచి చతుర్ముఖుం డనరు వాణీశున్ మదిన్ గొల్చెదన్.

చ॥ ఎదురుగ నున్న యాస్యమున కెంతయు నాతెఱతేన క్రేవలం
బొదలెడుమోముదోయికిఁ గపోలతలద్వయచుంబనంబు వెం
న్కఁ దనరువక్త్రపాళికిని గ్రపృష్ఠభాగము లొక్కమాటె యిం
పు దనర నిచ్చి పద్మజుఁ గవుంగిటఁ జేర్చిన వాణిఁ గొల్చెదన్. 7

చ॥ మనసిజవైరి శౌరియును మక్కువ నొక్కటఁ జెక్కుదోయి చుం
బన మొసరింపఁగా నెఱిఁగి మస్తమువెన్క కెడల్ప వారలిం
పునఁ దమమోము లొండొరులు ముద్దుగొనం గని నవ్వునా గజా
నను భజియింతు నేననుదినంబు మనోరథసిద్ధికిం దగన్. 8

సీ॥ భవ్యరామాయణ కావ్యామృతోద్భూతి
కంగన కెవ్వని మోము కలశవార్ధి
ఘనభారతీవంశగంగాతరంగిణీ
వేణి కెవ్వని మోము విష్ణుపదము
వివిధపరేంగిత విజ్ఞానగోళంబు
పఙ్క్తి కెవ్వని మోము పంకజంబు
భానుమన్నతి కథాప్రస్ఫురన్నాన్నర
తాన్నళి కెవ్వని మొగ మ్మాకరంబు

గీ॥ ధరణి నా నాకుభవపరాశరకుమార
కాళిదాసమయూర సత్కవుల దీప్తి
రవుల సజ్జననిర్జరగవుల ధీయు
తాశ్వనీతేజభవుల నే నభినుతింతు. 9

ఉ॥ భారతకల్పకంబునకుఁ బాదగు నన్నయభట్టధీరు నం
కూరగతిఁ గొన్పు నెఱ్ఱనకవీంద్రమాలిఁ బ్రకాండశాఖికా
కారతఁ బొల్పుమీఱిన ప్రగల్భుని దిక్కనసోమయాజి నే
సారత సన్నుతించెదను సారవచోరచనాభివృద్ధికిన్. 10

చ॥ ప్రకటజడాశయస్థితిని భంగము నొందుచు శబ్దపోషణం
బొకయెడ లేక ధీనగుల కుల్కుచు నిల్వ కలంక్రియం దలి
ర్పక బహువాంఛితార్థతను రంజిల తాకృతి నల్లనైన య
క్కుకవిసమాజముల్ నవతు గొల్చిన సత్కవికోటితో ధరన్. 11

వ॥ అని యిష్టదేవతాభివందనంబును శిష్టసనాథనాథనాతన సుకవి
జనవందనంబును గావించి యే నొక పురాతన పుణ్యశ్లోకచరిత్రం
బు ననవద్యహృద్యగద్యపద్యాత్మకంబుగా రచియింపం దలంచియు
న్నఁ దత్పూర్వరాత్రంబునఁ జతుర్థయామంబున. 12

సీ॥ జడలఁ జెంపగు జాలునొడలి కెంపగుడాలు
పోడలసొంపగు కాలునడచువాఁడు
చలువ నించినపొమ్ము నలువ వంచినపొమ్ము
చెలువ నుంచినత్రొమ్ము గలుగువాఁడు
గిరిని నిల్చినజోక కరిని గప్పినదాక
కిరిని గూల్చినవీఁక మెఱయువాఁడు
కాఁడి మోసినజాడు వేఁడి జాసిన కేలు
వాఁడిసేసినవాలు వఱలువాఁడు

హిమశైలకన్యకా న్యస్తనవక్షోజాత
చిత్రితచందన పత్రకంబు
ప్రాకటహారిధరాపదికమహస్స్ఫుర
న్నన్యముక్తాఫలనాయకంబు
గీ॥ నైనరామేశ్వరస్వామి యనుపమోక్త
నైక సంబంధమునకు నేఁ డిదె సమస్త
దేశవిద్వత్కవిప్రభృతిఁ బ్రశస్త
ఘనసభాజన మిచ్చోటఁ దనరె నొక. 18

శా॥ నానాదేశసమాగతుల్ కవిజనుల్ నానారసోద్యత్ప్రబం
ధానీకంబు వివాదకంథరతచే నావిష్కరింపన్ దదీ
యానూనశ్రవణంబుచే విసుగుసభ్యశ్రేణికిం బ్రీతి నా
హా నిచ్చున్ ఘటికాయుంతు నిష్టరసభవ్యంబైన కావ్యంబునన్. 19

క॥ ప్రీతిఁ గవితోపజీవక
చేతఃప్రియతమము దానిఁ జేకొను కుకవి
వ్రాతంబు గెలిచి క్రమ్మఱ
నే తెఱఁగున నైనఁ దెత్తు నిక యెట్లన్నన్. 20

మ॥ కమనీయస్థితిఁ జెంగలన్ ధవళశంఖస్ఫూర్తి రాజింప దీ
ప్తమరీచిన్ బవడంపుఁ గెంపుఁ బవలున్ బంజాల్ వెలుంగొందఁ ని
స్సమసారస్వతనిర్మలామృతఝరీజాగ్రత్తరంగాబ్ధిపే
ర మహాసత్కవి తేజరిల్లె విబుధప్రస్తూయమానోద్ధతిన్. 21

చ॥ అతనికిఁ బౌత్రుఁడై యసదృశాఖిలవిద్యలఁ బ్రౌఢిఁ గన్నయా
యతమతి కృష్ణసత్కవి సహాయకవిత్వమునన్ సమాజసం
తతభజనాదరుండ నగు నాకు నశేషవిశేషవైదుషీ
ప్రతిభ కరస్థలామలకభాస్వరమై తనరారు టబ్బమే. 22

గీ॥ ఎట్టులన్నను న్యాయమార్గైకవృత్తి
కవనిఁ దిర్యక్కులైన సహాయ మగును
గాని తెరువున నడచినవాని విడుచు
ననఁగఁ దోఁబుట్టువైన సత్యంబు సుమ్ము. 23

మ॥ తను శాస్త్రామృతపూరముల్ సుకవి చేతశ్శుక్తికం జేర్చి యం
త మనల్పం బగు నక్షరాకృతుల ముక్తాశ్రేణులన్ గూర్చు హా
రము లుద్యద్గుణనాయకమణిగ్రామోపసంసర్గనై
కమహాలంకృతులై చెలంగను సుహృత్కంఠంబులం దెల్లెడన్. 24

మ॥ అటులం బొల్పునహీనమ సర్వపురుషార్థాచంద్రహర్షప్రదో
త్కటవీరాద్భుతగాఢరూఢ మహిమోదాత్తైక వస్తుస్ఫుర
త్స్ఫుటిమన్ లోకమునం బ్రథమకావ్యం బైన సందర్భ మూ
అటకై కోరుచుఁ గోరుచున్ దలఁచితిన్ రామాయణం బంతటన్.

♦ సీ॥ అఖిలలోకారాధ్యుఁడై కవితావతా
రాగ్ర్యతీర్థంబైన యనఘమూర్తి
వల్మీకసూతి తద్వాణీవిలాస ని
ర్వ్యాస మిక్ష్వాకుల యమలకీర్తి
భవ్యగాత్రంబు తత్ప్రతిబద్ధ సుప్రసి
ద్ధప్రబంధానుసారిప్రవృత్తిఁ

---

♦ సీ॥ అఖిలలోకారాధ్యుఁడై కవితావతా
రాద్యతీర్థంబైన యనఘమూర్తి
వల్మీకసూతి తద్వాణీలసత్స్ఫుర
త్ప్రతిబింబభానుకులీననిజకీర్తి
భాసురాలంకారభావాన్వయోన్నత
సరసార్థపదలసత్సం ప్రవృత్తి

చెలువొందుఁగద నాదు చిత్తమూర సమస్త
కవిసార్థసాధారణనరభూతి
గీ॥ గద తదీయసుభాషితాకారినీవి
నిబిడమై ఘుంచుజుంటితేనియలభావి
లలితభావధ్వనివ్యంగ్యములకుదీవి
తీవి నేమని వర్ణింతునావిధంబు. 26

సీ॥ రాత్రించ రాన్వయగ్రామణి భువనముల్
చేడ్వడఁ దపియింపఁ జేయు టెల్ల
నిక్ష్వాకుకులవాహినీశచంద్రుండైన
పురుషోత్తముం డుర్విఁ బుట్టు టెల్ల
వల్మీకసంభవువాగ్వాహినీసంబు
కీర్తినిగను దాఁ బ్రకాశించు టెల్లఁ
దద్విచోదనాక్తిఁ దానుగ్రంథకర్త నాయ
కాకృతిఁగాథఁ తత్స్థుఁడగుట టెల్ల
గీ॥ సద్భూతము ఘంప శృంగార మతిశయింప
వీరము రహింప భావముల్ విస్తరింపఁ
గృతులు గావింపఁ బూనుఁ గవీంద్రకోటి
బహులురాకృతసుకృతైకపాక మరయ. 27

---

యలఘుకావ్యాలోక నానాకరసఝురీ
పరిమగ్నమానస ప్రకటవృత్తి
గీ॥ గలుగుమానుకవాక్సుధాకలిత కావ్య
నియతి గన్గొన జుంటితేనియలభావి
లలితభావధ్వనివ్యంగ్యములకు దీవి
తీవి నేమని వర్ణింతు నావిధంబు. (ఇది ప్రక్షిప్తము.)

సీ॥ నిఖలతపోధననివహసంస్తుత్య చా
రిత్రైకమౌద్గల్యగోత్రభవుఁడు
నానావిధకళాభినవ పితామహానర్ఘ
మానభట్టార్యకుమారకుండు
తతసతీవృత్తాంక తంతుమత్యాహ్వాయ
మానవతీశుక్తి మౌక్తికంబు
గురుభట్ట దేశికోత్తర పూరమధ్యాస
రన్ని రాఘూట సారస్వతుండు

గీ॥ బాలవాల్మీకి బిరుదకుంభన్మురారి
నాటక మనర్ఘ రాఘవనామకంబు
దాని నాంధ్రప్రబంధంబుగా నొనర్చి
యుదితసామగ్రిసమ్మద మూన్తు సభకు. 28

సీ॥ అస్మదాశ్రితు లంటి నా రసపాక గీ
తములఁ బ్రత్యేకంబు దక్షు లరయ
మౌద్గల్యకవిన చోమాలిక లంటినా
మాధుర్యగాంభీర్యమంజులములు
సరసకావ్యార్థబీజం బంటినా సుధీ
గోదాత్తుఁడైన రఘూర్వహుండు
తస్మనన ప్రసిద్ధ సువాక్కు లంటినా
పరగు వాల్మీకితపఃఫలంబు

గీ॥ లట్టి ప్రాచేతసీయమై యతిరుకథ న
నేకులు రచించుదాననే కృతియొనర్చ
శ్రోత్రియాత్మజుఁడలదాని సుకవు లెన్న
నేను దెనిఁగింప నపరాధ మేమికలదు. 29

మ॥ గొనరా రామచరిత్ర యాదిమ కవిత్వుణ్ణంబుగా నెంచి మా
నిన నీరీతి గుణాఢ్యుఁడై తనరువానిన్ నాయకుం గాంచలే
మిని దత్తద్గుణగౌరవస్ఫురిత గాంభీర్యాతి మాధుర్య వా
క్యనవబ్రహ్మలు పండితుల్ తమ రసోసార్థక్యముల్ గాంతురే.

వ॥ కావున స్వయంప్రకాశిత శబ్దబ్రహ్మయగు నాచార్య ప్రాచేతసుని వాగ్దేవతను తన్మార్గైకవిహారి మురారిం బ్రశంసించెద. 31

గీ॥ మనుజలోకప్రవేశంబు గనెడువాణి
కరయ విశ్రామశాఖయై యతిశయిల్లి
యమరభవనావతరణజక్రమముఁ బ్రాపు
మౌనిమూర్ధన్యునకు నే నమస్కరింతు. 32

క॥ జలజభవచతుర్వదనీ
గళశృంగాటకవిహారకమనీయఁ బ్రగ
ల్భలసద్వాచాల మణిన్
గొలుతున్ నే వాణిఁ గమలకోమలపాణిన్. 33

మ॥ సర మాహాత్మకకుత్స్థసంతతి సమాఖ్యా సౌరభోదారని
ర్భర గంభీరమనోవిహారముగఁ జేఁ బాటిల్లు వాచాపరం
పర వాల్మీకి కవీంద్రవాగమృతకూప ప్రాంతగాహావనై
పరఁగం జేసిన యమ్మురారికవిన్ బల్మాఱు నే బ్రొక్కెదన్. 34

వ॥ అని యభివాదనం బొనర్చి పేర్చిన కుతుకంబునఁ జతుర్దశ భువనాధీశ్వరుం డగు పరమేశ్వరుండు స్వప్నంబున సాక్షాత్కరించి కరుణాతరంగితాపాంగ విలోకనుండై యానతిచ్చిన తెఱంగెల్ల సభాసదులకు విన్నవించినఁ బ్రమోదంబున వారును మహాద్భుత కందళిత హృదయారవిందులై యనన్య సాధారణ విబుధ జన విధేయంబగు భాగధేయంబునకుఁ బ్రథమకారణంబవైతివి నీయంత కృతార్థుండు

గలఁడె తావకీనాన్వయ ప్రసిద్ధులగు పెద్దలు నీదృశమహాత్త్వంబున వృద్ధిం బొందరే? కావున భవద్వంశావతారంబు సారంబు గావించి దము సావధానమతివై యాకర్ణింపుమని యిట్లనిరి. 85

సీ॥ ఏసరిత్తిలకంబు హేమాంబరుని పాద
రాజీవములకు మకరంద ధార
యేనదీతల్లజం బీశానమస్తక
సీమకుఁ బాంసుగోష్ఠీవశాటి
యేవాహినీదేవి హిమవద్ధరాధర
శృంగాంతరంబులఁ గ్రీడసల్పు
నేధునీకాంత పాథోధిమూర్ధన్యున
కగ్రభాగ్యమణియై రహించు

గీ॥ నట్టిగంగకుఁ దోఁబుట్టు వగు చతుర్థ
జాతియందు నితాంతవిఖ్యాతిఁ గనరు
చున్న మొగవాడకులమున నొప్పు మీకుఁ
జాలు బిడ్డఁడు దాదభూపాలమౌళి. 86

ఉ॥ దాసనభూమిపాలుఁడు సదాదనదాగము, నీవి శ్రీవరుం
బాదన నా భూదక్షిణపాద నముద్రిపురక్షణంబునక్
సాసన దైర్ఘ్యధుర్యత నసాసనగేంద్రునితో నొనర్చ్చుబల్
వాదన నిం పెసంగ ధర వాగన శాంతిపరాజితేంద్రుఁడై. 87

క॥ ఆదాసనకుఁ గుమారుం
డాగటఁ గుప్పన జనించె నతిభీకరతా
మేదురతరతారకరిపు
భేదనచణబాహుశక్తి పృథుసాధన్యుఁడై. 88

సీ॥ ఆకులపాటొందు నమరభూజాతంబు
నిరతవిశ్రాణనగరిమ యెంత
దురములో నరునకుఁ గిరు డైనధూర్జటి
గాఢపరాక్రమక్రమ మదెంత
కసు వనంగుం డయి కానరాని ప్రసూన
మార్గణుసౌందర్యమహిమ యెంత
పూఁటపూఁటకు వెల్తిఁ బొందెడుకార్తికే
కైరవాప్తుని కళాకలన యెంత
గీ॥ యనుచు నిరసించు నిశ్చలౌదార్య శత్రు
జైత్రవిక్రమ గాత్రరాజద్విలాస
నిత్యసంపూర్ణ కాంతుల నివ్వటిల్లఁ
గోవిదులు మెచ్చ బిజ్జక్ష్మాప్రభుఁడు. 39

క॥ ఆక్ష్మాప్రభుఁడు గాంచె సు
ధీకల్పకశాఖి మేరుధృతి నెఱిగొండ
క్ష్మాకాంతమౌళి సుకవి
శ్రీకరబహుదానశాలిఁ జెన్నక్షితిపున్. 40

సీ॥ కమనీయవాగ్విలాసమునఁ బన్నగరాజు
నగరాజు ధృతిధురంధరనిరూఢి
ననుపమానకళాప్తి నలశీతభానుండు
భానుండు దోఃప్రతాపంబుకలిమి
దారుణసంగ్రామధాత్రిఁ గుమారుండు
మారుండు సౌందర్యమహితరేఖఁ
జారుమేధాయుక్తి నారదజనకుండు
జనకుండు విజ్ఞానసౌష్ఠవమున

గీ॥ నేమహాభాగుఁ డతఁ డొప్పె నిద్ధరిత్రి
నిఖలయాచకదారిద్ర్య నిబిడగహన
హరణదవకేళి యాశ్రితాదరణశాలి
భవ్యగుణపాళి చెన్నభూపాలమౌళి. 41

క॥ ఆ చెన్నక్షితిపుఁడు చిన
మాచమను వరించె సర్వమంగళను సుధా
రోచిశ్శేఖరు చాడ్పున
నేచిన మోహమున బంధులెల్ల నుతింపన్. 42

గీ॥ ఏలమిఁ జినమాచమాంబికవలనఁ బుత్రు
విదితవెన్నెళ్లగోత్రపవిత్రు నంబు
జేక్షణారాధ్యగతమనసముదీర్ణగాత్రుఁ
జాత్రుఁ జినతిమ్మభూమీశశత్రుఁ గనియె. 43

మ॥ చినతిమ్మక్షితిపాలకాగ్రణి హరిత్తృత్తమాధూళిపా
ళి నకాలోగ్రతమంబు దుర్జయభుజాలీఢప్రతాపప్రపూ
ర్తి నపూర్వాతప మేకకాలమున నెంతే మేదినీమండలం
బున శోభిల్లఁగఁ జేసెఁ నంచు నుతిసల్పన్ లోక ముచ్చైస్స్వనన్.

మ॥ చినతిమ్మేంద్రుఁడు లింగమాంబవలనన్ శ్రీనెన్నఁగాఁ గాంచె నం
దనులన్ శౌర్యరేఖ్య నప్పనృపు నుద్దామ ప్రతాపాఢ్యు రం
గనరేంద్రుం ధృతిశాలిఁ గొండధరణీకాంతున్ నితాంతైకశో
భనుఁ గృష్ణాధిపు వారిజేక్షణచతుర్బాహూపమాకారులన్. 45

ఉ॥ అప్పనృపేంద్రుఁ దిక్కులవలయంబుఁ బ్రకాశము నొందఁజేసి సొం
పొప్పఁ జకోరద్రుకీర్తికి నుత్సవ మూన్చుచుఁ గౌముదీరుచిన్
దప్పక కాంచి వే యరివితానముమానము మూఁకలాడి తా
నొప్పుచుఁ గీర్తిశేఖరి వహించి చెలంగె నభంగురోన్నతిన్. 46

క॥ ఆయనకుఁ దమ్ముఁడైన స
జాయుతబలశాలి రంగపావనిపాలుం
డాయోధన జయశీలుం
డై యిల యేలెను జనంబు లభినుతి సేయన్. 47

సీ॥ తనచూపు సుకవిసంతానంబు మీఁద సం
తతము మాడలవసంతంబు లాడఁ
దననూఁపు పంటపైఁ గలివిహరింపఁ గ్రొ
మ్మిసిమి గుల్కెడు పైఁడిమేడగాఁగఁ
దనయేపు కలనమార్కొను చెండిమన్నీల
తెగ కెల్ల గుండెలోఁ దిగులుగూర్పఁ
దనకాపు సకలబాంధవనికాయమునకుఁ
సగవజ్రపంజర మగుచు నిగుడఁ

గీ॥ బాగుగను గాంచెను హారికర్పూరహీర
తారహార పటీర నీహారసార
వారణాదారస ప్రభాపూరసార
కీర్తిరుచిశాలి రంగపక్షితిపమౌళి. 48

చ॥ అతనికిఁ దమ్ముఁడై తనరె నంబుధివేష్టిత భూతలాశ్రిత
ప్రతతిచకోరక ప్రకటభవ్యతరోత్సవ కేళికృద్దర
స్మితనవచంద్రికారుచివిశేష విభూషితవక్త్రచంద్రుఁ డ
చ్యుతరమహావిభూతి గుణసాంద్రుఁడు కొండనరేంద్రుఁ డెంతయున్.

గీ॥ ఆమహాబలు ననుజన్ముఁడై ధరిత్రి
గోత్రసంభరణైకదక్షుఁడు నితాంత
కాంతసత్యాభిరాముఁ డాకలితభద్రుఁ
డచ్యుత సమాఖ్యుఁడనఁ గృష్ణుఁ డతిశయిల్లె. 50

చ॥ అతనికి నన్నయై చెలువ మందిన బిజ్జలకొండ మేదినీ
పతి భుజహేతి దూతియయి ఖండనఖండిత వైరిజాతికిన్
రతిని హసించురూపమున రంజిలు నా తెలిగంటినాతికిన్
రతి ఘటియింపఁ జేయు నవురా కవిరాజి నుతించుచుండఁగన్. 51

సీ॥ దినరాజు వనరాజు ధనరాజు నిరసించు
శౌర్యగంభీర్యతౌదార్యకలన
మృగరాజు నగరాజు ఖగరాజుఁ గుందించు
సాహసపటుధైర్యజవ నిరూఢి
నలరాజు వలరాజు నలరాజు హసియించు
రుచిసురూపహయాధి రోహణముల
గిరిరాజు హరిరాజుఁ గరిరాజు సలయించుఁ
క్షితిధృతివాచాచ్ఛకీర్తిపటిమ

గీ॥ నే మహోదారుఁ డాశూరుఁ డీలఁ జెలంగె
గాయగోవాళగేయాధిరాయబిరుద
మండనుండుఁ భయంకర భండనుండు
భవ్యగుణశాలి కొండభూపాలమౌళి. 52

మ॥ ఇనదబ్జంబు ధనంజయచ్ఛరము వాణీశద్గిరీశంబు కో
కనదత్కైరవ మబ్జరాగదుకురాట్కాంతంబు కాశ్మీరజ
ఘ్నసారంబు సురాలయద్రజతగోత్రం బయ్యె బ్రహ్మాండ మా
చినతిమ్మక్షితిపాలకొండవిభు నక్షీణప్రతాపంబునన్. 53

సీ॥ కైరవహరణ జాగ్రద్వృత్తి వర్తిల్లె
నే గండరాదిత్యుఁ డేపుమీఱి
పరకుంభినీధవోత్పాటనోద్భటుఁ డయ్యె
నే గండభేరుండుఁ డిద్ధరిత్రి

నిరతక్షమాధరవరధర్మమున మించె
నే యాదిగర్భేశు డీడు లేక
యనుపమాచ్యుత సమాఖ్యాయాధిఁ దనరె నే
ఖడ్గనారాయణాంకనధురీణుఁ

గీ॥ డాకృపాగుణపారీణు నాప్రవీణు
నాబుధత్రాణు నామహోద్యత్కృపాణు
నాజయోదగ్రనిస్వాణు నాయరీణు
నెన్నశక్యమె కొండపృథ్వీశమణిని. 54

శా॥ ఆ కొండక్షితిపాలచంద్రుఁడు వివాహంబయ్యె నానాసతీ
లోకస్తుత్యసుశీల గోపమను సుశ్లోకైక సంకీర్త్యకీ
ర్త్యాకల్పాంచిత బక్కమాంబ నిరతధర్మాలంబనారంభ దీ
క్షాకౌతూహల రంగమాంబ సుజనరక్షాదీక్ష జక్కాంబికన్. 55

సీ॥ పృథివి తా క్షమ యయ్యు బ్రియమైన పరగతి
ఘనతరవారిభంగంబు దాల్చె
నగజాత సతియయ్యు నాత్మేశు నొకమూల
నటుద్రోచి పౌరుషం బతిగఁ జేసె
వాణి తాఁ బరిశుద్ధవర్ణాత్మ యయ్యు న
వ్వల విభుఁ దన మాటవాని జేసెఁ
బద్మశ్రీ యయ్యును బతిఁ గొంచెపడ వేఁడి
పరునిచే దానంబుఁ బట్టఁ జేసె

గీ॥ ననుచు వారల నిరసించి తనరె ధాత్రి
మహితపాతివ్రతీమహామహిమ ననమ
సుగుణనికురంబ యగుచు బిజ్జలకులేంద్రు
కొండభూపాలచంద్రు శ్రీగోపమాంబ. 56

మ॥ అల దుర్భిక్షసుభిక్షకాలముల నత్యామోదమై భూసురా
వలి కిష్టాన్నము లన్నపూర్ణకరణిన్ స్వర్ణంబు లయ్యిందిరా
జలజాక్షీమణిఁబోలి దా నొసఁగి భాస్వత్పుణ్యకీర్తుల్ ధరా
స్థలిపై నించిన గోపమాంబ కెనయే సాధ్వీమతల్లీతతుల్. 57

క॥ ఆ గోపమాంబవలనన్
భోగామరవిభుఁడు కొండభూపతి గాంచెన్
ద్యాగసురద్రువు నప్పన
వాగీశమనీషి రామవసుధాధీశున్. 58

క॥ అప్ప ధరాపతి సర్వజ్ఞ
కుప్పటలీనిటలతటులఁ గూరుచు యశమున్
గప్పురపుఁబుత్రికంబులు
ముప్పిరిగొనఁ బ్రేమ సుకవిముఖ్యులు మెచ్చన్. 59

గీ॥ ఆ మహాభాగునకుఁ దమ్ముఁడై చెలంగ
రాముఁ డురుసత్త్వమున బలరాముఁ డనఁగ
రణముఖంబున భార్గవరాముఁ డనఁగ
రాజతకృపాప్తి శ్రీరఘురాముఁ డనఁగ. 60

సీ॥ దశరథారాధన తాత్పర్యమున మించి
తమ సుమిత్రాత్మజాసక్తిఁ గాంచి
సాధువితానరక్షణదీక్ష ధరియించి
శివధర్మవర్ధనస్థితి వహించి
ఖరదూషణాహితకాండముల్ విదళించి
హరిముఖ్యబలముల నాదరించి
పరవాహినీశ్వరబంధంబు గావించి
శరణాగతావనస్ఫురణ నించి

గీ॥ యాజి నరిస త్కీర్తికంఠరావాతి ఘటించి
సరసమహితనయావాప్తి సంతసించి
రమణిఁ జెలువందె మాటలరాముఁ డనఁగ
రవినిభుం డైన బిజ్జల రామవిభుఁడు. 61

క॥ ఆ రామవిభుఁడు ప్రేమా
దారతఁ వరియించె ముఖజితైందవబింబన్
భూరికరుణావలంబన్
శ్రీరాజితగుణకదంబ శ్రీజక్కాంబన్. 62

క। ఆ జక్కమాంబవలనన్
దేజోనిధి రామవసుమతీపతి గాంచెన్
రాజాధిరాజవినుతా
వ్యాజవిరాజత్ప్రభావు యాగప్రభువున్. 63

సీ॥ రాజరాజులు గాని రాజరాజులు గారు
ప్రతినిత్యలవిభాతి భాతినిధుల
నరకేసరులు గాని నరకేసరులు గారు
సాటి మేధాసత్వ సత్త్వకలన
గోపాత్మజులు గాని గోపాత్మజులు గారు
సమము దయాసార సారతనులఁ
గాశ్యపేయులు గాని కాశ్యపేయులు గారు
పరుడు లసద్బోధ బోధనముల

గీ॥ ననుచు నెవ్వని నుతియించు జనము వేడ్క
సకలజనపాలి యాగుణశాలి యలరు
హేళిసమధామురింఛోళి హృద్యకేళి
పాలితబుధాళి యాగభూపాలమౌళి. 64

సీ॥ జగడాలఁ బచరించు సారమాణిక్యంబు
విషములు గురియుఁ బ్రావృడ్ఘనంబు
నుగ్రశేఖరభావ మొందు సుధాంశుండు
మొరయుచు వడిసుళ్ళు ముంచు జలధి
యాలంబుఁ బెంచు న య్యామరభూజంబు
కోసిపెట్టును శిబిక్షోణిభర్త
తా నొల్చియొసఁగు న త్తపనకుమారుండు
మెంచుకోపా లూహించుండు సురభి

గీ॥ యనుచు వారల నిరసించి యనుపమాన
దానలసమానఖేలనానూనమహిమఁ
దనరుబిజ్జలకులసుధావనధిపూర్ణ
చంద్రుఁడో యన యాగనరేంద్రుఁ డలరు. 65

సీ॥ భూదారతారూఢిఁ బొల్పుమీఱఁగఁ జేసె
వైరుల కల విప్రవాసకలన
పురుషసింహాఖ్యాతిఁ బరిఢవిల్లఁగఁ జేసె
సహితుల కగు గుహాధ్యాపగరిమ
రాజపుంగవలీల రాఁజిల్లఁగాఁ జేసెఁ
బ్రత్యర్థులకుఁ దృణగ్రసన పటిమ
భోగివిస్ఫూర్తి యొప్పారవహింపఁ జేసె శ
త్రులకు వల్మీకాధిరోహమహిమ

గీ॥ విపులజయపేటి యెవ్వాని విజయధాటి
యట్టిబలుమేటి సంభృతజ్యావధూటి
తతయశశ్శాటి యాగభూధవకిరీటి
నెనయఁజాలునె యీనాటి నృపతికోటి. 66

క॥ యాగప్రభుమణి యతఁ డను
రాగంబునఁ బెండ్లియాడె రాజిలుమతి నా
భోగగుణశీల నచ్చమ
యాగారికి సాటియైన యల లక్ష్మాంబన్. 67

మ॥ అలయాగేంద్రుపితామహుండు పెదకొండాధీశమూర్ధన్యుఁ డిం
పలరన్ బక్కమయందుఁ గాంచె విబుధాహార్యేంద్ర సూర్యప్రభా
కలనాథఃకరశైత్యధైర్యపటుజాగ్రచ్ఛౌర్యధుర్యున్ స్వశ
త్రులసత్సర్వసపర్యుఁ గృష్ణనృపవర్యున్ నిశ్చలౌదార్యునిన్. 68

గీ॥ అతఁడు రంగమవలన నెయ్యమునఁ గాంచె
కీర్తివర్ధిష్ణు మాఱటకృష్ణు భోగ
భాగ్యనిర్జితవిష్ణు శుంభత్ప్రతాప
కృష్ణు రోచిష్ణు విమతాసహిష్ణుఁ గృష్ణు. 69

చ॥ మఱియును గొండభూవిభుఁడు మక్కువఁ గాంచెను రంగమాంబయం
దరిమహీపాలసంతతసమర్పితమత్తగజాశ్వభూమణీ
త్కరధనముఖ్యసర్వపరిధాననిరర్గళదానశూరతా
పరిముదితాఖిలార్థిజనపాలిని దిమ్మనమాళి వెంగనన్. 70

క॥ వెంగన నృపాలుకీర్తి ది
గంగన లంగముల నలఁదు నల మలయజమున్
రంగస గాంగతరంగపుఁ
బొంగన నంగగు భుజంగపుంగవుదీప్తిన్. 71

క॥ మెచ్చుగ వెంగనృపాలుఁడు
లచ్చమయెడ జగ్గనృపతి లక్షణవతియై
మెచ్చిన తిమ్మాంబికయం
దచ్చపుఁదమి రామనృపతి నాదృతిఁ గాంచెన్. 72

క॥ నిశ్చలమగు ధైర్యంబున
నచ్చెలు వగు జగ్గనృపతి నెమ్మి వరించెన్
బొచ్చెమ్ము లేనిగుణముల
మచ్చికఁ జెలువొందు వీరమను వేడుకతోన్. 73

క॥ ఈ కరణిని చెన్న ధరి
త్రీకాంతు మహాన్వయంబు వృద్ధి నెసంగెన్
శ్రీకరుఁడై వెలసెను మే
ధాకలితాత్ముఁ డెఱకొండధరణీపుఁ డెలమిన్. 74

సీ॥ తనదానధార యుగన్వంతునకు నిరం
తరమూర్త్న కన్యాప్రదాత్రిగాఁగఁ
దనహేతి యప్సర స్తరుణుల కశ్రాంత
నవవిటానీక సంధాత్రిగాఁగఁ
దనయశంబు చకోరతతుల కనారతా
భ్యవహారమహిత సంపాదిగాఁగఁ
దనప్రతాపము కోకదంపతులకు సంత
తప్రమోద రసప్రదాయిగాఁగఁ
గీ॥ దనరె బిజ్జఁకుప్ప భూధవవతంస
కలశపాథోధిపూర్ణిమాశమఁద్వైరి
చటులబలసీరి సంగరజయవిహారి
భూరిగుణహారి యెఱగొండభూపశౌరి. 75

ఉ॥ ఆ యెఱగొండభూపమణి యత్యనురక్తి వరించె భద్రసం
ధాయినిఁ బెద్దమాచమ నుదారగుణశాలిసజ్జన
ధ్యేయసుశీల ధర్మభృతదీక్ష నిజాశ్రితబంధురక్షణో
పాయమహత్త్వదక్షఁ బతిభక్తిసహాయ నమేయధీనిధిన్. 76

గీ॥ అట్టిపెదమాచమాంబికయందుఁ గాంచె
వేడ్కనెఱిగొండభూపతి విబుధగణ్యు
విస్ఫురితపుణ్యుఁ బదనమద్విమతమేది
నీధవశరణ్యుఁ బెదతిమ్మనృపవరేణ్యు. 77

సీ॥ కమనీయదక్షిణ కాశికాక్షేత్రంబు
రహిమించ నెవ్వని రాజధాని
తుంగాఖ్యగంగాతరంగ రంగత్క్ష్మాళి
బ్రహ్మేశుఁ డెవ్వనిపాలివేల్పు
పాదుకాదత్తకుంభద్ద్రోణివాయముఖ్య
వస్తు లెవ్వనియింట విస్తరిల్లు
ధరవంతు కెక్కుఁ గందవోలిదేశంబు
గణుతింప నెవ్వనికాణయాచి

గీ॥ సిరులఁ జొప్పునలంపూరిసీమ కెల్ల
నాథగాఁ దనుఁ దేశాయినాడకరణ
మనెడువిఖ్యాతి యెవ్వాని కలరె నతఁడు
వొల్సె బిజ్జులపెదతిమ్మభూవిభుండు. 78

సీ॥ పంకజాతాకర ప్రకటసంచారంబు
గల మహాశమతంబుఁ గలయుకొదువ
నోలిదానంబు చండాలురకిడు ఘనా
ఘనులతోఁ గూడిన కల్మషంబు
విసువక ఘనపక్తి వేళ్ళకుఁ బెకలించు
నక్కటిని భజించుహైన్యవృత్తి
నెప్పుడు జగత్ప్రాణిహ్యాతిఁ బంట విషమిడు
నలభుజంగాధిపు నంటునఘముఁ

గీ॥ చూపిగొనియె వసుంధరా పద్మనయన
సరసబిజ్జల పెదతిమ్మధరణినాథ
చంద్రభుజవీథి నిలిచి తచ్చరణలసద
శేషవిష్ణుకథాసుధాసేచనమున. 79

సీ॥ దుర్వారమదయుక్తిఁ దూఁగాడు కుంభినీ
పతుల నఖంబులఁ బట్టియొగురుఁ
గటకాంతరస్థితి గర్జిల్లుపురుషసిం
హములఁ జంచూపుటాగ్రములఁ జించుఁ
వైరిగాఘనాఘనపటలముల్ రా నిజ
పక్షమహాబలప్రతతిఁ దఱుముఁ
బరవాహినీసముద్భవమయ్యెఁ బ్రవహించు
కీలాల మెదనిండఁ గ్రోలి మెఱయుఁ

గీ॥ నతులవిక్రమలీల నేయనఘమూర్తి
చండిమాఖండగండభేరుండబిరుద
మతఁ డెసంగను రాయవేశ్యాభుజంగ
భాసురాంకుండు పెదతిమ్మసార్థివుండు. 80

సీ॥ పుడమిఁ గంకణమాత్ర మిడుదాత ఘనుఁడు క
ళామాత్ర మిడుదాత సోముఁ డరయఁ
బలమాత్ర మిడుదాత యలశిబి సాలుమా
త్రంబిచ్చుదాత నిర్జరులగిడ్డి
క్షితిఁ బాదమాత్ర మిచ్చినదాత బలి నిజా
సవమాత్ర మిడుదాత యవు ఖచరుఁడు
త్వక్మాత్ర మిడుదాత తాపని యిష్టమా
త్రం బిచ్చుదాత నిధానభర్త

గీ॥ యనుచు వారి వదాన్యత నపహసించు
సకలదేశసమాగతయాచమాన
పరమనోరథసంపూర్తి వఱలఁ జేసి
భూరివిభవుండు పెదతిమ్మభూవిభుండు. 81

ఉ॥ ఆ పెదతిమ్మభూమివిభుఁ డర్థి వరించెను గామమాంబ వ్యా
ప్తాపితవిష్ణుసద్గుణకదంబ లసత్కరుణావలంబ స
ద్రూపవిలాసకాంతినికురుంబ ముఖద్యుతిదీర్ణపూర్ణతా
రాపతిబింబఁ గీర్తినికరప్రవిడంబితశంబ డంబుగన్. 82

ఉ॥ ఆ సతియందుఁ గాంచెఁ జెలువందుకుమారుని శక్తిసంపదన్
భాసిలుశూరునిన్ బుధజనస్తవనీయవిహారునిన్ గుభృ
త్త్రాసవిధాయిశౌర్యసముదారుని గృష్ణనృపాలధీరునిన్
ధీసరసీజసూతిఁ బెదతిమ్మమహీశుఁ డతిప్రకాశుఁడై. 83

సీ॥ వాహినీశాంతరవాసియై యొప్పు దు
ర్వారారిదరయుక్తిఁ బ్రబలఁ డేనిఁ
బంకజాతాలయోపాశ్రితుండై పూత
నాభీరునిహతిఁ జెన్నారఁ డేని
సతతసమ్మదమహోసవభోక్తయై గురు
వ్రజభామినీరతి వరలఁ డేనిఁ
గల్పసత్యాసక్తికలితుఁడై మహిజాత
రూపాహరణవృత్తిఁ జూపఁ డేని

గీ॥ సరియనఁగవచ్చుఁ గృష్ణుఁ డీజగతియందు
సహితసమవర్తి ధర్మశశానువర్తి
సత్క్రియస్ఫూర్తి సర్వజ్ఞసన్నుతాచ్ఛ
కీర్తియై పొల్చుబిజ్జలకృష్ణపతికి. 84

సీ॥ ఫణికులాకుల మైనపాతాళమున కేఁగు
వేగఁ బొంగుచు గాంగవేణిసరణి
దుర్గమక్షోణిభృద్వర్గముఁ జరియించు
సాగరు సింహకిశోరిదారి
వంబరంబున నిరాలంబమై మిక్కిలిఁ
గ్రీడించు నైంవరేఖ కరణి
నుగ్రజలగ్రహవ్యగ్రపాథోరాశి
మించి లంఘించు రాయంచపోల్కి

గీ॥ భువనవిస్ఫూర్తి సత్వసంపూర్తి విబుధ
హర్షకరకీర్తి నరవినుతాచ్ఛమూర్తి
వర్తిలిన కృష్ణరాయేంద్రు కీర్తియవుర
రమణులకు నెన్నభీతి కృత్రిమము గాదె. 85

మ॥ అవురా బిజ్జలకృష్ణరాయహయఖురింఖాతిక్షతక్షోణిసం
భవధూళీపటలంబు డంబుగ నభోభాగంబునన్ నిండి యం
దు వివస్వంతు సకృత్ప్రకాశమహిమాదుర్లక్ష్యుఁ గావించినన్
గవిసార్థంబు యథార్థమయ్యె నను నక్షత్రద్యోతనామంబులన్. 86

సీ॥ కరము జడస్థితిఁ గలనైనహారిపేరుఁ
నెఱుగనిదానవద్విరదములను
ఘనులెల్లఁ దమకు వంకలు గణింపఁగ మహో
ఘములు రాఁబొసునట్టి గట్టుమగలఁ
దఱిమి మీఱ ఱ్రోఁపున ధర్మశాలిక్షేత్ర
తతులు పాలించినవారకానిఁ
బరఁగ గోజాము మహోబలప్రబోధం బెప్పు
డాచరించుచు నుండు నలగిరదుని

గీ॥ సడలి హరిపాదసేవనాసక్తు ననఘు
సాధుసంరక్షణోత్సాహు సారబలస
హాయు బిజ్జలకృష్ణరాయక్షమేశు
మెచ్చి ధర తద్భుజాపీఠి నచ్చి నిలిచె. 87

సీ॥ పండ్ల యూటలు ద్రావు పారిజాతంబును
గాలిఁబోయెడు కాలకంధరంబు
నల్ల నదీనుఁ జూ నమృతపయోనిధి
గతిలేని నాకలోకంబుమణిని
గడు వసువ్యయమునఁ గార్శ్య మొందుసుధాంశుఁ
గూడు లేకటవి నొక్కిన దధీచిఁ
గఠిము పేర్చిరఁ బుఁ గను కామధేనువు
భైక్షాశి పంచలఁ బడు కుబేరు
గీ॥ ధరిసదావనీకవృత్తి నలులు శిబిని
సరియ మధ్యాహ్నదారిద్ర్య మందు కర్ణు
నెసయ నొల్లక బిజ్జలకృష్ణరాయ
ధరణీవల్లభుఁ డనిల్చె దానలక్ష్మి. 88

చ॥ అనముఁడు కృష్ణరాయవసుధాధిపుఁ డా జనపల్లి వేంకటా
వని పకుమార్గిౖయె ధరణి వార్తకు నెక్కినఒచ్చమాంబ నో
ర్పుని గడు నేర్పునం గలిగి ఘట్టినయింటికిఁ జొచ్చినింటికిన్
ఘనముగ వన్నె వాసి చెలఁగ న్మను సాధ్వి వరించె మించుగన్. 89

సీ॥ నాయక నేలదున్నకము మాన్పఁగ లేని
యల రత్నగర్భ గంధానుషక్తి
ధవు దూఁడగాపరితనము వారింపని
సంపన్మృగాక్షి చాంచల్యగుణము

పతి యప్పుడేూసెడిభంగ నెడల్పని
వసుమాత ప్రతికూలవర్తనంబు
నాత్మవల్లభునెత్తి యప్పుడేఁ పెల్ల దిం
చని యపర్ణాహ్వయచండితనము

గీ॥ నొంచి వారల నిరసించి హృద్యవినయ
వతియు స్థిరమతియును శీలవతియు సాధు
మతియు నై పొల్చెఁ దను మానవతులు మెచ్చ
భళిర బిజ్జలకృష్ణేంద్రుబచ్చమాంబ. 90

మ॥ అల బచ్చాంబికయందుఁ గృష్ణవసుధాధ్యక్షుండు నిర్గాంచె నా
కలశాంభోనిధికన్యకామణియెడన్ గంజాక్షుఁ డామోదినై
వలరాజున్ గనఁలీల భూవలయభాస్వత్కీర్తికల్లోల బి
జ్జలతిమ్మక్షితిపాలు పాలనయనాస్తోకార్చనాలాలసా. 91

సీ॥ తలయేఱు గలిగి నిచ్చలు గండములు సెంచి
గతిమాలు గిరులసాంగత్య మెడలి
దుర్వర్ణయుక్తిబంధురమైన నెమ్మేనఁ
బొడలూను కరటులపొందు మాని
భరితమహోక్షయపాండురగాత్రుఁడై
గొంటెఁ గ్రుమ్మఱు ఘోణిజంట వదలి
చెవులవిన్కిడిలేక సీదనంబునఁ గాన్పు
పేదయైన భుజంగుఁ బెనగు టుడిగి

గీ॥ ప్రేమ రామాభిరాముని రామయాంగ
రామణీయకవిభవవిరాజమాన
కలన విహరించు నిను ధరాకాంత సెందె
దీపితాటోప బిజ్జలతిమ్మభూప. 92

మ॥ "అరుదా రంభకు నిచ్చ యౌవననితాంతాసక్తి యాశ్చర్యమా
పరికింపన్ శశిరేఖకున్ దమి మహాపాశ్చాత్యయోగం" బటం
ద్రు రహిం దిమ్మనృపాల నీపలుకు లైం ద్రుంపన్ దివిన్ సిద్ధియం
బరురాహుత్తులు చేరి యచ్చరలం బ్రేమం గూడం దత్ప్రాగ్వ్యటుల్.

సీ॥ "పటుమహాసవపూర భరితులౌ తురకల
స్ఫుటమహాసవసారభోక్తలుగను
వరసుధర్మాభోగవారణులౌ ఖానుల
నురుసుధర్మాభోగయుక్తులుగను
వారక సన్మార్గహారులౌ నబిసీల
సంతతసన్మార్గచారులుగను
దతసుమనోభివర్ధన మూన్ప్యయవనుల
సమధికసుమనోభిసంగులుగను

గీ॥ జేసె నఘటనఘటనావిశేషభాస
మానచాతుర్యధుర్యతానూనకలన"
నను చు నీధాటి వినుతించు నహితకోటి
ధీరసల్లాప బిజ్జులతిమ్మభూప. 94

ఉ॥ భోరనం గృష్ణరాయనృపపుంగవు తిమ్మనృపాల నీశితో
దారకరాసి డాసి యనిలాస్త్రక్రియన్ నటియించుం గానిచో
జోరుమసూదుఖానదరణశూరుని ప్రాణసమీరణంబులన్
బారణసేయుచే నిమిషమాత్రములోనన శ్రీసమగ్రమై. 95

సీ॥ పోరుచేసి కరంబు నోరెండిపడు వారిం
జేరదు తనపయోధారగూర్చి
యంతపాలికిం జేర కఱుకుచు నెళవులు
గొను వారిం బెంప దక్కువ ఘటించి

మొఱఁబడువారి సమ్మదమునఁ దేర్పదు
పట్టి రమ్మని తనప్రక్కనుంచి
తొడికాళ్లుగాన లేచి యడుగునఁ బడువారి
స్వస్థులఁ జేయగు చంకఁజేర్చి

గీ॥ విజయలక్ష్ములఁ బ్రోవదో వెలయ శౌర్య
నందనులఁ గావదో మహానందకలన
మీరి నిర్జయయయ్యె నీ నాటి యాత్ర
దీపితాటోప బిజ్జలతిమ్మభూప. 96

సీ॥ అంగరంపుఁబులితోలు బొంగరంగ నుండగా
పసిమిపుష్పాడితేల మిసిమిగులుక
ఘోరిన వాగరు బొడ్డుఘంటల పేర
ఘంటలు మొరసిలు కటిని మోగియ
వాలుపేరిటి వేణి జాళువాప్పరజను
సంపంగిపూగండ సొంపు నింప
బిరుగంపుజగజంపు రుమాయిజల్లుగాన్
చామరంబు విభసంబు వెలయ

గీ॥ వరఫలాశాఫలంబు పావడలునిగుడ
నాజమహి తేజి నెక్క మున్నధిపసి చె
వేడ్క జయలక్ష్మి రీతినేన్పికిలిచెన్న
ధీరు నెడఁబాసి నిన్నఁజేరి తిమ్మభూప. 97

సీ॥ మొనసి సీదుకటారి మోనపోటు నాటఁగా
గాట మూ రంభచన్నొప్పటుగలిగ
నీబాణ మొన గంటి నివ్వటిల్లఁగఁ జేయు
హారిణిచే మోవికా టుందఁ గలిగ

నీజయభేరికా నినదముల్ చెవిసోఁక
వెస శారమణితముల్ వినఁటగలిగ
నీఖడ్గ మంగముల్ నెఱ నాముకొన మేన
శాకాంత జడవాటు కవయఁగల్గె

గీ॥ సార గుణము కెంతయుపకారి యనుచు మెచ్చు
మోహమున నిన్ను నాహవోన్మూలితోగ్ర
వికలి చెన్నతమాపాలవీరసమితి
దివిని శుభరూప బిజ్జులతిమ్మభూప. 98

గీ॥ ధరణి పతిగజసింహాసనద్విరద చింత
కుంట ధర్మరాజేంద్రునికూఁతు నలరి
యక్కమాంబను వరియించి యంత జార
మాంబ నుద్వాహ మైతి వీ వాదరమున. 99

క॥ ఆయక్కాంబిక బంధుని
కాయపరిస్ఫూర్తియమానఘనపాతివ్ర
త్యాయత సతతకృపాధా
రేయతఁ గను నతిశయిల్లె శ్రీవిలసితయై. 100

సీ॥ అశ్రాంతపంకజాతాలయ యాలక్ష్మి
ననయంబు చండిక యైన గౌరి
బహుభాషిణి యనంగఁ బరఁగు చుండెడు వాణి
నరయంగఁ బాంసుల యైన ధరను
వడి సుళ్ళచేఁ జాలఁ దడఁబడు జాహ్నవి
దమయంతి యగు నైషధప్రమదను

సైరంధ్రి యై ధరాస్థలి మను ద్రౌపది
            నకులీన యగు, నరుంధతిని గెలి

గీ॥ పలచి పుణ్యయశమామితవాక్సతిత్వ
భద్రరతుణ సంపత్తి పావనాస్వ
వాదూజననంబులను ధాత్రి వార్త కెక్కు
ననుపమానగుణాలంబ యక్కమాంబ. 101

క॥ సారమణీవైఖరి బుధ
వారమనోభీష్ట మొసఁగి వసుమతి సారా
చారమనోజ్ఞత వర్తిలు
శారమ శ్రీరమ యనంగ బాంధవుల దయన్. 102

సీ॥ పాకవిధ్వంసిఁ జేపట్టు పులోమజ
            పుణ్యజనాళిని బొందు లక్ష్మి
బ్రహ్మఘాతుకుని నేర్పడ వరించిన గౌరి
            తలకొట్లమూరిని దగులు వాణి
కడు గురుద్రోహిని విడువని ద్రౌపది
            నవిసంగతుని ప్రేమ నంటు స్వాహ
యనిశమహాబలాహరి గూడిన ధాత్రి
            శివధర్మ మర్దనుఁ జేరు సీత

గీ॥ సాటి యని పల్కవచ్చునె సకలసుగుణ
భానమాననిజేశసేవానమౌన
మధురసానూనలసమానమానసాబ్జ
యైన బిజ్జలశ్రీశారమాంబతోడ. 103

క॥ అలయక్కమాంబయొడఁ బు
త్రులఁ గాంచితి వీవు సుగుణాలోయధి యనుచున్
చెలువందు ధర్మభూవరు
కులభూధరధృతివిశాలుఁ గొండన్నపాలున్. 104

సీ॥ శాంతరసంబు సాక్షాత్కరించె ననంగ
దాతృత్వ మాకృతిఁ దాల్చె ననఁగఁ
బటుధైర్యమహిమ రూపము ధరించె ననంగఁ
గరుణ సాకారమై నెరసె ననఁగ
శూరత యుపఘనస్ఫురణఁ జూపె ననంగ
వినయంబు పుంభావ మొనసె ననఁగ
దాక్షిణ్య మవయవోదార మయ్యె ననంగ
న్యాయంబు సాంగమై యలరె ననఁగ

గీ॥ నేపెసంగ జగద్రక్షణైకగతుఁ
శాశ్వతైశ్వర్యధుర్య రామేశ్వరాంఘ్రి
మహితసారసలాలసమానసాళి.
భవ్యగుణశాలి ధర్మభూపాలమౌళి 105

సీ॥ ప్రకటదానములంద ప్రతిదినం బానలఁ
జేచాఁచు నట్టి దిక్సింధురముల
నడవడి దప్పి యేర్పడ నీళ్ళమోపరు
లొసఁగు నప్పులఁ దోఁగుచుండు గిరుల
జోగులఁ గలసి యుద్ధోగతి నంటుచుఁ
బడగ లెప్పుడు మోయు పాపతేని

నడవిలో వెల్వెలనై వేరువెల్లంకి
త్రివ్వకతినకు భూదారవరుని

గీ॥ మూని సర్వంసహాకాంత మరగి నిలిచె
నతులసామ్రాజ్యధౌరేయుఁ డఖిలవిబుధ
సతతభజనైకచతురుఁడు చతురుపాయుఁ
డైన బిజ్జులధర్మభూజానిమణిని. 106

చ॥ బలయుతుఁడైన ధర్మమహిపాలుకృపాణము కృష్ణమూర్తియై
వెలయును గానిచో నసునివేశన మూన్చి భజించువైరికు
జ్వలసురతాప్తి నిర్జరమసారమణీమణీయవేణికా
కులసురతాప్తియుఁ మిగులఁ గూర్చి యెసంగునతన్న ణంబునన్. 107

సీ॥ సింధుదేశమున కేశ్రీఘనుఁడానాంబు
తతి బహుజీవనస్థితి యొనర్చుఁ
గాశ్మీరమున కేజగత్పతిభాషాభి
ముఖ్యంబు మేదురామోద మొసఁగు
సౌరాష్ట్రమునకు నేశిసవరపూతపౌరిథి
యరయ శోభాస్పదస్ఫురణ గూర్చుఁ
గరహాటమునకు నేవరరుచితేజంబు
మేలిమిదులకించుడాలు నిల్పు

గీ॥ మత్స్యమున కేరసాధీశు మహితధామ
మమలకమలాప్తి ఘటియించి యలరఁజేయు
నతఁడు సామాన్యుఁడే బిజ్జులాన్వయాబ్ధి
పూర్ణిమాబ్జారి శ్రీధర్మభూపశౌరి. 108

---

§ దీని యర్థము విచార్యము.

చ॥ వలగొని ధర్మభూపశరవహ్ని తపింపఁగఁజేయ వేదనా
విలతనులై విరోధినృపవీరులు బీరము దూలి జాలి లో
జలికి తదీయపాదజలజాతములం బడి వ్రాలినఁ గృపా
కలనతఁ డార్తిమాన్చి యనిఁ గాచె మహాతనుకేతనాంకముల్. 109

సీ॥ సేవింప నిచ్చును క్షీరపాథోరాశి
కాచిన నిచ్చును గల్పశాఖ
పాదమానఁగ నిచ్చుఁ జార్ణమానీశశి
పేరుకో నిచ్చును సౌరభేయి
డాలు పట్టఁగనిచ్చు నాలేఖరత్నంబు
వినుతింప నిచ్చు శిబిప్రభుండు
నెన్ని గూయఁగ నిచ్చు నీలజీమూతంబు
దండ మానఁగ నిచ్చు దైత్యవిభుడు

గీ॥ కాన వారల దాతలగా గణింపఁ
దగున నిర్హేతుకకృపానితాంతకాంత
సంతతావితనానాదిగంతబుధవ
నీవు ధర్మమహీపు వర్ణించుచోట. 110

చ॥ అతఁడు నరించె శేషముఁ గృపాశ్రితబాంధవమిత్రపోష స
చ్చతురమనీష మంజులవచఃకలనాజితధాతృదోష మా
నితపతిభక్తియుక్తిరమణీయవిభూష మహానుశీలతాం
చితనిజవేష మాధవవిశేషమహార్చనతోషమానసా. 111

సీ॥ జాహ్నవికైవడి సంతతాశ్రిత కవి
శ్రేణి సంరక్షించు శేషమాంబ

పార్వతిమాడ్కి నిబటుకుమారోదయ
స్థితి రహించుచు నుండు శేషమాంబ
భారతిరీతిని బహునరస్తుత్య సా
శీల్యంబు భరియించు శేషమాంబ
మేదినిభాతి నమేయక్షమాభిఖ్య
చెలువ బు మతిఁ బూను శేషమాంబ

గీ॥ అనుచు బాంధవసందోహ మభినుతింప
నిత్యపావనతాధర్మనిర్మలత్వ
సహజసహనత్వముల ధరాస్థలిఁ జెలంగు
స్థిరగుణాలంబ ధర్మేంద్రు శేషమాంబ. 112

క॥ శేషమువలనఁ గాంచెను
భాషాశేషుండు ధర్మపార్థివుఁడు మహా
భీషణవిద్వేషణభయ
వేషావహాకరణభరణు వెంకటరమణున్. 113

గీ॥ ధర్మభూపాలమౌళికిఁ దమ్ముఁడగుచుఁ
దనరు నిమ్మడికొండేంద్రుఁ దరమె యెన్నఁ
జండభుజదండమండితమండలాగ్ర
ఖండితోద్దండరిపుమహీమండలేంద్రు. 114

మ॥ పలుకుంబొయ్యలిఁ జెప్ప వట్టి ధవళాబ్జాతాళులన్ మెట్టి ద్యో
తలకల్లోలవతీతరంగచరకాదంబచ్ఛటల్ ముట్టి య
గ్గలికన్ శారదనీరదాఘపద మాఁకంబెట్టి ధట్టించె బి
ట్టలవో కిమ్మడికొండభూవిభు సమాఖ్యాహంసి చిత్రంబుగన్. 115

సీ॥ పరధరాధీశ్వరుపాదంబు లెనయించె
నాత్మీయకుంభినీనాళి నెల్ల
బలువీరతరులగుంపులుదాఁగులాయంబు
గాఁజేసె వాజిసంఘముల నెల్లఁ
గరము నానావనీవరయోగ్యముగఁ జేసెఁ
గాంచనస్యందనోత్కరము లెల్ల
మెఱయురసాధిపుశరణ మందఁగఁజేసె
నిర్వేలవాహినీనివహ మెల్ల

గీ॥ నరయ నుచితజ్ఞుఁడౌర ప్రత్యర్థిధరణి
పాలుఁ డిమ్మడికొండభూపాలుధాటి
పరువు లిడువేళ నాయాయివస్తువితతి
తగినయెడలను మఱవక తార్చెఁగాన 116

సీ॥ అప్పుగా కియ్యఁ డొంకైనఁ బర్జన్యుండు
పూటగా కియ్య దెప్పుడును సురభి
వృద్ధిలే కియ్యఁడు వెన్నెల రాయఁడు
పత్రంబులే కీదు పారిజాత
మెత్తున కెత్తుగా కియ్యఁడు శిబివిభుఁ
డడుగుగా కీఁడు దైత్యాధినాథు
డుత్తరాశనె కాని యొసఁగఁడు ధనపతి
యిల్లటమున్నఁగా కీయఁ డబ్ధి

గీ॥ యనుచు వారివదాన్యత లపహసించి
వలసినంతయుఁ గోరినవస్తులెల్ల

సకలదేశాగతార్థార్థిసమితి కొసఁగుఁ
గూర్మి బిజ్జలయిమ్మడికొండవిభుఁడు. 117

మ॥ అవురా! యిమ్మడికొండభూవర సముద్యద్దోర్భుజంగేంద్రులో
సవలీలన్ గవగూడి కాంచుఁ గరవాలాభీలజాగ్రద్భుజం
గి విరోధిక్షితిమండలేశ్వరమదాకీర్ణద్విపాస్తంభకుం
భవిభేదచ్యుతమౌక్తిక ప్రకరదంభస్ఫాయదండంబులన్. 118

సీ॥ కటకాధివాసులై కనుపట్టువైరులఁ
గటకాధివాసులఁ గాఁగఁజేసె
గంధర్వసంగతి గమనించువిమతుల
గంధర్వసంగతి గాంచఁజేసె
వాహినీసుస్థితి వఱలుప్రత్యర్థుల
వాహినీసుస్థితి వఱలఁజేసె
నచలశృంగారవిహారులౌ శత్రుల
నచలశృంగారంబు లంగఁజేసె

గీ॥ నించు కేనియు శాత్రవ మొకఁడలంప
కెంతయౌచిత్య మెఱుఁగు మేలిద్ధరిత్రి
బిజ్జలాన్వయ రాజీవబిసరుహాప్తుఁ
డైన యిమ్మడికొండభూజానిహేతి. 119

చ॥ అతఁడు వరించె నంచితదయానికురుంబను సీతమాంబ నూ
ర్జితసుగుణావలంబ యయి చెల్వు వహించిన కృష్ణమాంబ న
చ్యుతుఁడు రమాపురంధ్రిని మహోన్నతి భూతరశాక్షిఁబోలె స
త్కృతులితసంపదాప్తి సహనాప్తియుఁ గల్గి చెలంగువారలన్. 120

చ॥ ఎలమిఁ దలంపఁ దిమ్మధరణీశ్వర నీ వల బోరమాంబయం
దలఘుతరప్రతాపనిధులై తగు శ్రీనరసింహు సత్కృపా
జలనిధిఁ గృష్ణభూవిభుని సాహసభార్గవు బచ్చభూపతిన్
బలజితభీమసేనుల శుభస్థితి గాంచితి వా కుమారులన్. 121

సీ॥ అరిఁ జూడ స్తంభోద్భవాఖ్యనొందకయున్నఁ
బెఱవారి కడ నోరు దెఱవకున్న
శత్రులచెంగట నటలు చూపకయున్న
నభియాతిహతి కడ నరయకున్నఁ
బెల్లు దాయయెదుర్ప గోళ్లు సెందకయున్నఁ
బగతుఱయెడ వెల్లబాఱకున్నఁ
గ్రూరాహితునకు ద్వైరూప్య మూనకయున్నఁ
బరిపంథిఁ గని వాలు మఱవకున్న

గీ॥ దీటునఁగ వచ్చు నరసింహదేవుఁ డాహ
వక్షమాబలదక్షవిపక్షధరణి
మండలాధ్యక్షశిక్షణాఖండహస్త
వీక్షణుం డైననరసింహవిభునితోడ 122

సీ॥ ధామనిధిప్రథోద్దాముఁ డానితని కా
శ్రితచక్రసంభృతి చిత్ర మగునె
రాజశేఖరుఁ డన రంజిల్లునితనికి
శాశ్వతైశ్వర్య మాశ్చర్య మగునె
చతురాననవిలాససహితుఁ డా నితని
కతులకళావాప్తి యరిదియగునె

బలభద్రవిస్ఫూర్తిఁ బరగు సీతనికిఁ గృ
ష్ణాగ్రజవిఖ్యాతి యబ్బునుగునె

గీ॥ యనుచు బుధకోటి వినుతించు ననుదినంబు
నెవ్వఁ డాతఁడు సామాన్యుఁడే యుదార
ధీరవీరగుణాధారతిమ్మనృపకు
మారబిజ్జలనరసింహమనుజవిభుఁడు. 123

మ॥ అవురా బిజ్జలతిమ్మభూవిభునృసింహాధీశుబాహాసిరా
హవవు మాద్యత్పరరాజమండలము సద్యోశీర్ణమానట్లుగాఁ
గవళింపం గని సమ్మదం బెదఁ బొసంగం బద్మినీచక్రముల్
సవికాసస్థితి గాంచె సత్ప్రికర మంచచ్ఛ్రీ భరించెఁ దమిన్. 124

సీ॥ గడగడనడఁకి నల్గడలఁ బాఱు తురుష్క
వాహినీచ్ఛట డాఁగ వనధియయ్యెఁ
బోఁగాల్గు లేక బల్బుసకొట్టి పసు పార
సీకాహితతికి వల్మీకమయ్యె
వెఱ నిజపక్షంబు లఱఁ బోవు పాశ్చాత్య
కాశికాళికి నంధకారమయ్యె
భువి దిగంబరులైన యవనయోగుల కాయ
ములు నిండఁగా భూతిపూఁతయయ్యె

గీ॥ ననుచు నానానజీరు లైవ్వనిమహోగ్ర
చటులధాటీనిరాఘాటపటుతురంగ
ఖురసముద్ధూతధూళిఁ జేర్కొనుచునుందు
రతఁడు సామాన్యుఁడే నృసింహప్రభుండు.

ఉ॥ ఆ నరసావనీశుఁడు ప్రియంబలరంగ వరించెఁ దిప్పమాం
మానవతీలలామ ననమానదయాసుగుణాభిరామ సా
ధ్వీనివహానిశప్రణుతధీగరిమాపరసీమ సప్తసం
తానముఖోల్లసత్సుకృతధామ సుధామయవాగ్ధురంధరన్. 126

ఉ॥ ఆ వరనేంద్రుతిమ్మఁడు మహావిభవేంద్రుఁడు చెన్నసంగు దు
ర్మానవిరోధిభూధవపరాభవకారణవారణాదిసే
నానివహాతిసాంద్రుఁడు ఘనాఘనగర్జితతర్జనైకదీ
క్షానకరావభీతవిమతాధిపజిష్ణుఁడు కృష్ణుఁ డిద్ధరన్. 127

సీ॥ దుర్గమాత్మీయారివర్గవిముక్తిచేఁ
దగి వాహినీకబంధములఁ దోఁగి
సారంగవరచర్మధారణం బొనరించి
వనవాసిసంయోగ మనువుపఱచి
భరితతుమూభూతిపైఁ గోర్కి కడుఁ బెంచి
విజ్ఞానమున మానవిధి వహించి
భూరిరుచిరమణీసారకాంతు లడంచి
కఠినానసస్థులై కన్నమోడ్చి

గీ॥ మోక్షమార్గంబు గైకొనుదీక్ష నరులు
పరమ మని యెంతు రవ్వానిభవ్యనామ
మతని బిజ్జలశ్రీకృష్ణ సహితతృష్ణ
భోగజతృష్ణ నేరికిఁ బొగడఁదరమె. 128

సీ॥ కుంభినీపతులతోఁ గూడియుండుటఁజేసి
దంతీంద్రముల కింత దలఁకధర్యు

భూదారవరులతోఁ బొత్తుగాంచుటఁ జేసి
క్రోడపరంపర క్రోడదయ్యె
పురుషసింహములతోఁ బొం దొనర్చుటఁ జేసి
హర్యక్షముల కాత్మ నదరదయ్యె
ధరణిభృద్వ్యాఘ్రతత్పరతఁ బొల్చుటఁ జేసి
శార్దూలసమితికి జడియదయ్యె

గీ॥ బిజ్జలాన్వయపాథోధిబిసరుహారి
యైనతిమ్మేంద్రుకృష్ణభూజానిచంద్రు
ధాటి నిలు వోపలేక కాంతారవాటిఁ
బాటిలినచింత శత్రువధూటికాళి. 129

క॥ ఆకృష్ణధరాధిపమణి
చేకొని తాఁ బెండ్లి యయ్యె స్థిరతరసత్కీ
ర్తీకలనాకృతకృత్యల
శ్రీకరయశ లక్ష్మమాంబ శ్రీతిమ్మాంబల్. 130

గీ॥ ఆమహామహాలసనుజన్ముఁ డలరు బచ్చ
ధరణిపాలుఁ డనారతదానశీలుఁ
డరివిఘాలుఁడు హరిసేవనాతిలోలుఁ
డతులకరుణావిశాలుఁడు నగుచు మిగుల. 131

సీ॥ నింకుజాఁబిల్లిఁ గుందించు నన్న విపాంసు
శరజంబు నాకులపఱచు టరుదె
గరుడతుండంబు వంకలుసేయు నన్న ద
ర్వీకరేంద్రులఁ జుట్లఁ బెట్టు టరుదె

వజ్రముల్ చెక్కులు వడఁ జేయు నన్నఁ బ్రా
లేయాద్రిపక్షముల్ ద్రెంచు టరుదె
మృగరాజు గట్లపాలుగఁ జేయు నన్న ది
క్సింధురేంద్రమునెత్తిఁ జించు టరుదె

గీ॥ చంద్రికాలీల దివము నాశ్రంబు సేయు
ననిన నక్షత్రముల వగ లడఁచు టరుదె
యబ్జజాండకటాహంబు నాక్రమించి
వర్తిలెడుబచ్చభూపాలకీర్తి కరయ. 182

ఉ॥ ఈదృశపుత్రపౌత్రవిభవైకమహోమహిమాభిరామతన్
మేదిని సుప్రసిద్ధిఁ గను మీ కరుదే యిటువంటికావ్యముల్
సాదులు మెచ్చఁగా బహురసప్రతిపాదనలీల హెచ్చఁగా
నాదృతి మీర దేవతల కంకిత మొనర్పుట తిమ్మభూవరా. 183

వ॥ కావున నీ విప్పుఁ డొనర్చిన యనూనరసభావభవ్యంబగు కావ్యంబు శాశ్వతైశ్వర్య విధానావధానకృపానశ్వరప్రభావుం డగు రామేశ్వర దేవున కంకితంబు సేయుమని నేను దత్ప్రభావం బభివర్ణించెద. 184

సీ॥ అరుణశోభాపరిస్ఫురణభాసిజటాళి
కరము పల్లవసముత్కరము గాఁగ
భూషాచ్ఛటాయితశేషాద్యురగపాళి
డం బూనుతీవగండంబు గాఁగ
మందాకినీఝరామందాంబుపూరంబు
ధారాళమకరంద ధార గాఁగ

గాళప్రభావత్ప్రికాశకాయవిలిప్త
భూతి పరాగ సంభూతిగాఁగ

సీ॥ గొమరుజాబిల్లి వికిగుత్తిగొమరు గాఁగఁ
దానన గేష్ణఫలసంప్రదానకలనఁ
గ్రమ్ముగొని నిల్చుకల్పనగమ్ముగతి ర
మేశ్వరస్తుతుసుఁ జొప్పు రామేశ్వరుండు. 135

షష్ఠ్యంతములు.

క॥ ఏతాదృశమహిమావి
ర్భూతసమస్తప్రపంచపోషణరతికిన్
శీతాగమజాతాసమ
వేతాకృతి కసమసమరవిజయోన్నతికిన్. 136

క॥ గంధాంధసింధురాంధక
కంధరజంఘూశుగాసికాదత్తునకున్
సంధాతనుగంధాత్మను
బంధాతను హారణకరణపాలాత్మునకున్. 137

క॥ ఘోటితఫుంగవపతికి వి
పాటితభవతతికి విష్ణుపదభవతటినీ
ధాటీకనదాటీకన
జూటీవనవాటికాచ్ఛనుమదుడుపతికిన్. 138

క॥ ముష్టింపచనిచయమనో
భీష్టదకారుణ్యనిధికి భీమత్రిపురీ

దుష్టాసురకష్టావహ
చేష్టాసరదాశుగ ప్రసిద్ధశరధికిఁ. 139.

క॥ ధర్మమయధర్మధరునకు
ధర్మేతరకర్మమర్మతామసరవికిఁ.
* దుర్మానసధర్మానవ
శర్మానగవాశతౌఘశైలవసతికిఁ. 140

క॥ రాజీవజాండదీపక
తేజోమయదివ్యకాయదివసేశునకుఁ
రాజతగిరిరాజపరి
భ్రాజచ్ఛ్రీప్రాకటారిరామేశునకుఁ. 141

వ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన యనర్ఘరాఘవం బను
మహాప్రబంధనాటకంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన. 142

సీ॥ పృథుగోపురౌన్నత్యభితూర్ధ్వగతిహైమ
వరణాకైతవభాగవధిధరంబు
వరరత్నయాచ్ఞార్థాపరిసరాయాతఖే
యచ్ఛలాన్వీతరత్నాకరంబు
స్వాతిజీవనగోపనార్థాగతమసార
మణిసాధగంధశుంభద్ఘనంబు
సంపదాదానార్థసంశ్రితచంద్రశా
లోపరిభ్రాజితద్యోపురంబు

* చింత్యము.

క॥ ధర్మహర్మ్యనటన్నటీపటలసటన
పటుకళాఖ్యానార్థసంప్రాప్తసాల
భంజికాఛద్మవత్సురభామినీక
లాప మింపొందు నిల నయోధ్యాపురంబు. 143

చ॥ సురుచిరలీలమై వరుసఁ జుట్టును గెంపులు సెక్కి నట్టిభూ
తరుణికడానికమ్మ యనఁ దార్కొనుకొమ్మలతోడికోటచే
బరఁగు నయోధ్య సాటియని పాటిలు వేలుపుమేటివీటి నం
బరతలమంబి కేతుపటపాణితలంబునఁ జెంపఁగొట్టుచున్. 144

గీ॥ విమలమణిశృంగములకల్మి వీటికోట
ధర సదామందరాగవిస్ఫురణఁ దనరె
పరిఖ తద్వేష్టనాహీనపటిమఁ గాంచి
నిబిడవిషపూర సంభృతి నివ్వటిల్లె. 145

ఉ॥ ఆపురిముద్దరాండ్రు పరిఖాంబుచరత్ఫణిరాజసత్ఫణా
ప్రాపిపయోజరాగములు రక్తసరోరుహకోరకభ్రమన్
బైపయిఁ జేరి నిర్భయతఁ బాణులచేఁ గయికొండ్రు నిచ్చలున్
బాపురె బర్హిబర్హకచభారధురంధర లౌటనో కదా 146

సీ॥ సమదసారంగవిభ్రమలీల విలసిల్లి
ఘోరాలహరులచేఁ దారసిల్లి
ప్రబలరథాంగశోభాలీల శోభిల్లి
రాజహంసస్థితిఁ దేజరిల్లి
ఘనమైనసంతానగరిమచే వాటిల్లి
కమలాధివాసమై గారవిల్లి

కలితమహావర్తకస్ఫూర్తి వర్తిల్లి
పద్మినీసంసిద్ధిఁ బరిఢవిల్లి
గీ॥ శంఖమకరనిధిప్రౌఢి సంపతిల్లి
* ...........................
యల్లుదామరకొలను నా నతిశయిల్లె
నాపురంబు సమున్నత గోపురంబు. 147

మ॥ నిరతంబుఁ మణిసౌధవీథికలఁ గన్నెల్ తావిఁ గుంకుమం
బురసారఁ మెయి నల్గువెట్టి జలకంబుఁ జేయుపన్నీరు ని
ర్ఝరశైవాలినిఁ గాల్వలై కలయఁ దత్స్రవర్ణనీరేరుహో
త్కరముల్ వాసన నొప్పఁ గానిమెడ బంగారంబు వాసించునే. 148

ఉ॥ అప్పురిసౌధకేతనపటాంచలముల్ వినువీధి రాయఁగాఁ
దెప్పున రాలి క్రిందఁ నగు దెంచుఘనంబులఁ జిక్కి వృష్టితోఁ
దప్పక ధాత్రిపైఁ దొరఁగి తారతఁ దారలు గాంచెఁ గానిచో
నొప్పునె తారహార మను నుజ్జ్వలనామము మౌక్తికాళికిఁ. 149

చ॥ పురిమణిగోపురం బౌఱయఁ బుష్పవనచ్ఛలనందనావళిఁ
గిరు విడి సౌధపంజరశుకీకలనాదము పేర సన్నుతుల్
నెరపుచు దాని నిచ్చ మని నిల్చుట గోపురమై తనర్చె న
గ్గిరిరిపువీడు తా భ్రమరకీటనయంబు దలిర్ప నేఁటికిఁ. 150

ఉ॥ నాలుగుమాట లేయుగమునాటివొ నేరిచి నర్తిష్ట నంచు నే
వేళను రాజసప్రకృతి వీడక తాల్చి నితాంతపంకజా
తాలయవృత్తి వర్తిలె నటంచు నజుఁ హాసియింతు రెంతయుఁ
బ్రోలిమహీసురుల్ నిగమమూర్తులు సాత్త్వికపుణ్యవర్తనుల్. 151

---

* ఈ పాదము మూలమున లేదు.

సీ॥ గోత్రవిద్వేషంబు గోరని రాజులు
మలినవర్త్మలు గాక వెలయుశుచులు
పరహింస గోరని పరధర్మ లెట్టియు
ఫలమూల డాఁగని పుణ్యజనులు
శరభంగ మూనక పరఁగిన భువనేశు
లహిభయరహితమహాబలాఖ్య
లాశఁ జక్కనియట్టి యర్థపు లేరికి
ననఁ గ్రిందు గాని దుర్గాధిపతులు

గీ॥ కువలయాహితవృత్తిఁ గైకొనని యినులు
తమ్ములకుఁ గీడొనర్పనిదారిఁ దనరు
సత్ప్రభువు లంచు లోకులు సన్నుతింప
క్షత్రియులు పొల్తు రప్పురి సతతులేశ. 152

ఉ॥ ఆకటకంబుకోమటు లనంతమణిక్రయవిక్రయప్రభా
వాకలనన్ జెలంగఁగఁ దదాహ్వయుఁ డైన యిచుంచు భీతి ర
త్నాకరుమర్వఁ జొచ్చి యతఁ డంతకుమున్నె సముండు గాక భం
గాకులుఁ డై చెఱింగి చను నచ్చట నుండక తూర్పుకొండకున్.153

మ॥ అమిత్రైశ్వర్యనిరూఢిఁ గాంచి సురవిప్రారాధనాదార్యధు
ర్యమతిన్ జెన్నగు తత్పురాంఘ్రిజుల దీటంచున్ బ్రశంసింప నో
ప మిత్రైశ్వర్యముమాత్రనే సురవరబ్రహ్మదివిద్వేషదో
షమహోగ్రుం డయి యింతలో నతులభిక్షావర్తియై స్థాణువున్.154

చ॥ అరుదుగ గండభాగముల నంటిన చందిరపున్ ధగద్ధగల్
పరిఢవిలంగ దంతములఁ బాటిలి ధాత్రిఁ జరించు భూధరో

త్కారమున బృంహితప్రబలగర్జితమై మదస్రుతవాంబువుల్
గురియు ఘనాళి నా సమదకుంజరయూథము దిమ్మరున్ భువిన్ 155

చ॥ శరముల ద్రొబ్బితిన్ శరధిసంఘములోఁ బెనుమాను మూలకున్
దఱిమితి నాత్మ లోఁబడ నొనర్చితి నాబడివచ్చుచాయ ను
ద్ధురఖురపాటితక్షితిజధూళిని రూపఱఁ జేసితిన్ ధరన్
సరి తన కెవ్వ రంచుఁ బురిసైంధవబృందము వల్కుహేషలన్. 156

క॥ కరము నిరాఘాటస్థితిఁ
బురికర్బురఘనశతాంగములు సరిపోలన్
దిరిగిన సౌరవిమాన
స్ఫురణన్ గురుశరశరాసముల లోఁబఱచున్. 157

సీ॥ సిడుగుతునక లనంగఁ బొడిపొడి గావింతు
గొరసిన భూమిభృద్వరుల నెల్లఁ
గార్చిచ్చుసెక లనఁ గలసి వేల్తు రెదుర్పఁ
జాలు మహావనీపాలి నెల్ల
సింగంపుఁగొదమ లనంగ ఖండింతురు
పరమత్తకుంభికీశ్వరుల నెల్ల
నౌర్వాగ్నికీలంబు లనఁగ లోఁబడఁ జేతు
రానీకవాహినీశాళి నెల్ల

గీ॥ మాటి కుఱుముచుఁ దేజంబు నేటుపఱచి
దూటి లంఘించి నిబిడహేతుల ధరించి
రార వీ రని తము శూరు లభినుతింప
నొప్పుగాంతుదు తత్పురియొంటరీలు 158

సీ॥ కఠినత గల్గు మీగబ్బిచన్గుబ్బలుల్
గాంచి నారదుఁ డైనఁ గవయ కున్నె
మధురిమఁ జిల్కు మీయధరబింబమ్ములు
చూచి యాశుకుఁ డైనఁ జొక్క కున్నె
మేచక ప్రభ లొల్కు మీకచధ్వాంతంబు
లరసి కౌశికుఁ డైన మరగ కున్నె
మృదురీతి బొలుపారు మీయూరుకదళికల్
గని మతంగజుఁ డైన మొనయ కున్నె

గీ॥ యనుచు భోగసమాసక్తి నలభుజంగ
పుంగవులు వల్కు వచననైపుణికిఁ బొంగి
యంగజాభంగసంగరాలింగనాది
కేళిఁ దేల్తురు పురిభుజంగికలు వారి. 159

సీ॥ కైకొందు సామోదకర పల్లవం బమ్మ
పైకంబునకుఁ గాక పాళి యనుఁగ
ఏపైన వలపులనించు కల్వలనించు
కెరమైనఁ గాని యేరీతిఁ బొసఁగు
సడలనే పట్టునఁ జనుమొగ్గ నాయదే
పట్టియాడంగఁ జొప్పడు నె యిపుడు
తాల్మినై గోరుగేదంగి చాలెనయించు
విను పొందికైనఁ గా దనను నేను

గీ॥ గాంతవదన సరోజాప్తి గలుగఁ జేయు
కలుగఁ దగవందురా యని కడు విటాళి

వచనరచనానుగుణముగాఁ బలికి కులికి
విరులువిల్తురు పుష్పలావికలు వీట. 160

చ॥ కలమపుఁజేల ప్రాలఁ గని కాంతలు గల్లునఁ గూసి లేపగాఁ
జిలుకలపిండు లేచి వనిఁ జేరి రసాలఫలాళి ముక్కుఁదూ
పులఁ జొడువన్ దొరంగురసపూరపునీటఁ జెరుంగటన్ గదా
వెలయు రసాలనామమున వీట జనించు నవేక్షుకాండముల్. 161

మ॥ తటరూఢప్రభవేక్షుకాండతతు లత్యంతంబుఁ బక్వంబులై
చిటులన్ రాలినయాణిముత్యముల వీచీపాళికాహస్తసం
పుట మందూంచి పురోపకంఠసరయూప్రోద్యద్ధునీదేవి ముం
దటఁ దన్నుం గలయంగ వార్ధి గనియెన్ రత్నాకరాఖ్యానమున్ 162

ఉ॥ పోఁకల నల్లిబిల్లిఁ గని పొంగఁ బెనంగుభుజంగవల్లి తా
నాకులపాటు పెందె నని యచ్చపుఁబూజగిఁ బొన్న నవ్వ నాఁ
బోకలవారితోఁ బెనఁగఁబోయిన యాలతకూన కబ్బదే
యాకులపాటటంచు నను నవ్వని రంభ శుకోక్తిఁ బేరిటన్. 163

ఉ॥ ఆపురి నింపు నింపు మలయాచలచంచలకుంజపుంజర
థ్యాపరభిల్లపల్లవపదాస్తనశస్తనవాంకసాంకవ
శ్రీపరిణీతశీతలఝరీతతతరంగతరంగరంగసం
దీపితకంజపుంజగళినీరవసారవవాతపోతముల్. 164

క॥ అకటక మేలు దశరథ
భూకాంతుఁడు రిపునరాజభూకాంతమదో
త్సేకాంతదభూకాంతప
తాకాంతస్సప్రష్టగిరిసుతాకాంతుండై. 165

మ॥ శుకవాణీమకరాంకుఁ డాదశరథక్షోణీవిభుం డొక్కనా
డకలంకోన్నతిఁ గొంప్రరాపతిమనోలాటంపుబల్ టాకులన్
రక మా నంతిపురంబులొల్ల్వచవిరిన్ లాటీమరాటీశకీ
కుకురీదత్తనృపోపచారుఁ డగుచున్ గొల్వున్న నచ్చోటికిన్. 166

సీ॥ దివ్యకూలంకషాతీర్థసేకంబునఁ
బావనం బగుజటాపటలివాఁడు
సత్పురుషావతంసఖ్యాతి విలసిల్ల
నార్యానుమక్కుఁడై యలరువాఁడు
సురుచిరాత్మీయమాఘరధర్మ మెడలక
యరివర్గజయముచే నడగువాఁడు
గూరుతాశనపరిష్కార మౌ నెమ్మేన
నతనుభూతి ధరించి యమరువాఁడు

గీ॥ వామదేవుండు రా నమ్మహీమహేంద్రుఁ
డెదురుగాఁ జని మది భక్తి గుదురుకొనఁగ
నాదరంబున నర్ఘ్యపాద్యాదు లొసఁగి
నిగనిగలు దేరు నొకమణిఖచితపీఠి. 167

క॥ ఉనిచిన సనిచిన వేడ్కం
జనపతి గనుఁగొని వసిష్ఠశాసన మనఘా
విను మని యమ్ముని యిట్లని
వినుపించె సుధారసంబు వీనులఁ దొలఁకన్. 168

క॥ మేదురతరమధుకైటభ
మేదోవిస్రావిషంబు మేదిని గీర్తిన్

కాదుకొనం భుజయింత్రుప్ర
సీదన్నిజకీర్తి సురభి చేసిన నృపతుల్. 169

వ॥ అని వినిపించిన విని దరహసితాంకురంబు నిజముఖపంకజంబు
నలంకరింప నరదేవుఁడు వామదేవున కిట్లనియె. 170

ఉ॥ ఆయతభక్తియుక్తిఁ దనయాజ్ఞ శిరంబునఁ దాల్చి రాజ్య మేఁ
జేయుచు నుండ నిల్లు జరిచే నరసేఁ జెవిచెంత నిప్పుడుం
బాయనికూర్మి సర్వమును బాలునకుంబలె నాకుఁ దెల్పెడున్
నాయెడఁ బక్షపాతము ఘనంబు గురూత్తమునెమ్మనంబునన్. 171

గీ॥ అనిన వామదేవుఁ డనియె కో రాజన్య
తిలక యగుడు గాఁగఁ బలికె దేల
యిట్టి సర్వసముల కేలఁ దారామైత్రి
యెంచినూపి నొక్క యెడప గాదె. 172

గీ॥ అరయ రఘుకులసామాన్యగుణుఁ డతండు
నిక్క మట్లయ్యు నీయందె యెక్కు ఘనము
సకలజనమోహకుఁడైన చంద్రునకుఁ గు
ముదము గలసంగ దాఁ బ్రాణపదము కాదె 178

వ॥ అనిన వన్నరేంద్రుండు మునీంద్రా మదీయశ్రవణవృత్తి యను మా
వంతుండు గురువచన తృష్ణాంకుశంబున నింద్రియానుసారి యగు
మానసం బను నేనుంగుం బోనీక మరల్చెడుఁ దద్వాచావిశేషం

బశేషం బెఱింగింపవే యన సకలసందేశ సంగ్రహాకందం బగు
నిక్కందంబు నీడెందంబునం బొందుపఱుపు మని మునిపురందరుం
డానతిచ్చి సావధానుండవై వినుమని యిట్లని పఠించె. 174

కం॥ సదనంబున కర్థిజనుల్
ముదమున రాఁ బూర్ణకాములుగఁ జేయుము నీ
కది హోమం బది యాగం
బది తప మది వంశధర్మ మవనీనాథా. 175

వ॥ అని పఠియించి. 176

క॥ కేలింపు మేతదర్థము
నీలో నన గురునరేణ్యునెయ్యపునుడు లిట్
పూలసరంబులు శిరమునఁ
దాల్చినాఁడ నని మఱియు దశరథుఁ డనియెన్. 177

సీ॥ నేఁడుగా పద్మినీనేత మత్కులకర్త
హావిరన్నభుజాలలో నాద్యుఁ డగుట
నేఁడుగా నే ద్రయీనిర్దిష్టవిధులచేఁ
గ్రతువులు చేసి విఖ్యాతి గనుట
నేఁడుగా నీపయోనిధిపూరితధరిత్రి
రాజన్వతీసంజ్ఞఁ దేజరిలుట
నేఁడుగా నాసఖ్యనియతిచే జంభారి
దా మహోన్నతునిగాఁ దలఁచుకొనుట

గీ॥ యహహ యీరీతి తను దానె యస్మదీయ
భాగ్యమహిమ నరుంధతీప్రాణభర్త
దేశికాగ్రణి హితసమాదేశకలన
నిన్నుఁ బుత్తెంచి నన్ను మన్నించెఁ గాన. 178

వ॥ అనిన వామదేవుం డిట్లనియె. 179

ఉ॥ ఓరఘురాజవంశకలశోదధికల్పమహీజ మీకు నీ
చారుయశోవిభూతి సహజం బుపదేశమునర్చుమాత్ర మా
వారము కైరవోత్సవనవద్యుతిపూర్తికిఁ గార్తికనిశా
హారివిహారయుక్తి సలెనా నలినారికి నెంది చూచినన్. 180

గీ॥ నాయకోత్తమ నీయన్వవాయమునకుఁ
జెలఁగు నేతన్మహాఖ్యాతి గలుగు టెల్ల
యపరపరమేష్ఠియైనట్టి యవ్వసిష్ఠ
మౌనివంశవతంసముమహిమ సువ్వె. 181

సీ॥ ఉదధిశోషితం బయ్యె నుర్వి నేమహానిచే
గూర్జలై తనరుమీయన్వయంబు
నవపూర్తమయ్యె సర్ణవ మధ్వరము సేయు
సగరుని కేమునీశ్వరునికరుణఁ
గీర్తిధ్వజం బయ్యె గీర్వాణవాహిని
* యేఋషిమహిమ భగీరథునకుఁ
దోహదక్రియ యయ్యె లోహితగురుని సూ
నృతవచోలతకు నేయతిప్రతిజ్ఞ

---

* (ఈ దశమున విశేషము చింత్యము.)

నుండిరే మీరాక యున్నాఁడె సుఖలీల
నతఁ డయ్యరుంధతీసతియుఁ దాను
ననుడు నోమానీశ తనశిష్యునింటికిఁ
జెలిమిమై మీరు విచ్చేయుకతన

గీ॥ నిపుడె కేవలసుఖ యామునీంద్రుఁ డనిన
నామనంబునఁ జాలదినాలనుండి
దశరథక్షోణినాథసందర్శనేచ్ఛ
యెల్లకోరికలకు మీఁద నుల్లసిల్లు. 187

క॥ అనవుడు గాధేయునితో
నను నిట్లని వామదేవుఁ డనఘా మీరుఁ
గనుఁగొనఁ గోరుదు రటె యీ
జననాయకుభాగ్యమహిమ సామాన్యంబే. 188

క॥ నావుడు వాచంయమకుల
దేవుం డి ట్లనియె వామదేవునితోఁ దా
భూవరమాత్రుఁడె రఘుకుల
పావనుఁ డీతఁడు మహానుభావుం డనఘా. 189

చ॥ సవిధనమన్మహీరమణఝాటకిరీటవిభావిభాకర
చ్ఛవివిలసత్పదాంబురుహశిల్పితదోర్విభవాభిరాముఁ డీ
యవనివిభుం డొనర్చు హరిదంతపరిభ్రమ దశ్వమేధ సైం
ధవఖురచంద్రకప్రకరదంతుర గాఁగఁ బయోధిమేఖలన్. 190

శా॥ ఆజింబాసురవైరికిఁ గెలుపుదోడ్డై మించుజోదుం ద్రిలో
కీజంఘాలభుజాప్రతాపు నసురీఖేలత్కచాకర్షణ
భ్రాజత్పాణిసగోరుహాఁ మనఃకులప్రఖ్యాతు నేఁ డిమ్మహా
రాజుం గన్గొనఁ గల్గెఁ గన్నుఁగవ నిర్జాడ్యస్థితిం జెందఁగన్. 191

వ॥ అని పలికి వెండియు నమ్మునిపంచాస్యుండు వయశ్య వామదేవ మద్భావంబు చాతకంబుగాఁ జల్లనియమృతంబు జలుకు సుజనసంవాదానుమోదం బను పయోదంబునకుఁ దూర్పుఁ దెమ్మెరకరణి నిత్తరణికులకేతు వభివర్ధనహేతు వయ్యె నన వామదేవుండు దేవా భువనంబులకుం బ్రథమగురుం డగునీయంత మునివరుం డీ తెఱంగునఁ గనుంగొనఁ గోరుటం జేసి యిప్పు డిప్పుడమి తేని కుల కుశలకర్మంబులను లతాగ్రంథులకుం గిసలయంబులు వొడమెమున నియె ని ట్లనురూపంబులగు సల్లాపంబుల నుల్లంబు లలర నమ్ముని తల్లజంబులు చేరనేతెంచిన. 192

గీ॥ కాంచి కాంచనమయ సైమనగిద్ది డిగ్గి
యెదురుగాఁ జని యమ్మహీంభిదురపాణి
యుర్విఁ బ్రణమిల్ల వాని యాశీర్వదించె
“సపరివారాయ భూప తే స్వస్తి” యనుచు 193

క॥ భాసురతరసముచితశన
శాసనముల నధివసించి రపు డండఁలు ను
ల్లాసమున నంత నుత్తర
కోసలనాయకుఁడు కౌశికున కిట్లనియెన్. 194

సీ॥ సంఘటిల్లెనొ దుష్టజంతుసంతానదు
ర్వారఖేదంబు కాంతారవీథి
సంభవించెనొ భవన్నవనాంతరాయంబు
క్రతుభుగ్గణంబు లాకటఁ గృశింపఁ
దలఁపుగల్గెనొ సమస్తక్ష్మామండలీ
దక్షిణం బైన యధ్వర మొనర్పఁ
బరిణమించెనొ కాక తరణివంశవతంస
ధారుణీవరచిరంతనతపంబు

గీ॥ మానికులనాథ భవదాగమంబునకును
హేతు వెయ్యది యాన తీనే యటన్న
మోమునెత్తమ్మి నెలనవ్వు మొలకలెసఁగ
గౌశికుఁడు పల్కె నారాజకౌశికునకు. 195

గీ॥ అధిప సకుటుంబు లగుచు నిశాధిపతులు
సహరహంబును నీపంచ నధివసింప
విమతుఁ డనుమాటమాత్రంబు వినుటలేదు
ప్రతిభయోన్నతి నూకు నేగతి జనించు. 196

మ॥ అభయం బింద్రున కిచ్చెఁ దావకభుజాహంకారవృత్తిన్ జగ
త్యభిరక్షానిరపేక్షుఁడై హరి మనోహర్షాతిశైత్యోరుసా
రభనిశ్వాససమీరపారణపృథుప్రద్యోతవాతాశన
ప్రభుశయ్యన్ సుఖనిద్రఁ జెందెడుఁ బయఃపాథోధిమధ్యంబునన్. 197

చ॥ అన జననాథుఁ డిట్లను రణాంగణభూమి నిశాధికోటిమా
ర్గానిమొనునింద్రుసేన నెలగోలున సేనను సంచరించుచున్

ధను వేళవేళ నక్కడికి దాన జనించు నలీకవార్త యో
మునికులసార్వభౌము డిటు మోసము మీమదిఁ బాదుకొల్పెడున్.

వ॥ అనిన నవ్వుచు విశ్వామిత్రుం డమ్మహీకళత్రున కి ట్లనియె. 199

ఉ॥ ఎన్నఁగ ముజ్జగంబులకు నీ వభయం బిడుపూఁటకాఁప వా
ట న్నిజ చాపనైపుణియొకన్ మరపొందుట దాను నిచ్చలున్
జన్నపుకూటిచే బలిసి సాంద్రతరాంగవలీసమున్నతిన్
గన్నులు పూకి నేను బలఘస్మరుఁ జేగతి నున్నవాఁడనో. 200

వ॥ అనిన వామదేవుం డిట్లను నరేంద్రా యమ్మునీంద్రుఁ డానతిచ్చి
న యర్థంబు సార్థం బేతును తెక్కుమూర్గ సుధర్మమధ్యంబునఁ
బ్రత్యక్షం బొనరింపఁగనుఁగొనిన నెఱుం గలిగించెద. 201

మ॥ జననాథాగ్రణి నీవు దేవసభ నాఖండలారి యర్ధాసనం
బునఁ గూర్చున్న భవజ్జయాంకచరితంబుల్ కిన్నరుల్ పాడ మీ
ఋనవర్షోన్నతి యేఁగి తానరిభుజారోమాఞ్చవిద్ధాత్మపూ
ర్ణనవీనాశ్రువులన్ బటింపు నతఁ డానందంబు నందంబుగన్. 202

క॥ అని విని నవ్వుచు నాతఁడి
ట్లను నో మునినాథ నీవు నకటా గాధే
యునిఁ గూడి యిట్లు పలుకన్
జనునే యాఖండలుండు పాఖండ్యుండే. 203

మ॥ కదనోర్విన్ భిదురప్రభోగ్రభుజుఁడై కన్పట్టు జంభారిక
ట్టెదురన్ గెంటక నిల్చుబంటుగలఁడే యొచ్చోట నమ్మేటి దు.

ర్మదవైరిచ్ఛటకుఁ ఘటించు ననలాస్త్రంబుఁ బహిర్భాగని
ర్యదమర్షాగ్నికణభ్రమావహమహాశక్త్యాశుపిత్సారుచిన్. 204

వ|| అనిన విశ్వామిత్రుండు సగౌరవంబుగా నమ్మహీభుజా భుజశిఖ
రంబున నిముడుచు నిట్లనియె.

చ|| అల బలభేది తావకభుజార్గళ శక్తిమహావిభూతిచే
మెలఁగుట యంతవింత యశమే యిది నీకు మరున్నితంబినీ
కలితకపోలపత్రలతికామకరీపశుపాలనంబు మి
క్కిలి రఘువంశజుల్ మును లిఖించి పఠించినవృత్తియే కదా. 206

క|| నావుఁడు భూవిభుఁ డిట్లను
దేవిధవబ్రహ్మ వీవు దేవా శివా
చావితతికిఁ బ్రత్యుత్తర
మే విన్నప మాచరింప నెంతటివాఁడన్. 207

క|| మౌనివతంస త్రిశంకు
క్ష్మానాథకథాప్రసంగచతురులు మిమ్మున్
వేనోళ్ళఁ బొగడ నిచ్చలు
వీనులకున్ విందుగాఁగ విందున్ ముందున్. 208

మ|| ధర గంపింపఁగ నల్కఁ బ్రాక్తనజగత్సర్వంబు నీ వన్యథా
కరణారూఢము సేయ భీతసురజాగ్రన్మౌళిమాణిక్యభా
స్ఫురదీప్తిన్ భవదంఘ్రియుగ్మ మెసగన్ గార్పణ్యవాచాపరం
పరచేఁ జేయఁడె పాకశాసనుఁడు తత్ప్రత్యూహసంధానమున్. 209

చ॥ అనిమిషకోటి వేగ భవదర్చనకై చనుదేర నంచ లో
య్యనఁ జన లేమిఁ జిక్కుఁ గమలాసనుఁ డన్నను నీచరిత్రలన్
వినుతి యొనర్ప నాతరమె నీదుసుధామధురోక్తి వైఖరుల్
వినుటకుఁ బైఁబయిన్ దివురువీనుల నించుటగాక కౌశికా. 210

క॥ అని వసనేందునిఁ గని ముదిఁ
గిసలమ్ము లనంగ మోడ్పుఁగేల్గవ దనరన్
జననాథతిలకుఁ డిట్లనుఁ
బ్రణుతసుధామధురచాటువాగ్ప్రౌఢిన్. 211

గీ॥ ఓమహాత్మక నైజమై మహోత్సవంబు
లెన్ని సమకూడె నేనియు నెన్ని చూడ
విశ్వధాత్రి నాకానాక వేళనైన
మానసంబులు గనియునే మానవులకు. 212

క॥ కావున భవదాగమనం
భావనచే నలరునాదుమగి గోరెడు నో
దేవ నియోగానుగ్రహ
మీవేళం గరుణ నానతీవే యనుడున్. 213

క॥ అలయతఁ డితర మ్మోన్నృప
తిలక నియోజ్యాంశ మున్న దే యని మఱియుం
బలికెన్ సాత్తాద్ద్రాక్షా
ఫలరసదాయాసమధురభాషాపౌష్టిన్. 214

చ॥ జగము లలంకరించెఁ గుసుమం బెడలించినచిల్వరేనిపై
నిగనిగలన్ ధరాధరవినిర్మథితాంబుధిజాతరిస్థలీ
ధిగధిగలన్ ధగద్ధగలఁ దేరెడుచీకటి రేయి జారు న
వ్మృగధరమండఖండముల మించు భవద్వరకీర్తిచంద్రికల్. 215

వ॥ మఱియును. 216

శా॥ రాజోత్తంస వశీరభీరురసనాప్రావీణ్యభిచ్చంద్రికా
భ్రాజద్భ్రాంతి ఘటించు కీర్తులను సంపాదించు మెందుం దమో
రాశిం దేశ మడంచు తేజములచే రాజిల్లు మభ్రింబునన్
రాజీవాప్తుఁడు దిగ్వధూకలిత కాంతాప్రైత్రి వాటింపఁగన్. 217

వ॥ అని వెండియు. 218

మ॥ క్షితినాథోత్తముఁ డోడెఁ గౌశికుఁడు వల్కెన్ నేను వైతానిక
వ్రతదీక్షాకరణి నందు మామకతపోవన్యావనార్థంబు నీ
సుతులిం రాము సుశాభిరాము ధరణీసుత్రాముఁ గాంక్షించెదన్
గుతుకం బొప్పఁగ నంపు తత్ఫలము దక్కున్ నీకు నిక్కంబుగాన్ 219

సీ॥ శరసంబు తూఁటుగా జలరాశి నవనీట
ధరణీతలం బెల్లఁ దనుపరీతి
దరుణంపుచాఁబగా నాత్మీయకరరేఖఁ
దరణి చీకటులఁ బోఁదఱుముకరణి
పనటియడ్డంబుగా ననలుఁ దన్నము నైజ
శిఖలచేఁ బక్వంబుఁ జేయుమాడ్కిఁ
గరువలిమెఱుపుగాఁ గస్తూరి దశదిశల్
స్వీయవాసనల వాసించుపగిది

గీ॥ నీవు శ్రీరామముఖమున నీప్రతాప
వైభవము నీటఁ జొచ్చి మావంటి ప్రజల
నధిప మీవంటి పరపురుషార్థపరుల
కిదియు నొక లీల వానిఁ గదా మదిఁ దలంప. 220

వ॥ అని వెండియు. 221

క॥ హరి సాక్షాదసురనిజయు
నరుణనయము మాత్స్యనీతి వక్కాణించుఁ
గర మహిభయ మహీపురి ను
ర్వర నీచే నసాధ్య వీరరాజ్యసమృద్ధై 222

వ॥ అని పలికిన. 223

క॥ అనఘ యీఋషిమునిపీఠుఁడై
ప్రాని యలఁగు హాలాహలముబునుఁగై పటుదా
వానలకీలలనడుగై
మానవపతినెమ్మనంబు మలమలమాడ్చెన్. 224

వ॥ అప్పు డప్పుడమి తేజు తపమనంబున నిఖిలలోకానంధకారం
బగు నిందుకరానీకంబు తమ్ములకుఁ గరంబు భీకరం బగుచందం
బునం గటకటా. యెల్లవారికి నల్లంబున యొల్లంబగు తెల్లదం
బు పెల్లగిల్లం జేయు చల్లని యమ్మనితల్లజంబు రామప్రవాసఖే
దం బను నోదంబున మన్మానసం బను నేనుంగుం బడఁ గెడపం
గడఁగునే యని యొకింత చింతించి యంతలోన దేశికాదేశకం
దంబు డెంపంబునం గండళించిన. 225

---

220. ఈపద్యములోని తృతీయ చతుర్థ చరణములు మూలములో లేవు.

మ॥ ప్రకటప్రౌఢిమఁ గూర్మరాజ భుజగేంద్ర స్తబ్ధరోమాదినా
యకదిక్కుంభికులాచలాధిపులతో నానంగఁ బెన్నుద్దియై
సకలోర్వీభరమున్ వహించు రఘువంశంబే జనింపంగ నే
డకటా నిందితమై పరార్థవిముఖం బైనన్ జనుల్ నవ్వరే. 226

వ॥ అని యివ్విధంబున డెందంబున నాందోళించుదశస్యందనుచం
దం బెఱింగి యమ్మునిపుంగవుం డిట్లనియె. 227

చ॥ దళితమదారివీర తలిదండ్రులకున్ నృపసూతి పోషణా
కులతయు వైభవంబుఁ బ్రజకున్ సమకూర్చు నిజంబు వేదనా
విహితయు సంభృతిక్రమము వీనులు పూన ననూనలీలఁ జె
క్కుల నలరించుఁగాదె మణికుండలమండనధాళధళ్యముల్. 228

ఉ॥ నావుడు భూవరుండు మునినాథున కిట్లను మీర లింత సం
భావన సేయుటన్ మిగుల భాగ్యము చేసితి నైన నింక నా
భావములోన నొక్కయెన బాలుఁడుగా యకృతాస్త్రశస్త్రశి
క్షావిధుఁ డుండుగా యనుచు సంఘటిలెన్ గుశికాన్వయాగ్రణీ. 229

చ॥ అన విని లేఁతనవ్వు వదనాంబురుహంబు నలంకరింప న
మ్మునిపతి వల్కె నోయధిప మున్నె వశిష్ఠగురూపనీతుఁడ
య్యనఘచరిత్రుఁ డప్రతిముఁ డంతియె కాదు మహాస్త్రశస్త్రగుం
భనము భృశాశ్వసంయమికృపన్ మదధీనము శంక యేటికిన్. 230

వ॥ అనిన దశరథుండు సవినయంబుగ మహాత్మా ధనుర్విద్యాసంప్రదా
యకంబ కాదు కకుత్స్థాన్వయంబునం జాల కాయువును భవదధీనం
బ భానుకులీనపటుపాతంబునన కాదే సదారాధనంబునఁ గృశాశ్వ

మునీశ్వరు సహస్రసంవత్సరంబు లుపాసించి యసమానుం డగు న
మ్మహానుభావువలన దివ్యాస్త్రమన్త్రోపనిషద్రహస్యం బాశాస్యం
బుగా నెఱింగితి రనిన నమ్మహీమండలాఖండలు వాచాపాండిత్యం
బున కలరి మునిమండలేంద్రుండు వెండియు నిట్లనియె. 131

క॥ బాలుం డని రాముం దలంచకు
నీలో భూలోకనాథ నీ తేజమునన్
దూలింపఁడె భువనతమో
జాలతిరస్కరణిఁ దరణి సన్నంబయ్యున్. 232

సీ॥ అని యిట్లు గాధినందనుఁ డాడువాక్యంబు
లాలించి యమ్మహీపాలమౌళి
కౌశిక శిష్టయోగాఢ్య కుముదినీబాంధవ
పూని నీ యట్టి మహానుభావుఁ
డానతిచ్చినమాట కేనాఁటనైనను
నీవోత్తర మొసంగఁ జూచునట్టి
చులుకనినాలుక గలుగువాఁ డెవ్వఁడో
యని వామదేవు నెక్కొనకు మరలి

గీ॥ మంతనంబునఁ బల్కె నో మానిచంద్ర
కౌశికునిమాట వింటి గేకద వచింపు
డింక నీయెడఁ గర్తవ్య మెద్ది యనిన
ననఘు డింతకు మున్నెంత యనఁగవలెను. 233

క॥ నిటలాక్షునిభుఁడు కౌశికుఁ
డఁట యాచకుఁ డీవు దాతవఁట ధరణీయ్యం
బఁట మఖము రామభద్రుం
డఁట రక్షకుఁ డనుమతించు టరుదే మాకున్. 234

గీ॥ పార్థివోత్తమ నిఖిలభూభారఖిన్ను
లైన మిమువంటివారి కర్థార్థిజనుల
వాంఛితార్థంబు లొసఁగూర్చి వారిమోము
చెలువు వీక్షింప కోరిక సేదదేఱు. 235

చ॥ కలదు విశేష మింకొకటి శాంతిగతముల్ నిఖిలార్థికోటికిన్
దలకొనఁ జేయుటే పరమధర్మము నీ కని తెల్ప నన్ను నీ
కులగురుఁ డా వసిష్ఠమునికుంజరుఁ డియ్యెడ నంపె నెల్ల తా
నలఘుసమాధి గాధితనయాగమనంబు నెఱింగియే సుమీ. 236

గీ॥ అనినఁ బార్థివేంద్రుఁ డవ్వసిష్ఠమునీంద్రు
యోగదృష్టిమహిమ యుల్లమునకు
ముదము గీలుకొల్ప నిది యట్టిద యటంచుఁ
బలికెనిట్లు మేనఁ బులకలూన. 237

క॥ ఇదిదూరం బిది చేరువ
యిదియాచున్నది యిదైన దిది యిఁక కాను
న్నది యనక యడరు నన్నిట
సదమలమతి యతికి దివ్యచక్షుర్మహిమన్. 238

వ॥ అని యువ్విభుండు వెండియుం గొండొక విచారించి. 239

మ॥ క్రతురక్షార్థము గాధిసూనుఁడు ననుం బ్రార్థించి నాచే నుపే
క్షితుఁడై క్రమ్మఱి కిందిసంచితతపఃక్లేశప్రశాంతాధ్వర
ప్రతిరోధుం డయి తద్విధానమునకుం బ్రారంభముం బూనినన్
మతి నూహింపఁగ రాఘవాన్వయకథావాశంబు సంధిల్లదే. 240

మ॥ అనియంతన్ మహికాంతుఁ డాకులితవంశాధ్యక్షు నీక్షించి యో
మునిసంక్రందన గాధినందన ముఖంబుల్ సేయ శాసించి రా
మునిఁ గాంక్షించితి రేని నీ ప్రియచతురంభోరాశిసంవీత మే
దిని మాటాడుము నిండ్రి గ్రక్కున క్షాత్త్రవ్రత్యసాంగత్యముల్. 241

మ॥ అని యా రాజశిఖావతంసము ప్రతీహారుం గటాక్షించి "రా
మునిఁ దోడ్తె"మ్మన వామదేవుఁ డనుజన్ములన్ లక్ష్మణుం దోడి తె
మ్మనుఁ"డన్నన్ సగి "నిన్నుఁ జూచె యుచితయుండానే నిశానేత"నాఁ
బ్రకటించెన్ జటి కౌరి వారి యవినాభావంబు భావంబునన్. 242

ఉ॥ అంతట ద్వారపాలుఁడు సగుంచి భద్రుని రామభద్రునిన్
శాంతవినీతు లక్ష్మణు మహోన్నతలక్షణుఁ జేరి మిమ్ము భూ
కాంతుఁడు పిల్వనంపె నని కౌశికసంయమి రాక దెల్ప శు
ద్ధాంతగృహంబు వెల్వడి యుదారముదానమితాననాబ్జులై 243

క॥ ఏతెంచునెడ సుమిత్రా
జాతుని నీక్షించి రామచంద్రుఁడు వినుమా
యోతమ్ముఁడ యిమ్ముని మహి
మాతిశయం బుగ్గడింతు నని యిట్లనియెన్. 244

మ॥ శతమన్యుస్థితిఁ మన్యుఁడై నిజతపశ్శక్తిన్ జగత్సృష్టికిన్
బ్రతి కల్పింపగ సృష్టికర్తలగునప్పబ్రహ్మాలం జేసి సం
స్తుతులన్ శాంతి వహించి వారి కొసఁగెన్ జ్యోతిష్పథోర్వ్యబహి
ష్స్థితి యంచున్ దెలుపున్ బురాణకథ లీదివ్యర్షి చారిత్రముల్. 245

కం॥ పరమాద్భుతఖని యిమ్ముని
యరుదెంచె తనంత నిట్టియతిలోకమహా
చరితుని సముచితగతి నృప
చరితుని గావింప మనకు శక్యం బగునే. 246

వ॥ అని ముందటం జనిచని యనురాగానందంబు డెందంబునం గ్రందు
కొన లక్ష్మణభ్రాత తాతవామదేవులయంతికంబున నితాంత
ప్రశాంతగాత్రుం డగు నప్పరమపవిత్రుండు విశ్వామిత్రుండు గావ
లయు ననిన సుమిత్రాపుత్రుం డాశ్చర్యంబు మున్నుగా నన్న
తో ని ట్లనియె. 247

ఉ॥ ఆకృతిఁ దాల్చెనో శమ మహా! నయనోత్సవ మాచరించులో
కైకశరణ్యుఁ డిమ్ముని యుదగ్రజగద్భయకృన్మహోగ్రతన్
గైకొన నట్లొకో యిదియుఁ గన్నక్రమంబ తమంబు వర్తిలన్
జోక వెలుంగదే మృదుమనోజ్ఞసుధారసమహౌషధీలతల్. 248

కం॥ అని రఘుతిలకుఁడు లక్ష్మణుఁ
గని యిట్లను దురవగాహగంభీరకథా

బీవాళ్య మనిన నమ్ముని
దేంపు డిట్లనియె వామదేవునితోడన్. 254

చ॥ తమకు వసిష్ఠసంయమి ప్రధానగురుండు భవాదృశుల్ సమ
స్తము వెలయించువారలుగ ధార్మికులౌ మనువంశపార్థివో
త్తములకు నెల్ల నీదశరథప్రభుఁ డెల్ల నిజం బినాన్వయ
ప్రముఖులు రాఘవుల్ ధరవిభాండకసూనుతపఃప్రభావముల్ 255

వ॥ అను నంత నుపాంతంబున కేతెంచిన యక్కుమారకంఠీరవుల నవ
లోకించి యకించిదనుభావుం డశేషభువనదేశికుం డగుకౌశికుం
డితం డిమ్మనిలలామంబునకుఁ బ్రణామంబు గావింపుఁ డన గోత్ర
నామంబులు దెలుపుచుఁ దత్పాదపల్లవంబులకుఁ బ్రణమిల్లిన. 256

శా॥ ఆయుష్మంతులు గండు లెం డని సముద్యత్ప్రీతిచే నత్తి గా
ధేయుం డక్కునఁ జేర్చి వాసరమణీదేదీప్యమానప్రభా
దాయాదద్యుతిధాము రాముని నితాంతస్నేహసంభావన
శ్రీయొప్పన్ గనుఁ జూచి యిట్లని వితర్కించెన్ మనోవీథికన్. 257

శా॥ ఇనాన్వయులకున్ వసిష్ఠగురుదివ్యమంత్రశక్తిం ద్రిలో
కీనిత్యాభ్యుదయైకతానధుర గన్గొన్ నేను లక్ష్మీకుచా
లానగ్రంథితగంధసింధురము లీలన్ దాన యేతన్నిశాం
తానూనస్థితి రామముఖ్యచతురంగావాప్తిఁ బాలించుటన్. 258
వ॥ అని తనమనంబున నాతనినుద్దేశించి కౌశికుండు వెండియుం. 259

శా॥ వేదంబుల్ భవదీయసంస్మరణ నావిర్భూతి గాంచెన్ హవి
స్స్వాదంబున్ గనుఁ దేరి యజ్వలు భవత్సంప్రీతికై వేల్వ శ్రీ

రోదాంభఃప్లవకేళిభవ్య నిను దివ్యుల్ దెచ్చిరిద్ధాత్రికిన్
మీఁదం దద్దశకంధరప్రభృతులన్ నిగ్రహించి దీప్తిశ్వరా 230

వ॥ అనియిత్తెఱంగున నత్తపోధనసత్తముండు సాక్షాల్లక్ష్మీపతిశ్రీరుహా
సగోరుహాసంచరచ్చంచరీకంబగునవ్వంచనాపంచజను నచంచల
గుణానుభవంబున నభివర్ణించుచున్న సమయంబున 231

గీ॥ వామదేవుండు చిఱునవ్వు మోముతోడ
రాముఁ గని యీతపస్వీలలామ యిప్పుడు
ననుచు వేడుక మిమ్ముఁ దోడ్కొనుచుఁ బోవ
వచ్చినాఁడన డెందంబు పిచ్చలింప. 232

క॥ అయ్యాకు మీకును హర్షం
బెయ్యది యట్లగు నటన్న నృపసుతుఁ డారిన్
నెయ్యమునఁ గేలఁ గైకొని
యొయ్యనఁ 'గాశిక' యటంచు నుదితార్థోక్తిన్. 233

క॥ అవిరళశోకదవానల
వివశుఁ డగుచు నోలమాట వెడలక ధరణీ
ధవమౌళి వామదేవుని
నవలోకించుటయు నాతఁ డవహితమతియై. 234

సీ॥ శ్రీరామలక్ష్మణులీ విశ్వామిత్రయని
తన కొప్పగింప నమ్మునివిభుండు
గారవంబు దలిర్ప వారిఁ గైకొని యప్పు
డడరుమధ్యాహ్నశంఖారవములు

దిక్కటాహంబుల నొక్కటఁ బూరింప
విను శుభోదర్కంబు లనుచుఁ దెలిపి
వామదేవుఁ డభంగురామోదమయపయః
పాథోధిఁ దేలింపఁ బఙ్క్తిరథుని.

గీ॥ నంత భూకాంతమందిరప్రాంతసీమ
నధివసించి మధ్యందినవిధులు దీర్ప
వేళ యని పల్కె నిట్లు వైతాళికాళి
పేశలవచోమచర్చికాకాళలమున. 265

గీ॥ యింట దినమణికిరణంపుమంట గురియ
బైటఁ దాఁబేటిక్రియఁ గొంచపడియె నీడ
శిశిరకరిరాణ్ముఖోద్గీర్ణ శీకరములఁ
జల్ల నగు నీళ్ళకుంటకులు లేళ్ళు చేరె. 266

చ॥ నెలకొని వేడ్కఁ బాడెదరు నీగుణముల్ ఫణముల్ గదల్చుచుం
బులకవిభిన్నకంచుకసముద్గతసమ్మదఘర్మపూరలై
కలరసనాయుగాన్వితముఖస్థలితాతురయుక్తి రక్తి పా
టిలఁగఁ బటీరకోటరకుటీరములం ఫణిరాజకన్యకల్. 267

క॥ ఈలీల విన్నవింపఁగ
నాలించుచు వామదేవుఁ డనియెన్ మేలో
భూలోకనాథ యీవై
తాళికుఁడు ప్రియం బెసంగఁ దత్త్వమె పాడెన్. 268

ఉ॥ ఆనినరత్నభారమున న్నాఁడల లల్లన నూఁచి సమ్మదా
నూననిదాఘవారి పులకోద్గతకంచుకసంధి నుబ్బఁగా
గానము సేయుచుండ్రు ఫణికాంతలు వారిధికూలశైలసం
స్థానములన్ భవద్గుణవితానము తానము లుల్లసిల్లఁగన్. 269

వ॥ అనిన విని వినమితాననుండై యా రాజపంచాననుండు వినయంబున
నూరకున్న గాధిసుతుం డతనిం జూచి నరేంద్రా దీక్షావసమయం బా
సన్నం బయ్యెఁ గావున నేవంవిధమధురగోష్ఠీభంగనిష్ఠురత్వం బంగీ
కరింపఁ గోరవ ననిన భూపాలకుండు బాలకులఁగనుంగొని కన్నీ
రొలుకఁ బలుకనేరక యూరకుండినం జూచి దిగ్గనలేచి యథోచితం
బుగా వామదేవుండు విశ్వామిత్రునకా రాజపుత్రుల నప్పగించి నృ
పతియుం దానును నయ్యతిపతిం గతిపయపదంబు లనుగమించి య
మ్మునిఁ దమ్ము నిలువు మని సెలవుమని యనుప ననుపమోదారు
లగు నక్కుమారులు తేతెర యతం డాశ్రమోన్ముఖుండై చని లోచన
గోచరం బగుదాఁకం జూచి చూచి దృష్టిపథం బతిక్రమింపం ద
ర్శింపఁ జొప్పడమి నప్పుడమితేఁడు వేఁడినిట్టూర్పులు నిగుడ మగిడి
యేతెంచి వామదేవు నాలోకించి యిట్లనియె. 270

క॥ ఓఋషిచంద్ర యకారణ
కారుణ్యసుధాగభీరు గాధికుమారున్
శ్రీరాముఁ డలరఁ జేయున్
గారామున నతఁడు చూడఁగా నిర్వేళన్. 271

వ॥ అని వెండియుఁ గొండొక విచారించి యమ్మహీమండలాఖండ
లుండు. 272

గీ॥ అకట యస్మద్వియోగార్తి నాత్మ నదరి
పొగులఁ జేయును కాక యపూర్వదేశ
విభవవీక్షాకుతూహలాన్వితుఁ డగుచు
డెంద మలరించునొకొ గాధినందనునకు. 273

క॥ అన విని నవ్వుచు భూపతి
కనియెఁ ముని రామచంద్రుఁ డను మాధుర్యం
బునకు న్మనమని శాశికుఁ
డనియెఁ గక్ష్యావిభాగ మరయం గలదే 274

మ॥ హరిణాంకన్యసనోదయక్రమము నయ్యంభోనిధానంబు దా
భరియింపన్ దగు నం దుపాధి గణుతింపన్ దత్పితృత్వంబు త
త్పరిపాటిం గుముదంబు దాల్చుటకు సంబంధాంతరం బున్నదే
నిరుపాధిప్రణయుల్ విశుద్ధులయెడన్ నిక్కంబు శుద్ధాత్మకుల్. 275

గీ॥ అన విచారించి దశరథుఁ డాపయోధి
తండ్రి కౌస్తుభపారిజాతములు సుధయు
ననుజసముదయ మైన నేమగును దాన
తుహినకిరణుండు కుముదబంధుండె నిజము. 267

వ॥ అని పురోభాగం బవలోకించి రామలక్ష్మణసహితంబుగా విశ్వా
మిత్రుండు నేత్రపథం బతిక్రమించె నేనును దత్సంప్రవాసదుర్మన
స్కుండై కుందు దక్షిణకోసలేశ్వరనందన నూఱడింతుఁగా కని
యంతఃపురంబునకుఁ బ్రవేశించె నంత. 277

మ॥ రజతోర్వీధరవాస వాసవముఖప్రస్తుత్య భాగావిత
త్రిజగచ్చైలశరాస రాసకరసాంద్రీభూతశోభావిభా
స్వజహద్గాత్రవిలాస లాసనియమధ్యానాదియోగాఢ్య మా
నిజవస్వాంతసదాస దాసకరుణానిత్యప్రసన్నాననా. 278

క॥ రామా రామాంగశ్రీ
వామా వామాంధకాదివారణచణదో
ర్ధామా ధామాధఃకృత
సోమా సోమాదిమిత్రశోకవిరామా. 279

కవిరాజవిరాజితము॥ సనకసనందనసంయమిపండిత సంతతనందనచా
రుమతీ ఘననిభకంధర కంజజకంధర గర్వధురంధరకంతుహృతీ
జనభయకారణసామజమారణ సాహసధారణ సారధృతీ
కనకధరాధరకార్ముక భూధరకాంతసుతాధరకాయ కృతీ. 280

గద్యము॥ ఇది శ్రీమద్రామేశ్వర శాశ్వతకృపాకటాక్షవీక్షణాసాదిత
సకలసామ్రాజ్యధౌరేయాక్రాంతవిశ్రాణనావధీరిత రాధేయబజ్జు
లకుకలశజలనిధానకార్తికీనిశాకరత్రవెన్నాళ్ళగోత్ర
పవిత్రకృష్ణరాయమహీధవకుమారసంగరాంగ
ణకుమారవయోగుణగోపాలతిమ్మభూ
పాల ప్రణీతంబైనయనర్ఘరా
ఘవం బన్నుమహాప్రబంధం
బునందుఁ
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీహయగ్రీవాయనమః

# అనర్ఘరాఘవము

## ద్వితీయాశ్వాసము.



క॥ శ్రీమద్గౌరీ మానస
తామరసాకరమరాళ ధవళాంశునిభో
ద్దామజటాజాల సుర
క్షేమంకర గిరినివేశ శ్రీరామేశా. 1

వ॥ అవధరింపు మవ్విధంబునఁ గౌశికుం డసమకుసుమాసరసౌరభ
చేటియగు నిజాశ్రమవాటికిం జేరనేతెంచె నయ్యవసరంబున. 2

క॥ మునిపతియాజ్ఞఁ గలాధరుఁ
డను శిష్యుం డొక్కఁడు ప్రాతరారంభమునన్
ఘనశీతనికటాటవికిం
జనియెం గుశకుసుమసమిదాహృతికిన్. 3

వ॥ ఇవ్విధంబున వనంబునకుం జని యసమకుసుమ సమిత్కుశనికరం
బుఁ గైకొని ప్రభాతప్రాయయగు విభావరిం బరికించి యకించిదా
నందకందళవితానయుతాననకళాధరుండై కళాధరుం డిట్లనియె. 4

మ॥ హరిణాంకుం డపరక్షమాధరము డాయం బ్రజ్వలిష్యత్ప్రభా
కరకాంతోత్కరధూమమో యన దిశల్ గప్పెం దమస్కాండముల్

సరసీజాంతరభృంగకల్యము నయస్కాంతంబు చందంబునం
త్వరితాకర్షణమాచరింపుచు వివస్వంతుండు రాఁ డిప్పుడున్. 5

శా॥ జాతాపక్వపలాండుపాండుమధురచ్ఛాయం గనెం దారలు
ద్భ్రాంతిం గైకొనెఁ బ్రాచి గొన్నికిరణంబుల్ పద్మజీవాతువుల్
లూతాతంతువితానవర్తుల నభోలోలాత్మబింబంబుతోఁ
బ్రాతఃప్రోషితగోచిరై డిగియెఁ దారానాథుఁ డస్తాద్రికిన్. 6

మ॥ లలితానూనగిశావితానమకుటాలంకారరత్నం బనం
జెలపూర్వాద్రికి రాఁగమున్న చని యాతా భద్రనిద్రాకుతూ
హలముం గాంచితె యంచు తా రడిగెనుం బ్రాంచద్ధ్వనిం బద్మినీ
జలజాతాకరసీను నిమ్మధుపముల్ ఝుంకారదంభంబునన్. 7

ఉ॥ సారకరంబు లంబరముచక్కటి నొక్కటిరెండుఁ బ్రాగ్దిశా
చారువతంస హల్లక లసచ్ఛదనభ్రమ నీవ నీనవాం
భోరుహ మింతవింతపరిపూర్ణవికాసముఁ గాంచె నార వి
స్ఫారమిళిందబృందయుగపద్బహిరుద్గమసంభ్రమంబునన్. 8

చ॥ వననిధిఁ గ్రుంకు సారకరవర్గము నొక్కటి రెండు మూఁడు నా
ల్గని పరుసన్ గణించుక్రియ నబ్జదళంబులు వేయు మోడ్చి త
త్పరుసయుక్రమంబుఁ గని పొంగుచుఁ గ్రమ్మఱ నెన్నఁ బూనెనో
యన నవి విప్పుచున్న దిపు డబ్జిని యారయ యథాక్రమంబునన్. 9

మ॥ అలఘుత్వష్టృనిశాతటంకపతిరజ్యద్బింబధూళిచ్ఛటా
కలితుండై యుదయించునో యినుఁ డికం గాదేని నిట్లేటికిన్
జెలగుం బ్రాంశచరన్మగుత్కరిశిరస్సిందూరసాంద్రారుణం
బులు తేజఃస్రుతశోణువుల్ ప్రథమగిరిగ్రావాధరాగ్రంబునన్. 10

వ॥ అని యవ్వటుశిరోమణి ప్రాఙ్ముఖాభిముఖుండై యుదయాచల
మౌళిమాణిక్యమండనంబగు మార్తాండమండలంబు నభోభాగం
బు నలంకరింపకయమున్న వస్తుకాండంబు మద్దేశికుండగు కౌశి
కుండుగావించు యాగంబున కుపయోగంబుగా వేగంబునం
గొనిపోయెద నని యేతెంచునమయంబున. 11

క॥ జోట జోటఁ జెమటలువడియఁగఁ
దట తటమని గుండెయదరఁ దగ నిగుడ హుటా
హుటి నచ్చటికరుదెంచెన్
జటలూడఁగ నొక్కవటుఁడు సంభ్రాంతమునన్. 12

క॥ వచ్చి వటూత్తంసము దను
రిచ్చపడి కలాధరుండు నిరీక్షింప భయ
ప్రోచ్చలితమానసుండై
వెచ్చెర నొకకొన్ని వెడఁగుఁ జేష్టలుచేసెన్. 13

సీ॥ పలుమారుఁ బిలిచినఁ బ్రత్యుత్తరంబీక
వెడవెడఁ గడుఁనేడ్చు వెక్కివెక్కి
కారణం బడిగినఁ గడఁగి చెప్పఁగఁబోని
తబ్బిబ్బులాడుచు బొబ్బరించు
నలికిపాటొదవ నుండుండి దిగ్గునలేచి
యదెవచ్చె నని దిశల్ బెదరిచూచు
గడగడ నెమ్మేను వడఁకంగ దీనుఁడై
నను గావుమని వచ్చి వెనుకదాఁగు

క॥ మఱియు నీరీతిఁ జేష్టించు తెఱఁగులెల్లఁ
గని సదాచారు భీతునిగా నెఱింగి
వెఱవ కోడకు మని సాగ వీపునిమిచి
భయము నడఁపుచు లాలించి పలికె నతఁడు. 14

క॥ ఉన్నవిధ మేమి నీ కో
యన్న సదాచార గుణమ్మహాంబుధిలోసం
బన్నగ ఘోరమృగాదులు
వెన్నాడెనొ ద్రష్టుఁ జూచి వెఱచితొ చెపుమా. 15

గీ॥ అన్న నిను జూచి సొగబడి యున్నవాఁడ
నన్ను గనవంగి నాప్తుఁ డున్నాఁడ నీకు
జేవిధమున నీవిక జే తెలవ
నెకట సేవింపియుండఁగ నోయనఁగ ననుగ. 16

వ॥ అని యమ్మునికుమారసత్తముఁడు చిత్తంబుత్తలంబంద నత్తఱిం
బున నత్తరాసంగంబు కొలుగునం బాసంగనిమిడిచిన హాసము
భూతిభీతిఁగొనియున్న యప్పిన్నవాఁడు నిటలఫలకంబున రక్షా
తిలకంబుదీర్చి భయంబుఁదేర్చి వెంటయునఁడుగ వచ్చేఁగిట్లనియె 17

క॥ మానికుమారక నీకో
నే నేమని విన్నవింతు నిచె యడవునకుం
దానకమై విపరింప భ
యానకమై పాయకున్న యది మహలోకా. 18

క॥ నాథుఁడు మొనుజలింపఁగ
నావటుని మొగంబు జూచి యతఁ డిచ్చోటన్
నీ వింత వింతఁగాంచుట
నావిని వడుగుకుమారునకు నిట్లనియెన్. 19

సీ॥ వినవయ్య యినవంశవనరాశిచంద్రుండు
రామచంద్రుం డను రాకుమారుఁ
డొకఁ డిపుడ కేంచి యున్నవాఁడన విని
వేడుకతోడ నే జూడఁ బోవఁ
బెనుగాలమునసుండి మనయాశ్రమప్రాంత
భూతలంబుననున్న ఱాతిప్రతిమ
నిక్కంపుటాకుదై నీటునఁ గనుపట్టి
యదుటుమై నతిచె నాకెదురుగాఁగ

గీ॥ నిట్లు నడతెంచు దానియుద్వృత్తిఁ గాంచి
గుండె వగిలినఁ బైఁగప్పుకొన్ననార
పంచె గుడ్డయు నచటనే పాఱవైచి
చావుపరుగున వచ్చితి నో వయస్య. 20

క॥ అనినఁ గలాధరుఁ డానన
వనజమునకుఁ జిఱుతనగవు పైఛరి యొనగం
దనకూరిమి నెచ్చెలి దెసఁ
గనుఁగొని పరిహాసపూర్వకంబుగఁ బలికెన్. 21

గీ॥ మేలు మేలు వయస్య యమ్మృత్యుయువతి
కారిఁ బడియును మఱి ప్రాణభయములేక
మగుడివచ్చినవిదుఁ గంటి జగతి నోము
లెన్ని నోచెనో ముప్ప నాకన్నఁదో యు. 22

ఉ॥ నావుడుఁ దల్లడిల్లి కుమనమ్ముల నవ్వటుఁ డిమ్మహోగ్ర
శ్లోవనితాముఖంబునఁ దగ్గుల్పడకుండ మహాత్మ్య వన్నికం
గావుము కావు మంచుఁ బదకంజయుగంబున వ్రాల నిందు శే
లా నెఱ పంచు నవ్వుచుఁ గలాధరుఁ డక్కునఁ గారవింపుచున్. 23

క॥ "వటువా విసవే శాతమ
జటిధూర్జటిధర్మపత్ని సాధ్వీ నహాల్యా
కూటిలాలక" నన సంస్మృతి
ఘటితవిబోధాభినయవిశ స్వరముఖుఁడై 24

క॥ జానుగ జనకాధిపసం
తానపురోహితునకున్ శతానందమహా
మానికిఁ దల్లిగదా య
మ్మానవతిన్ విందు నైన మఱియే మూర్మో. 25

వ॥ అనినఁ గళాధరుండిట్లనియె. 26

సీ॥ సమధికాలోకమాత్రమున నాశాపూర్తిఁ
గీలించు రతనంపుదాళిఁ బూని
వాడక నెత్తావి వీడక పరువంబుఁ
జెందుత్రొవ్విరిఁ బొందు సికమొనర్చి

పెను జట్టు వఱికిన తన ధారయుడివోని
బలువంకి మొలవంక నలవరించి
యనిలవేగంబున నాశనమునఁ బోవు
లేవున దిగుమత్తి మావు నెక్కి

గీ॥ తిరుగువేగంటి వేగంటి నరుగుదెంచి
యొంటినున్నట్టి తపసివాల్గంటిఁ జూచి
కడఁగి కామాంధకారంబు కప్పుకొనఁగ
ముప్పుఁదెలియక చీకటితప్పు సేసె. 27

క॥ శతమఖుఁడంతఁ దపోధను
సతి యవిదితసురతకేళి సంభ్రమవిరతిన్
మతివెతఁబడ గొబ్బునఁ దన
కుతిఁ దీర్చుక దుమ్ముదులుపుకొనుచుం జనియెన్ 28

క॥ విమలాత్ముఁడు గౌతమ సం
యమి యంతట రా నిజాశ్రమాంతికసీమన్
సుమకోనగసుమనోనుగ
కమనీయసుగంధలహరి గమగమ వలఁచెన్. 29

క॥ నాసాపుటపేయంబగు
నాసౌరభమునకు నాత్మ నరుదందు నిజా
వాసమునకు నొయ్యనఁ జని
యా సంయమి తన్మహాగృహాంతరసీమన్. 30

నాలిదుశ్చేష్టితంబును నపు డెఱింగి
గిటగిటన దంతకుంతముల్ గీటికొనుచు ౩౨

భుజంగప్రయాతము॥ అటో యోసి పాపిష్ఠి యహల్యా వృథా నే
డిటేలా యపేక్షించితే యిట్టికృత్యం
బటంచున్ యుగాంతోజ్జ్వలార్చిర్జటాలో
ద్భటజ్వాలికీలానిభక్రూరదృష్టిన్ ౩౩

క॥ కట్టల్క మౌనిపతి తన
పట్టపుదేవేరిఁ గాంచి బహుకాలము నీ
విట్టియఘ మనుభవింపుచుఁ
జట్టైయుండుమని ఘోరశాపంబొసగెన్

మ॥ అని యమ్మౌని శపింప నాతి శిలయై యట్లుండి యీరామచం
ద్రుని తేజోమహిమంబుచే నిపుడు తద్ఘోరాంధకారంబు వా
సి నిజాకారముఁ దాల్చె నట్లగుట నీచిత్తంబునన్ భీతిలం
జనదన్నం గనువిచ్చి నల్గడలు నుత్సాహంబునం జూచుచున్. ౩౫

క॥ డెందముతల్లడ మించుక
డిందుపడఁ గలాధరాఖ్యుఁ డీక్షించి మహో
న్నందమున వటుఁడు పలికెను
వందన మొనరించి చాటువాగారచనన్. ౩౬

గీ॥ తాపసోత్తమ నీప్రసాదమున నుగుడఁ
జీవలోకంబులోఁ బ్రతిష్ఠితుఁడ నైతి
నైన నిపుడునుఁ బోదు నామానసమునఁ
బ్రజ్వరిల్లు నలీక శంకాజ్వరంబు. 37

వ॥ కావునఁ దన్నివర్తనంబునకు ముహూర్తమాత్రంబు విశ్రమింప వలయు ననినఁ గళాధరుండు వయస్యా విప్రసమాజంబునకు భయంబు నైజంబగదా యటుగాన నీమానసంబునం గల సాధ్వసంబు మట్టుపఱుపఁగాక నిప్పట్టున విశ్రమింపు మనిన నట్లకావించి యవ్వటుం డొకింతచింతించి సవిస్మయుండుగా నతని కిట్లనియె. 38

గీ॥ ఋషికులోత్తమ యాత్మ నూహించిచూడ
నెంతవింత మహేంద్రుని యంతవాఁడు
వేలుపులమేటి బలుతేటి విధముఁ బూని
నహహ విషయసుఖేచ్ఛాపహారి యందు 39

ఆ॥ అనిన నతఁడు నవ్వి యో వటూత్తంస
భళిర మంచిమాటఁ బలికి తీవు
తలఁచు లోకులెల్ల ధరలోన నెన్నంగ
నల్పమతులు గాదట్టులంటి నేను. 40

క॥ మతి నైహికసౌఖ్యంబులు
సతమని సుతదారవిత్తసమధికరతి మో
హితులై జను లుండ్రు వితా
వితలగుచుం గాలమెల్ల వీటిం బోనక. 41

క॥ మనము హరించు నతాత్త్విక
ఘనవిషయములనెడుభటులు గవయించుకొనం
జను కనుఁగవయేనుఁగునకు
జనుఁ డోపఁడు తెలివి నంకుశముఁ గావింపన్. 42

క॥ కావున ముజ్జగములు దనఁ
కై వసమైయునఁగ వేయుఁ గన్నులకలిమిం
గావరమున నుండెఁగు విను.
ద్రోహపరిహార ననఁగ నకట దోసము కాదే 43

గీ॥ మునికుమారి విషయము మొదలఁ జక్షుఃప్రీతి
యుదయమైనఁ దోన యుపేయమంచు
నెట్టివారికేని నీ మనస్సంగాది
రూపకుసుమచాప చాపలములు. 44

వ॥ అనిన విని సదాచారుండు మహాత్మా! యిమ్మునిసువాసిని సు
కృతవాసనాపరిణామంబు రామభద్రప్రవాసంబునకుం గారణంబు
గానోపు నని నామనంబునం దోఁచుచున్నయది యనినఁ గళాధ
రుం డిది ప్రథమకారణంబు నావుడుఁ దదాకర్ణన కుతూహలంబు
సంఘటింప నవ్వటుం డతనిం గనుంగొని. 45

క॥ కొండపహేతువు వినుఁడు
పండువుగాఁ దెల్పుమనుచుఁ బ్రార్థించుటయుం
బాండిత్యము మెఱయంగ న
తం డిట్లనిపలికె వటువతంసములో దర. 46

క॥ శ్రీనిలయంబగు కిష్కిం
ధానగరము దనకు రాజధానిగ నేలున్
నానా వనచర సేనా
సూనావనశాలి వాలి యుద్యన్మహిమన్. 47

ఉ॥ అన్నగభేది యాత్మసుతు నాకపినాథుని ప్రాజ్యరాజ్యసం
పన్నతయుం బ్రసన్నతయు బాహుబలంబు చలంబుఁ బెంపు నిం
పు న్నయమున్ సమిజ్జయము నూపులుమూడయి చూచునిచ్చలుం
గన్నులు వేయిగల్గుటకుఁ గల్గెఫలంబని సంతసిల్లుచున్. 48

క॥ ఆవాలి పెక్కుదినములు
రావణుతో మైత్రిసేసి లంకకు దానన్
రావణుఁ డాకిష్కింధకు
నేవేళన్ రాకపోక లిల్లొదరింపన్. 49

క॥ జాలింబడి ప్రజ లడలఁగ
వాలికి శౌకనాఁడు జాంబవంతుఁడు గోలాం
గూలాచ్ఛభల్లవానర
జాలాగ్రణి వల్కె సకలసచివానుమతిన్. 50

గీ॥ అధిప రాక్షసజాతి మ్మాయాప్రసూతి
యదియుఁగాక పురందరమదవిభేద
కందళితబాహువిక్రమక్రముఁడు గానఁ
గేవలము పేకుఁబిత్స్వైరి రావణుండు. 51

గీ॥ వనచరోత్తమ నీయంతతనయుఁ డుండి
తండ్రివగఁ దీర్తునని యొడితీంద్ర లేక
శాత్రవముఁ దక్కి యతనితో మైత్రిసల్ప
నకట కపులెల్ల నిను విశావికని నగరె. 52

శా॥ లంకానాథు నుదగ్రవిశ్వజయలీలాధుర్యుఁ డంచున్ మదిన్
శకింపన్ వల దోకపిప్రవర నీశౌర్యంబు సామాన్యమే
బింకం బింక రణోర్వి నద్దశముఖున్ భీమోద్ధతిం బట్టి నీ
చంకం బెట్టి బిగించి వీరరసనిస్స్రావంబుగావింపవే. 53

కం॥ ఘనతరబలు రాకసాముం
శుచిఁ బట్టుటకేని వానితోఁ సంగరమున్
వనచరనాయక నీ కిపు
డొనఁగూడదు నమ్ము వార్ధియుంచుటకతనన్. 54

సీ॥ సురలోకవిభుని బంగరుగట్టుఁ బట్టించి
కేలి నుగ్రాటవిపాలు సేసి
జమునకు భుజదండచండిమోన్నతిఁ జూపి
యాతుధాను దివావిహార ముడిపి
పాశపాణి ననేకభంగసంగతి నుంచి
పవమాను నిల నెందుఁ బాఱఁదోలి
యక్షనాయకు నిధుల్ వీక్షింపఁబో నంపి
హరుని పౌరుషముఁ గొంత లఱగరాచి

గీ॥ తెగి సురాసురవరులకోఁ బగ గడంచి
యాత్మఁ బనచేటెఱుంగక యఖిలలోక
కంటకుండైన యగ్గజకంఠుఁ డోడి
శాంధనము నీ కనర్థానుబంధి పూవె. 55

క॥ ఎందును బాలస్త్రీలకో
బొందున కుపకారమునకు భువి నతిదూరం
బిందుకు నిష్ఠాంతం బగు
యిందుకె కాపాడిరిఁక వారాశేశ్వర విరాటే. 56

వ॥ అని యొట్లఁ జూసి. 57

సీ॥ ముదిగోడయే కాక మదికి ముచ్చటయైన
నెక్కఁ గల్గెన బక్కచిక్కినైనఁ
బునుకపేరులె కాక పెనుపండువున్నైన
బూనఁ గల్గెన సేసఁ పోలికైనఁ
నొలికబూదియె కాక యొకవేళ మనసైన
సలదఁ గల్గెన యింత కలపమైన
దంతిచర్మమె కాక యెంతయుత్సవమైనఁ
గట్టఁ గల్గెన బొంతబట్టయైన

గీ॥ వకట భిక్షరంబె కాక యెంతగ్గువైన
నానఁ గల్గెన తినయింట నంబలైన
నర్మసఖుఁడై నిధీశుఁ డనారతంబుఁ
జెంతనుండిన త్రిపురాసురాంతకుండు 58

వ॥ అని చెప్పెననిన నివ్వెఱగంది యున్నటుండు. 59

క॥ ఈసముచితమంత్రోప
న్యాసముఁ బరిహాసకౌశలాన్వితవాచో
ల్లాసము నెక్కడనేర్చెనొ
యీసరణి వృద్ధభల్లుకేంద్రుం డాదట. 60

ఆ॥ అతఁడు వటువఁ బల్కు నలజాంబవంతుని
వెలుగుమాత్ర మనుచుఁ దలచె దేల
యమ్మహానుభావుఁ డంభోజసంభవు
నావులింతఁ బుట్టినతఁడు నువ్వె. 61

క॥ నావుఁడు భావం బారఁగ
నానటుముఖ్యుఁడు గళాధరాఖ్యునిఁగని యో
కోవిదనుత విని యెద నిక
నావలికథఁ జెప్పు మనిన నతఁ డిట్లనియెన్. 62

సీ॥ ఎలుగుఱేఁ డీరీతి హితనీతి బోధింప
మతిదప్పె ముదిమిచే నితని కనుచు
వాలిఁనవ్వుచుఁ దన్ను గేలిసేయ నతండు
గేసరియను మంత్రి కేసరిసుతు
హనుమంతుఁ గని రహస్యముఁ దెల్ప నతఁడు నా
రేయిఁ గుమారసుగ్రీవనాముఁ
దోకొని చని ఋశ్యమూకాఖ్యగిరిదుగ్గ
మున నున్నవాఁ డన విని మహాత్మ!

గీ॥ మారుతాత్మజు జగదేకవీరుఁ డంద్రు
వార్త కెక్కిన యట్టివంటికీర్తి సిద్ధిక
నధిపుఁ జేటువంటివాఁడైన నతనివిడిచి
ధర్మమే పూన విపరీతకర్మమునకు. 63

వ॥ అనిన విని కళాధరుండిట్లను వయస్యా! యవక్రవిక్రమసుధాగేయుం
డగు నీయాంజనేయుండు విధేయుండై మున్న సహస్రభాను
సన్నిధానంబున వ్యాకరణవిద్యాపరిజ్ఞానం బనూనంబుగాఁ గాంచి
యన్నేనుంగు తేజినికిఁ గానుండై వానరయోనిం జనించిన సుగ్రీవునకు
నత్యంతసాహాయ్యంబు గురుదక్షిణా ప్రాయంబుగాఁ దదభి
ప్రాయంబు దెలిసి యొసంగె ననిన నవ్వాఁడు. 64

గీ॥ అనఘ యట్లైన నాఁ డదియట్లు గాదె
గూర్మి సబ్రహ్మచారిని గురుతనూజు
ననుసరించుట యుచితంబ యదియట్లుండె
సంతరీటికథఁ జెప్పు మన నతండు. 65

సీ॥ విని సదాచార్యుఁ గన్గొని యప్పు డిట్లను
నట్లు తద్భృత్యకృత్యంబు గతనఁ
జెలికాని యింటికి నలుగడి ద్రోహ న
వ్వార్త చారజనంబువలన నెఱిఁగి
ఖరదూషణాసురత్రిప్రధానాగ్ర
సరస్సైన రాయిడి గొంతతనయుఁ బాలు
నలవాలికిని వెన్నుబలముగాఁ బోలదిండి
పాదుకొని వెస నామబాద్ధు వనుప

గీ॥ జలధియుత్తరతటమున విడిసి రవిన
వటుఁడు వెలిగంది యాకార వసలఁడితఁడు
రాక్షసుండయ్యు మిత్రధర్మం బటన్న
నాకశాధరుఁ డతని కిట్లనియె నగుచు. 66

కం॥ అంచితనిజగుణమణిగణ
సంచితమాధుర్యధుర్యచారిత్ర సుధా
చంచద్ధారాసారము
నించఁగఁ గోరెద రావణుకథ నీవు వినుటకున్. 67

చ॥ అనఘుఁ డతం డొకానొకని కర్ధిఁ బ్రియంబుగ నాత్మకంఠలుం
ఠనకుతుకోన్నతిం గనుచెనర్ తుణాలూన పునర్నవీన సం
జనితతదీయమూర్ధములు సాగకుఁ జూచు నపత్రపాభరో
పనతవివరణతావిదితభంగము నద్దశమోత్తమాంగమున్. 68
వ॥ అనినవిని ముదంబంది సదాచారుం డనంతరకథాప్రకారం బెఱిం
గించు మనిన నతం డిట్లనియె. 69
చ॥ అంత ఖరాదిభీకరనిశాచరాదివహూథిని నిగ్రహించి దు
ర్దాంతసహస్రదంతిబలధారిణి దాటకనా మనుష్యభు
క్కాంత యొకర్తు నేఁడు మునికాంతముభీతిల నేతదాశ్రమ
ప్రాంతము మర్త్యమండలవిహారకుతూహల మావహిల్లఁగన్. 70

కం॥ నావుఁడు గుండెగుభిల్లనఁ
గా నిట్లనియె నింతకాలము నెందున్
నే వినఁ వేయుగజంబుల
లావునఁ దగునట్టి యిట్టిలలనాజనమున్. 71

క॥ ఆహ్వాని యొసఁగఁబోలు న
హా! మంత్రమహాస్త్రదేవతాన్వితముగా
రామునకు బలాతిబలా
నామకశక్తిద్వయంబు నా నతఁడనియెన్. 75

క॥ ఇందుకుసందేహమె యవి
ముందును వెనుకన్ మహాస్త్రములు కొసఁగెఁ గృపా
మందిర మనుటయు నతనికి
మందస్మిత మొసఁగ వాఁడు మఱియుంబలికెన్. 76

గీ॥ అనఘ యిట్లు నిజాధీనమగుచు నట్టి
శక్తియుగళంబు నమ్మహాస్త్రములు నుండ
యాగవిఘ్నోపశాంతికై యత్నసిద్ధి
రామునకు నేఁ డిట్టి గౌరవ మొసంగె. 77

క॥ ఓహో యిప్పుడు తెలిసెన్
బ్రాహ్మణకౌశికరాభిరచితఫణితిమానిత మహా
యూహా యన నటువ కతఁడను
నాహా నీ ప్రజ్ఞరీతి నాడంగనే. 78

మ॥ విలసల్లీల మహాసభాంతరమునన్ విద్యాప్రసంగంబు శి
ష్యులుగావింప నెసంగు సద్గురునకున్ శుంభద్గుణస్ఫూర్తి యు
జ్జ్వలశుక్తిచ్ఛటలం జలంబు ఘనముల్ వర్షింప ధాత్రిన్ నిర
ర్గళవిఖ్యాతిఁ బయోధి గైకొనుఁగదా రత్నాకరాఖ్యానమున్. 97

వ॥ అనిన నవ్వాక్యంబులకలరి వటువు మహాత్మా! యింక నొక్కచో
ద్యం బవిగాద వనన్యధేయ్యంబగు నవ్యానరమంత్రప్రాకారం బెత్తెఱం
గున నెఱింగితి రనిన నయోధ్యాప్రయాణసమయంబున సమాధిమ
యచక్షుస్సాక్షాత్కృతజగత్త్రయవార్తావిధానప్రచారుండగు గా
ధికుమారుండు ప్రానతిచ్చె నని తెల్పి ప్రభూతప్రభాతలక్షణాలక్షిత
యగు భువనలక్ష్మి నీక్షించి కళాధరుం డిట్లనియె. 80

మ॥ బలభిద్దిక్కటికిఁ విభూషణములై ప్రత్యగ్రగస్తాగణో
పలనీరాజితముల్ దినేంద్రకరముల్ పంకేజరాగద్యుతిం
జెలఁగ న్నీడకెసంబు పెంపున విసర్జించెన్ జగత్పన్నగం
గలఘు ధ్వాంతకరాళకంచుకభరం బక్షాశనాద్యంబుగన్. 81

క॥ జలరుహాకరకసవశు
క్షులు చీకటివాసచిలుకు గ్రోలి వెడల్చెన్
భళిభళి యప్పిక్కైతవమునఁ
గొలకులఁ గాగణాగుణానుగుణమాక్రముల్. 82

క॥ వికసితముకుళిత భూసో
వికసత్కుములావిభేదవిధి దగు సద్యో
వికచత్వంకజకలితా
ప్రకరముల విలింపు బృందపగిదిత జెలిపెన్. 83

గీ॥ కంబువు లయ్యె రథాంగప్రకాండ విరహ
చాయతాపోపశమనశైత్యపటువులైన
తనకరంబులఁ గిని రాత్రిజనదృశాళి
కంజవమెసంగ నిశియె నిక్కం జిహాసుఁడు. 84

వ॥ కావున హోమకాలంబతీతంబుగాకుండ మానితంబగు నివ్వస్తుజా
తంబు గొనిపోయెదననినఁ గళాధరుంగనుంగొని యువ్వటుండును
రామలక్ష్మణవీక్షాకుతూహలంబుననున్నవాఁడ వారలెచ్చోటను
న్నవారనిన యజ్ఞవాటంబునుత్తరభాగంబున నమ్మహానుభావులున్న
వారు నీవునచటికేగి నిశ్శంకంబుగా నవలోకింపుమని యనిచి
యత్తాపసకుమారుండు సనియె నంతనక్కడ రామభద్రుండనపగత
పథశ్రమంబగు సిద్ధాశ్రమంబునంగల యశేషవిశేషంబుల నీక్షించు
చు లక్ష్మణున కిట్లనియె. 85

సీ॥ తలఁపాలంబున కేగి జగదవ్వలకు నోర్చి
గాసిల్లి కసవులు గోసికోసి
కడఁగి గొమ్మన గ్రుద్దు వెడలంగఁ
బెదపెద్ద మోపులుగాఁగట్టి మోసిమోసి
కంటి కెప్పుడుఁగూర్కుగానక రేలెల్ల
వేగించి తినఁ దిన వేసివేసి
స్నాన సంధ్యాద్యనుష్ఠాంబు లటువెట్టి
దినమును బిడుదులు దీసితీసి

గీ॥ యడలు మానుఃఖఫల మింకగుసువు మనుచు
నగుచుఁ బలువూరు సోల్లుంఠనము లెసంగ
పటులు వికసింపుచున్నారు వత్సతరిని
నతిథి సంతర్పణంబున కదె కుమార. 86

క॥ మఱియుఁ బ్రాగ్వంశజమై
సురుచిరమధుపర్కపాకసురభిలమగు తె

స్మేర యుచ్ఛ్వాసితనాసాం
తరు లతికలు వీల్వ నల్పతం గనరయ్యెన్. 87

క॥ కౌస్తుభమణికింజల్క
ప్రస్తుతనీలోత్పలంబు పద్మాచిత్తో
పాస్త్రప్యుండు హరి వటుండై
యస్తోకతపం బొనర్చెనట మున్నిచటన్. 88

క॥ ఈరీతినలఘుమహిమో
దారంబగు నిమ్మహాశ్రమావనిఁ దపసుల్
వారక యకుతోభయసం
చారత నడిపెదరు కంటె షట్కర్మంబుల్. 89

మ॥ అదె కంటే ఫణిబంధవేదివలయం బౌదుంబరాచ్ఛాదనా
స్పదమై నిచ్చలు గృహ్యతంత్రవిధిఁ జెల్వొం బొల్చె నే తన్మహా
సదనోర్విన్ గృహమేధు లిమ్మునివరుల్ స్వారాజ్యసింహాసనం
బదరన్ వేల్చెద రధ్వరానలమునం దాయాపురోడాశముల్. 90

క॥ అవయవములు పూరింపగ
నవశిష్టంబగుసిగోచ్ఛ్రయంబు జటాకై
తపమున దాల్చె ననంగగు
నవృపలంకన్ మునిసమాజ మంగౌకసు నిచటన్. 91

గీ॥ జలజసూతి పురాసృష్టి కొలువు లిట్లు
చేసియుంచినకై వడిఁ జెలఁగుచుండు
ఘనతపస్యాకృశాంగుల మునులఁగంటె
కేపుఖూపును వహ్ని నర్చించువారి. 92

చ॥ అనలగృహావలిం బలినమార్జితనూతనతండులంబు లొ
య్యన దినుటేటిపైఁ గినిసి యాత్మవధూజనముల్ దదీయచో
దనమునఁ గుద్ధతింజనుడుఁ దత్కరమండితచండదండముం
గనుఁగొని మూర్కొనందివురఁ గంటివె నవ్వదర మ్మహామునుల్.

చ॥ హరిణి వినూతనప్రసవ యల్లదె యంగణయజ్ఞవేదికా
పరిసరభూమిఁ బచ్చనగుపచ్చిక మేయుచు సారసారకుం
గర మనురక్తిఁ గన్గొనెడుఁ గంటివె మౌనికుమారకుల్ దృణాం
కురములు నోటికందియిడ గోమున నుండెడు నాత్మడింభముల్. 94

మ॥ అలఘూత్సాహమునం దపోధనకుమారాకీర్ణనీవారతం
డులముల్ నల్గడలం బిపీలికలు శ్రేణుల్ గట్టి కొంపోఁ గుతూ
హలసంధానమునన్ జూడ్కికి సముద్యచ్చిత్ర ప్రతావళీ
విలసద్వైఖరి నాశ్రమోర్వి యిదిగో వీక్షించితే లక్ష్మణా. 95

గీ॥ అనిన విని లక్ష్మణుం డార్య యార్య పశువి
తతికినైన నపత్యవాత్సల్య మెంత
యనుఁడు సత్కర్మతాచ్ఛిల్య మర్భకులకు
నైన నాశ్చర్యకరమైన దనుచు మఱియు— 96

క॥ చేరువ నచ్ఛస్థలముల
నారయ గోకర్ణ తర్ణకావలి మునిరా
డ్వారవిలూనములై పున
రారూఢములైన దర్భ లానెడిఁ గంటే. 97

వ॥ అనుచుఁ బురోభాగంబున కుంజనునెడ సుమిత్రాపుత్రుండు మిత్రకు
లశేఖరున కిట్లనియె. 98

గీ॥ అనఘ జలవేణి నిడుఁదీవ్రయానయుగుట
నవలతావాలములచేత ననుమననుమ
గ్రంథిలములగు కాల్వలఁ గదిసి నిలిచి
నిలిచి ప్రవహించుచున్నది పొలుపుమీఱ. 99

వ॥ అనినవిని సుగుణసముద్రుండగు రామభద్రుం డన్నా నీవు కనుం
గొన్న సారణీవితానం బనూనంబై యొప్పుచున్నయది గదా! యని
యిట్లనియె. 100

క॥ అనఘా ముందును భూరుహా
కవదాలవాలములు నించి కవలక కుల్యం
బును జల మెఱుగఁ జేరక
వనితాకచనిచయరచనవైఖరిఁ గంటే. 101

క॥ అంతికగత నీకాశికఁ
గొంతవడిం జూచి సునము కోరి పవిత్ర
స్వాంతుఁడు మవ్వుసుమోయని తమా
చెంతకు వేవేగఁ జేరి చెలువుగ ననియెన్. 102

చ॥ అనిశముఁ జల్లనై విసులమై మధురంబయి యింద్రియత్రయిం
దనరఁగఁ జేయు నిత్తటిని నైజగుణంబు నతిక్రమించె బా
వనపవనోత్సప్రసనస్నాన యట్లన కాదె యొక్కెడన్
మునుపటివారికన్నను సమున్నతిఁ బూనరె నూతనాగతుల్. 103

మ॥ నిజమేధాజవనవ్రతప్రణయులై సిచ్చల్ పటుల్ పెంపగా
నజహాన్నిత్యవసంతవిభ్రమము సంప్రాపించి యీకింశుక

వ్రజముల్ సింహనఖాంకుశోగ్రకలికారాజిన్ మహోద్దామసా
మజబాధల్ దలఁగం దపోవనము శుభల్లీలఁ గాపాడెదున్. 104

వ॥ ఆసమయంబున నాకసంబున. 105

క॥ ఇనకులవర నీవు తపో
వనభూములు నెంతఁ దడవువడి ధన్యములై
తనర నిరీక్షించెదు ర
మ్మనుజన్మనితోడఁగూడ నదియేమన్నన్. 106

మ॥ కమలాప్తుండు యజుర్వితానమిప్పుడేకావించుఁ దేజస్స్థితిన్
దమ సావిత్రమహారహస్యము జపించంబూని తీసంయముల్
దమి తూర్ధ్వందినమైన సత్సవనముం దాఁ జేయువాఁడై గురుం
డనురం గోరుచునున్నవాఁడు మిము నం దాసన్నులై యుండఁగన్ 107

వ॥ అన నమ్మాటలువిని రామచంద్రుండు సానురాగంబుగా
నిట్లనియె. 108

సీ॥ కౌశికపుణ్యోదకస్నాన మొనరించి
క్షౌమవల్కలపటస్థాయి ధరించి
విమలభస్మత్రిపుండ్రము యుక్తవిధిఁ గాంచి
మెడను రుద్రాక్షతావడము లుంచి
దర్భాంగుళీయసందర్భ మంగుళిఁ జేర్చి
సంధ్యాస్యనుష్ఠానసమితిఁ దీర్చి
మైణేయచర్మభద్రాసనస్థితిఁ బొల్చి
స్ఫటికాక్షసరము హస్తమునఁ దాల్చి

గీ॥ రమ్యమై చర్మచక్షురగమ్యమైన
బ్రహ్మ మీక్షింపుచును వన్యభక్షణమున
బరగు నవిరలసాత్త్వికస్ఫురితచర్య
డెందమున నించె నానందకందళములు. 109

వ॥ అని ససంభ్రమంబుగా నూర్ధ్వభాగంబుపరికించి ప్రచండమా
ర్తాండమండలంబు గగనమధ్యారూఢం బయ్యెఁ గృతాహ్నికుండ
గు కౌశికునిసమీపవర్తుల మగుదము రమ్మని యాగశాలసమీ
పంబున కేగిరంత లక్ష్మణుండు దిగంతరంబు లవలోకించి యిట్ల
నియె. 110

మ॥ పరుషోద్యద్ద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదరోష్ణోపలాం
కురితజ్వాలజటాలజాంగలతటీలోకయుక్తులై ఘామని
ర్ఝరబాష్పప్లవమానభానుకిరణోగ్రప్రక్రియ న్నేత్ర తా
మరసంబుల్ దరికొల్పెఁ జూడ దశదిశల్ మధ్యాహ్నశూన్యంబులై 111

సీ॥ అని రాముఁగని యాచ్య యజ్ఞవాటిక మన
కిదె చేరువై యున్నయది దినమణి
వేడిమినపి స్రగ్గువెనుకఁ గౌశికుఁ జూచె
డముగాని గోపటతరువునీడఁ
దనరారుమంటపంబుల నిల్చి ఋత్విక్కు
లనుచేగఁ గన్నింత మనిన రాము
చంద్రుండు సమ్మతి సాంగ్రహ్నికంబులో
విశదమౌనచోట్లట విశ్రమించె

గీ॥ నంత సౌమిత్రి యాశ్రమప్రాంతభూమిఁ
గలవిశేషంబు లెదకు సౌఖ్యంబు సేయఁ
పార్శ్వభాగంబువీక్షించి పలికె మహిత
వచనరచనావిశేషంబు ప్రచురముగను. 112

ఉ॥ చండమయూఖమండలము సాంద్రరుచిం గిరణౌఘము న్నభో
మండలమధ్యఖేలనసమగ్రముఁ జేసి విలంబమానమై
యుండ బలాత్కృతింగడఁగి యొక్కరుఁ డీడ్చుచునున్నవాఁడు నా
మండితశాఖ్య ఛాయలు సమందగతిం గనుపట్టెఁ జూచితే. 113

వ॥ అనిన విని రాఘవుండు వత్సా! మధ్యాహ్నం బతిక్రమించెననియె
నన నది దినసావసానంబుగుటయె అదియెట్లన్న. 114

చ॥ నిరతిశయానసమగ్రగతినెక్కొన ము న్నుదయాద్రినుండి యం
బరశిఖ చక్కనెక్కి సులభంబుగడిగ్గను నివ్వ ఙార స
త్వరగమనంబెలర్ప దగఁబ్వ లెఱుంగక యస్తధారుణీ
ధరశిఖరాగ్రసీమకుఁ బతంగళతాంగతురంగసంఘముల్. 115

క॥ అనవుఁడు నపుడు సుమిత్రా
తనయుఁడు రఘురాముఁ జూచి దనుజాగమనం
బుప కదియుననన విని య
య్యనఘుం డిట్లనియె నట్టహాసములోఁడఁ. 116

మ॥ అటులైనం గ్రతువిఘ్నకృద్దనుజసంహారంబుఁగావించు మ
త్ప్రంబచాపంబు యుగాంతదండధరదోర్దండస్ఫురచ్చండిమో
ద్భటరూపంబు జగంబరాక్షసమునర్వంబూని మౌర్వీపరి
స్ఫుటటంకారమిషంబునం దొరకొనుం బుణ్యాహమంత్రావళుల్ 117

వ॥ అనినవిని లక్ష్మణుండు నవ్వి యార్యుని హృదయంబు రామునశిక్ష ణాక్షణోత్కంఠంబై యతిదీర్ఘదర్శియగు కౌశికదేశికేంద్రుని సంభావింపకున్నదని యమ్మహాత్ముని మహిమంబిట్లని ప్రశంసించె. 118

గీ॥ అనఘ యజ్ఞానబీజనాశనముకతనఁ
దేజరిల్లెడు నిజయోగదృష్టిఁ గాంచు
నమ్మహాత్ముని వర్తమానార్థములను
బూర్వ భావి సమస్తార్థజాతములును. 119

క॥ అన విని నవ్వుచు రాముం
డనుజున కిట్లనియె నీవు నననేటికి నా
ఘనుఁడగు గాధిమహీధవ
తనయుని మహిమంబు మఱిని దలఁపంగరమే. 120

గీ॥ బ్రహ్మతత్త్వజ్ఞుఁడైన యప్పారికాంక్షి
పట్టభద్రున కర్ఘ్యరోపక్రమంబు
మహిత గృహమేధినిత్యకర్మంబటంచుఁ
గాని సురలోక విభవేచ్ఛఁ గాదు సువ్వె. 121

ఉ॥ ధీరనుతుం డతండు వినతీకృతవాసవమాళిపాళిమం
దారమరందపూరమున దారుణకోపదవానలంబు చ
ల్లార వినూత్నభూతరచనాపరముం భుజశ్శైచి యమ్మహో
దారగతిం బ్రశంసచరితంబు జగద్విదితంబు సేయఁడే. 122

వ॥ అని ప్రశంసించె నంతనక్కడ విశ్వామిత్రుండు మిత్రుండపరగిరి
శృంగంబుచెంగట వెలుంగుటగనుంగొని తత్కాలంబు దైత్యాను
కూలంబని రఘుపుంగవుల కెఱింగించుచు తలంపున. 123

గీ॥ నిజమహాధ్వరచర్యచే నిగమభాషి
తార్థజాతంబు చరితార్థమై చెలంగ
యజ్ఞవాటంబు వెడలి తత్ప్రాంతమునకు
నరుగుదెంచుచు నాత్మ నిట్లని తలంచె. 124

చ॥ సమధికభంగి సాంగమయి జన్నము దీరఁగనయ్యెఁ బుత్రయు
క్తముగ వినాశమై యిప్పుడు తాటకయుం బడు నింక నీరఘూ
త్తముఁడు పురారివిల్లునిమి ధాత్రిసుతన్ వరియించి సారకా
ర్యములఁ జరింప నప్పుడు గదా కృతకృత్యుఁడనై సుఖించుటల్. 125

క॥ ఈరీతి వితర్కింపుచుఁ
జేరువ రఘురాముఁ గాంచి చిత్తమునకు నై
హారికమైన తదీయా
కారం బమృతాభిషేకకౌతుక మొసఁగన్. 126

సీ॥ నిరుపమబ్రహ్మైకనిధిఁ జూపు నంజనం
బనఁ గన్నుఁదోయి నంజనపుఁబొలర్పఁ
బైకినుబ్బిన మనఃపరిపూర్ణసాత్త్వికం
బన నవనీతలేపనము దనర
నీరేకు జగముల కీశుఁ డచ్యుతుఁడని
తెలిపెను ననఁ గరాంగుళులసంగ

వృజినఖండనములఁ ద్రవ్వెడుఖనిత్రంబనఁ
గరమున హరిణశృంగము వెలుంగ

గీ॥ మఱియు యజ్ఞాంగదండంబు మాఱి సాంగ
కృష్ణచర్మంబు నలర దీక్షితమహార్హ
వేషమున వచ్చె నారఘువీరుకడకు
కౌశికుండు పదానతకౌశికుండు. 127

క॥ ఈగతి దీక్షితలక్షణ
యోగనితాంతస్ఫురన్నిజోగ్రతపస్తే
జోగరిమఁ దనరు మునివరు
నాగమనంబునకు జాతహర్షోదయుఁడై 128

వ॥ రఘువరుండు సుమిత్రాకుమారుండునుం దాను నయ్యతిపతికిఁ గతి
పయపదంబులెదురేగి యభివాదనపూర్వకంబుగా దండప్రణామం
బు లాచరించి విరచితాంజలులై యున్న వారాచిన్నలంగనం
గొని యాలింగనంబొనర్చి మునివరుం డిట్లనియె. 129

శా॥ ఓగంభీరచరిత్రులార మది మీ కూహింప నాశీర్వచో
భాగం బెద్దియుఁ గాన మీవలన జంభద్వేషి యెల్లప్పుడున్
యోగక్షేమములొందుఁ దత్ప్రహరణవ్యూహం బికం బ్రాభవ
ప్రాగల్భ్యోచిత వస్తుమాత్రచరితార్థంబై తగుంగావునన్. 130

వ॥ అని యనవరతశిరస్కులై యున్న యన్నరపుంగవులఁ గనుంగొని
వెండియు నతం డిట్లనియె. 131

సీ॥ శుకముఖోదితకథావికచామృతాస్వాద
కేళిఁ దేలి చెలంగు సాళువములు
పంచాస్యదర్శనప్రాంచన్మనోవృత్తిఁ
దళుకొందు భద్రదంతావళములు
కాపిలార్భకసంఘటనపాటవయుక్తిఁ
జరియించు శార్దూలశాబకములు
కాకోదరాననోద్గతశబ్ద మెటవిన్న
ముదమునఁ బరతెంచు మూషికములు

గీ॥ సతతశాఖామృగాదరస్థితిఁ జెలంగు
కొండగోఱియలు గలిగి యఖండమహిమ
ధామమగు మామకాశ్రమసీమ రామ
ప్రేమనిల్పైనె నయనాభిరామమగును. 182

సీ॥ కుశదర్భపేటికాకోటి గారుడమణీ
రమణీయసింహాసనములు గాఁగ
భరితపాటలజటాపటలంబు లభిరూప
పద్మరాగకిరీటపటలి గాఁగ
ప్రాలంబినిర్మలస్ఫటికహారంబులు
విమలముక్తాహారసమితి గాఁగ
పవమానవశతరుచ్యవమానసుమధూళి
బెడగైన పసుపుపచ్చడలు గాఁగ

గీ॥ వరతపఃప్రాజ్యసామ్రాజ్యవైభవమున
నల్లసిల్లు తపోధనతల్లజములు

గార్హపత్యంబు నేడు మీాకన్నుఁగవకు
రాఁగ నొసఁగెన ఘోరామ రఘులలామ. 183

క॥ కౌశికుఁ డీగతిఁ బల్కిన
దాశరథి వినీతి మోదాల్చెను యవఁగాఁ
పేశలతరనిజవాచా
కౌశల మొనయంగ మునిశిఖామణి కనియెన్. 184

క॥ ఇది రమ్య సురమ్యం బని
మదిఁ దెలియఁగ నెవ్వఁడోపు మఱియొకచిత్రం
బిదె యనఘ యిదికనుంగొన
సకమలమతి నామనంబునాశ్చర్యమయ్యెన్. 185

ఉ॥ నావుఁడు గాధిసూనిరఘుసాధున కిట్లను నోమహాత్మ ము
న్నీవని దంభవాముఁ డహీనతపంబొనరించె నిప్పు డ
ద్దేవునిగాఁ బ్రబోధమయదృష్టి మిముం బరికించి నేత్రరా
జీవమువిచ్చెఁ జూచితె ఋషిప్రకరంబుఁ కరంబువేడుకన్. 186

గీ॥ అనిన రాఘవు లత్యంతహర్షు లగుచు
యతియు మనమున వీరి సంస్కృతపురాణ
జనసవర్తనులుగఁ జేసితిని నితాంత
భాసురోత్సాహమున కింత ప్రకృత మొందు. 187

వ॥ అని యివ్విధంబున మనంబున నెంచునెడ పొకపుగుబ్బలిపేరిట
కాశ్మీరంబునం జెలంగుతొలుసెంజకెంజిగికుంకుమంపుమడిం బొడ
మి వెలుంగు వేఁడివెలుంగు మున్నవంపుఁబున్నగుత్తి హత్తినతమి

హారిత్రరుణేజనంబు లందరును హస్తానుహస్తికచేఁ గౌతుకంబడర
వైచి కడవటం బడమరపడంతిహస్తంబునఁ జేర్చి రవ నస్తంబునం
బొలుపొందెఁ దదనంతరంబ పశ్చిమభాగం బవలోకించి యిట్లని
యె. 188

మ॥ కలవింకీకలకాకునాందికలనాకల్పద్రుమోద్రగశా
ఖల యగ్రంబుననుండి భానుఁ డిదెయాకర్షించెరుగ్ గర్దభీ
గలకాషాయము నీషదావృతతమస్కాండోర్ణికాజర్ఝరాం
చలదేశంబును నైన యర్చిని రఘుక్ష్మాపాలవంశాగ్రణీ. 189

గీ॥ నిగమములకెల్ల మూలమై నిఖిలవిబుధ
పూజితంబగు రవిసంజ్ఞ దేజరిల్లు
మేటితేజంబు మున్నిటినీటఁ గ్రుంకెఁ
దజ్జలంబులు మంత్రపూతములుగాఁగ 140

వ॥ అనినవిని రామభద్రుండు దిక్కులన్నియుఁ బరికించి సౌమిత్రి
కిట్లనియె. 141

గీ॥ చండమార్తాండకిరణప్రకాండదీప్తి
వెలిఁగి చల్లాఱె నన దిశల్ నలుపుదేర
వరుస నంతటఁ దదవస్థ వరుణదిశయు
దాసెఁ గ్రింగిరికిమీఁదికి వాసిగాఁగ 142

శా॥ శ్రీల న్నించె మునీశ్వరాశ్రమధరాశ్రేష్ఠంబు త్రేతానల
జ్వాలోపప్లవమానధూమవలభీసంక్రాంతదిగ్భిత్తికా
జాలంబై వటువుల్ ద్వితీయసవనస్వాధ్యాయవిస్తీర్ణలీ
లాలీఢేర్ష్య స్వరాళి దీర్ఘముగఁ జేయం బూనిరన్యోన్యముల్. 143

వ॥ అనిన విశ్వామిత్రుండు మిత్రకులవర్ధనున కిట్లనియె. 144

క॥ దినమునఁ బరిముక్తములగు
తనసీడల మగుడ నిచుళితంబయ్యె నవాఁ
దనరుచు జగ మివ్వేళం
గనుపట్టె నిరంతరాంధకారావృతమై. 145

గీ॥ ప్రాంతమున వార్ధినడుమను తత్సాను
వునఁ బ్రకాశించుచుండఁగా నెనసియున్న
యంధకారంబుచేతఁ జిత్రాంగియగుచుఁ
గౌతుకము సేయుచున్నది కను ధరిత్రి. 146

వ॥ అనిన రామచంద్రుండు సనిర్వేదంబుగానిట్లనియె. 147

క॥ మునుమును దేజోమయమై
కనుపట్టినయట్టిదిశలు క్రమ్మఱఁజూడం
దనరెఁ దమోమయమై మదిఁ
గనుఁగొన నజుభువనసృష్టి కనువింతగదా! 148

మ॥ బిలముల్ వ్రాల్చె భుజంగరాట్ఫణమణిశ్రేంఖద్ద్యుతిఁ దావనో
పలముల్ వాసి రథాంగయోషితమనఃప్రాప్తిం గనెఁ బావకుం
గలగెం జూడ దివానిశానిబిడయాతాయాతసంఘృష్టి నం
ధిలు సంధ్యాశిఖివిస్ఫులింగములునా దీప్తాకృతిం దీపముల్. 149

సీ॥ కటికిచీకటియె తక్క విలోచనగ్రాహ్య
మగుసమస్తము నదృశ్యత వహించెఁ
బ్రాచ్యాదిభేద మేర్పడఁ గారణములేమి
నేకమై కనుపట్టె నెల్లదిశలు

నెటువంటిధీరులపటుదృష్టి కేనియు
భయహేతువులు బట్టబయలఁ దోఁచెఁ
బలికినఁ గాని ముంగలనున్న యాకార
ములవీరువారని తెలియదయ్యె

గీ॥ నల్లెడలఁ బెల్లుగాటుకఁ జల్లినటుల
బెడిదమై మోము తెరువున నడిచి రేని
గానరాని మహోగ్రాంధకారపటలి
మించిజగదండకుహరంబు ముంచుకొనిన. 150

గీ॥ కటకటా పంకజాతజాగరణదీప
మైన రవి గ్రుంకఁ గైరవ మలరుటకును
సురభిమాధుర్యభాసురజ్యోత్స్న నీచ
కోరతతి గ్రుంగుటకుఁ గాల మూర వచ్చె. 151

గీ॥ బలుచీకటి తేటిగముల్
దొలవగఁ గాష్ఠాంతరములఁ దోఁచినతారా
చ్ఛలరంధ్రములం బలుమరు
జిలజిల నుసిరాలె కిరణచయదంభమునన్. 152

వ॥ అయ్యవసరంబున. 153

సీ॥ చుఱుకుచూపుల మించనుఱుకు జేగురుగ్రుడ్లు
దీంద్రించి బిఱబిఱ ద్రిప్పికొనుచుఁ
గఠినదంతాంతరగ్రథితంబులై యున్న
బుడుసులు జిహ్వచే గొడిసికొనుచుఁ

ఘనకకంచమున నించిన క్రొత్త నెత్తురుల్
జొబ్బుజొబ్బున సారె జొబ్బుకొనుచు
వవతంసగతశోణితామ్లగంధమునకై
నుడియు నీఁగలఁ బాఱజోపికొనుచు

గీ॥ వివృతముఖగహ్వరజ్వాలఁద్వీతిహోత్ర
చటులకీలలు కటికిచీకటులఁ దఱుమ
నుద్దవిడి వచ్చె వినువీధి గ్రద్దలాడఁ
దాటకానామ యొక్క నిశాటభామ. 154

లయవిభాతి॥ వచ్చి మఖశాల వడిఁజొచ్చి ఘనయూపములు
పుచ్చి పశుకాయములు వ్రచ్చి వలయంబల్
వెచ్చి పతగప్రతతికిచ్చెఁ జరుపాత్రములు
విచ్చి హవిరన్నరుచిమెచ్చి తనచూడ్కిన్
జిమ్ముదొరగన్ మునులహెచ్చు దొలగన్ బలము
పెచ్చుపెరుగన్ సవనకృచ్ఛటలునృత్తిన్
విచ్చలవిడిం దిరిగ నిచ్చలపుబీరమున
నిచ్చల వియచ్చరులు జెచ్చెరఁ దలంకన్. 155

గీ॥ అని కలాధరముఖు లప్డు యతికులేంద్ర
యనలకుండంబులను నెత్తు రావహించి
తాటయాకైది రాత్రిపతతులు మమ్ము
బట్టుకొన నేమిగతి యని బొట్టుగూయ. 156

గీ॥ విని సాకూతముగాఁ దన
మనమున నాశ్చర్యమంది మనుజాదిని వ

ద్భినదా యని మునిపతి యా
యినకులశేఖరుని జూచి యిట్లనిపలికెన్. 157

చ॥ మనుకులసోమ రామ వినుమా యిపు డుగ్రత నాతతాయులై
తనరు సుబాహుముఖ్యులగు దైత్యులు తోడుగ మాగృహంబునన్
ఘనని గమోదితంబగుమఖంబు నడంచుచునున్న తాటకన్
దునుమఁగ విల్లుగైకొనవె దుష్టనిశాటి నుపేక్ష సేయకన్. 158

క॥ అనవిని రఘుపతి యిట్లను
మనమునను జుగుప్స దయయు మల్లడిగొన న
మ్మునిపతివచనము గనుఁగొని
యనఘా యీయాఁడుదాని నగునే చంపన్. 159

వ॥ అయ్యవసరంబున. 160

ఉ॥ చాలఁ గళాధరుండు దితిసంతతిచెయ్వులఁ జిక్కి రాక్షసా
యేల యవధ్యు లీద్విజులు హింసకుఁ జాలరు తండ్రి కౌశికా
తాళముతాళ మేము వడిఁ దంచిరి నొంచిరి క్రూరకర్మలై
కాలను జేత నమ్మునిదె కార్ముకపాణిని రాముఁ బంపవే. 161

క॥ అనవిని రాఘవుఁ డాతని
గనుఁగొనుచుఁ గళాధరాఖ్య క్షణమాత్రము నీ
వనుపమసృధ దైత్యుఁడవై
మనమునఁ బెదరకను నిలువుమా యని మఱియున్. 162

మ॥ గురునింగూరిచి యింత క్లేశపడుచుం గూయంగ నేలా నిశా
చరవారంబుల ద్రుంచు టింతపని యీనన్నాని రాత్రేపను

గీ॥ మానుఁడీ మీర లోమూర్ఖమానులార
యాగసంతతి దివికి నేఁడేగ నిదిగొ
దారుణంబైన నాఖడ్గధారయనెడు
త్రోవ చేసువయైనది శేవమీకు. 171

క॥ అనవిని రఘురాముం డురు
ఘనసంభ్రమ మొనయ లేచి కార్ముకముఖసా
ధనములుగొని గిరిజాలం
భనసైన్యణి దోప వినయబద్ధాంజలియై. 172

వ॥ భగవంతుండగు గాధినందనున కిట్లనియె. 173

చ॥ అల యజుషట్టియింట నుశయంబయి నే విలుఁబట్టఁబట్టి యు
జ్జ్వలరవివంశశోషకవిశాలకళంక నవాంకురంబు వే
మొలచునొ యంచు నెంచితిని మున్నతివర్గ వధియింప స్వామి మీ
పలుకులు సంశయంబు నెడఁబాపెను జేసెదఁ దద్వధంబికన్. 174

వ॥ అని మునులనుద్దేశించి భయంబువారింపుచు నిట్లనియె. 175

గీ॥ రంపు మునులార యిదె రాఘవుండవచ్చి
నాడవై తుర్విఁ గలుముచు నాధనువును
కిలిజనాళి విస్పష్టగాధిజకుశాగ
సలిలపూణముగ కనయని తలఁచు డిపుడు. 176

క॥ అనికార్ముకమెక్కిడుచుం
జనియెన్ రాఘవుఁడు వేనిశాచర సేనం

-డును ముట్టక్కొ లక్ష్మణుఁడుం
దనలో నూహించెఁ గొంతనందన్మతియై. 177

క॥ మునుఁ జేసిన భాగ్యంబున
ఘనవీర్యుండైన యార్యకౌమారము గ
న్గొన తత్పాత్రంబున నే చ
య్యన సఫలంబయ్యెఁ గాదె యుని రణభూమిన్ . 178

వ॥ విలోకించి ఘతుకాంచితమనస్కుండై ప్రకాశంబుగా నక్కౌశికు
న కిట్లనియె. 179

మ॥ మునిచూడామణి నీదుశిష్యుఁడగు రాముం డిప్డు విల్లందినం
తన వాయవ్యప్రశస్తి యోగవిగతాధాకంపు మారీచుఁడ
య్యెను జీవన్మృతుఁ డాసుబాహుఁడును లోకైకాతిసంత్రాసకా
ర్యనంజాలకరాళసాయకహృతప్రాణిలుండై పడెన్. 180

సీ॥ బాలభీమయుగు నిధి శాలనిచేఁ జచ్చె
నెల్లని యాశ్చర్యమొనయువారు
వెలిఁగి దుస్సాహసవృత్తి చే నారకే
పొలిసెఁ గాయుని యాఁజొక్కువారు
రుధిర మేదోమాంస గృధ్రాంగిగిరిఁ జూచి
చీయని యుమియుచు రోయువారు
విస్మితాస్యులై మేనువిచ్చుక పడఁగని
క్రొవ్వడంగె నయని నవ్వువారు

సీ॥ హా నిశాచరజాతిమాయాప్రభూతి
మరలఁ బుట్టునోయిది యని వెఱచువారు
నగుచు గుమిగూడి మౌను లయ్యార్య బాణ
పాతనుఁ దాటక నరసెద రదిగొ కంటె  181

క॥ అనినన్ విశ్వామిత్రుఁడు
విను బాలక కౌతుకంబు విస్మయము మదిం
బెనఁగొనఁ బరవశతను జెం
దినకతనన్ మాఱుపలుక నేరమిదోచెన్.  182

క॥ కాదే నది వల్కెదనన
లేదే యెడనైన వచనలీలాస్పదమై
మీఁదగు ప్రతిష్ఠ నూత్నము
గాదుగదా వినుము తెలియఁగా వినిపింతున్.  183

మ॥ నిబిడాశాంచితకీర్తిధాతగగనుల్ నిర్వ్యాజధీరోద్ధతుల్
ప్రబలప్రౌఢమనస్కులైన రఘువుల్ పాటింప గీర్వాణశ
త్రుబలాలీ విజయాదికారణ ధనుర్దోర్దండులై లీల న
ర్వ బలద్వేషిగనిన్ శచీ కుచములం బత్రాంకముల్ వ్రాయఁగన్.

గీ॥ అనుడు సౌమిత్రి చూడుము మునివతంస
యూనిశాచర వాహినీహనన మను ప్ర
వీరధర్మాధ్వరాధానవిధిని వేగఁ
జేసి రాఘుండు మిమ్ములఁ జేరవచ్చె.  185

వ॥ అనిమొ నయ్యవసరంబున రామచంద్రుండు ప్రవేశించి యీశుదం
కురితలజ్జావనత ముఖుండై.  186

గీ॥ దినమణివసిష్ఠకౌశికమునులు ముగురు
రఘువులకు గురు లీయతిప్రవరునియును
మతినిజేసిన శ్రీహింస మాకుసుఖము
సేయదని యెంచి యాశ్రమసీమఁగాంచి. 187

వ॥ ఇట్లనియె. 188

శా॥ నిస్సీమోత్సవమయ్యె గర్భితవిధూన్నిద్రాంశునక్షత్రమా
దోస్సారప్రదకోమధూమలహరీదుర్లక్షవస్తుస్థితుల్
శ్వస్సంచీవరయుష్యమాణపటుకవ్యాఘాతవల్కంబు లం
తస్సుప్తాతిథికంబు లిమ్ముని నిశాంతంబుల్ నిరీక్షింపఁగన్. 189

చ॥ నలినవనంబునన్ విలసనంబు దొరంగఁ గురంగభృత్కరం
బులు బిసలక్ష్మిఁబొంది దివిఁ బొల్పెసగం గుధరాగ్రసీమలం
దెలుపు సెలంగ లోపలి మునింగినయట్టి జగంబు గ్రమ్మఱన్
వెలువడుచోఁ దమోంబుధి జనించిన ఫేనవితానమోయనన్. 190

సీ॥ సమయించనేకదా చటులనాసీరచం
ద్రమరీల నిబిడాంధకారభరము
నలరించనేకదా యతికుతూహలసుధా
సేచనంబున లోకలోచనములు
వాసించనేకదా కాసారకైరవో
త్కరముచే దిగ్వధూకైశికములఁ
దనియించనేకదా తరుణప్రభాంకూర
పారణాకలనఁ జకోరకములు

గీ॥ నిట్లుకిరణంబు లఖిలకాష్ఠైకఘటన
పటుతరోన్నతిఁ జూప నప్పంకజారి
పొడుపుగుబ్బలి నిటుమీఁదఁ బొడిచె నేని
దనకళంకంబు ప్రకటించుకొనుటనువ్వొ. 191

సీ॥ తనకరోత్కరము మాద్యచ్చకోరవిలోక
మండలంబునకుఁ గైదండగాఁగ
తనరాక కమలదృగ్వనితాజనాద్వైన్య
కలనంబునకుఁ బూటకాపుగాఁగ
తనతనూరుచి పయోధరపథశ్రేణికి
నానకుంకుమపంకచర్చగాఁగ
తనదుచంద్రిక కళాధరశిలాపాళికి
సంభస్సిరాశేఁసనాసిగాఁగ

గీ॥ నవనగరవధూటీసమర్పితార్ఘ్యశ్రీ
మసృణదూర్వానవాంకురగ్రసనకలన
కంబరంబగు హరిణాంకబింబ మలరెఁ
బ్రథమదిగ్భూధరశిరఃప్రఘణసీమ. 192

శా॥ పౌలోమీకుచకుంభకుంకుమరజోబాంధవ్యజాతోద్ధతుల్
ప్రాలేయాంశుకరంబు లింద్రనగరీభాగంబు లందంబుగా
హాళిం దిద్దుచు ద్రుంగుచుం దిమిర మయ్యాశావళిం దేర్చుచుం
నేలం నించుచు మింటినట్టనడుమం వెల్గొందెడిం బ్రేల్మెడిం. 193

శా॥ ఆవిస్వోధిని క్రోశయుగ్మమును రాజా యెక్కరాఁ డిప్పుడుం
జేరం గ్రారనచాటుకారకిరణాసీకంబు లెంతేఁ దమి

ప్రావారంబుల రాచి భూధరగుహాచక్రంబులం ద్రోచియుర్
జీవగ్రాహము గాచి యేచి పడవైచెన్ నీడలన్ ప్రోడలై. 194

సీ|| శితాశాఖ్యశకవంశ్యపృష్టిఁ దేరు
తమోబ్ధియుఘుగునఁ జేరినయుస లనంగ
కరటంకతతిఁ గనస్ఫురితాభ్రమున జారి
యెడనెడబడిన బొబ్బడ లనంగ
వితతాంశుభటకోటి వెన్నాడ
వగదొట్టి కలఁగినచిక్కుచీకటు లనంగ
ప్రాంచన్మరీచిధారాంబుసేకంబున
జనియించుభూమోష్మచయ మనంగ

గీ|| శ్రోణికి మయూఖబిసముల గూడి డిగిన
గగనధునిలోని శాదంబగణ మనంగ
నింకి నీడలు కన్నులపండు వగుచు
దండి గనుపట్టె ధారుణీమండలమున. 195

ఆ|| అలమృగాంకరోచి తిలతండులితమయ్యె
దళవితానభరితతరుతలములఁ
దమిఁ జకోరవితతి తమచంచుపుటముల
నదుమనదుమదినిన నడుపుదోప. 196

వ|| అని కొండొకవిచారించి విషాదవిస్మయంబులు మనంబున నుపైవం
గొన సైంధవుఁ డిట్లనియె. 197

చ॥ అల భువనత్రయాంధతమసాళి నడంచు దివాకరాంశువుల్
దళముగఁ జక్రవాళసరణిం దావమిషంబునఁ జేరుచున్న విం
పలరగ వచ్చి తామె యుదరాంతరపూర్తి క్షుదంధకారముల్
దలఁగఁగఁ జేయు చంద్రకిరణంబుల మ్రింగెడుఁబో చకోరముల్. 198

చ॥ అతులితలీలఁ బుట్టెడు నవాంబుకణంబులు సుట్టి యీయెడన్
బ్రతిగుడకంబు పుంజములభంగిఁ గనంబడఁ జంద్రకాంతసం
తతి తతమయ్యెనే గతిఁ దథాగతిఁ దూర్పునఁ బంకజారి య
ద్భుతముగఁ గల్వరేకుదలుపుల్ దొలఁగం గిరణాళి నింపెనో. 199

చ॥ చటులవిధుంతుదాస్యపుటశాతరదక్షతజాతరంధ్రసం
ఘటితనభఃప్రభాంకురముఁ గం దని కందళితభ్రమంబునం
గటకట లోకులాడుటలు కానని చీకటిగాక యీసుధా
ఘుటికకు మంచునించుదొరకుం బరికింపఁ గళంక మున్నదే. 200

చ॥ ఖరకరుసానఁబట్టి కరకౌశలమొందినవిశ్వకర్మ తాఁ
దరువణఁబట్టెనో తుహినధాము నిజం బటుగాక యున్న ని
ర్భరతరభంగి నింగిఁ గనుపట్టునె యీ యళిక తారకాచ్ఛటా
పరిమితఖండకాండముఁ బ్రభావిసరత్త్రసరేణుజాలముల్. 201

చ॥ జలరుహగర్భుపేరియగసాల నభంబనుమూసఁ దారకా
వలి నికుడించి సాంధ్యరుచివహ్నిశిఖం గఱగించి చేసెనో
చెలఁగి సుధాంశుఁ గాని యొడఁ జీకటిరేలు భువంబు వెన్నెలల్
గలిగినరేఁ గొంచెముచు గాఁగతమేమి ? యనుప్రకాశముల్. 202

చ॥ జనులు సుధాకరుండన విశాలతమఃపటలంబు గ్రమ్మ చూ
పెనయనికన్నెదమ్ములకు దృష్టియొసంగుద్విజేంద్రుఁ డర్థియై
చన విముఖంబులై నజలజంబుల కిచ్చె నిజాఘు మంగనా
జనపదనోపమానుకృతిసారము గైకొనియెం దదీయముల్. 203

సీ॥ అనినవిని కౌశికుఁడు తనయాననమున
మొలకనవ్వొల్క నకట లోకు లభిధాన
మాత్రమాధుర్యమున భ్రమ మదినిబూని
నిశ్చితార్థంబులెఱుఁగక నిందు్య లైరి. 204

వ॥ అదియెట్లన. 205

చ॥ సకలదిగంతముల్ గడుఁ బసన్నములై నవుఁ గైరవాచ్ఛకో
రకతతి ఫుల్లమైన నుదరంభరులై నచకోరవాళి చం
ద్రికలను మెక్కి మెక్కి పరితృప్తి వహించిన నత్రినేత్రదూ
షికయగు నీతనిం దగునె చేరి సుధానిధియంచు నెంచగన్. 206

వ॥ అని గాధినందనుండు దశరథనందనుం గనుంగొని యతండు శామా
రార్జితప్రచండభండనోద్దండవిజయలక్ష్మీపరిణయకౌతూహలాయ
మానమానసనంబునం బ్రవేశించుచున్న వాఁడయ్యు నిరాఘాటధా
టీపరాభూతవిబుధమునిజయ్యూటయగు తాటక నొక్కవ్రేటున మా
టుడొలంగఁ జేసియు స్త్రీవధంబని నిరంతరచింతాకులస్వాంతుండగు
చుగ్రక్కుగ్రక్కున మనంగలయరాడని సుమిత్రాపుత్రు నవలో
కించివత్స! మనకీవృత్తాంతంబువలనఁ బ్రకృష్టపౌరుషలక్ష్మీసదృ
శమై ప్రదోషలక్ష్మీపాదకట్టుచున్నయది యదియెట్లన్న. 207

గీ॥ దనుజగాఢాంధకారవిదారి యైన
రామచంద్రుఁడు చెంతకు రాఁగ మునుల
యుల్లసల్లోచనముల నీ యుర్వి మిగులఁ
గనఁ గుముద్వతియైనది యనఘచరిత. 208

మ॥ కలశాంభోనిధిందు జాతుఁ డగుటం గంధుల్ మథింపంగ న
త్రిలసన్నేత్రజుఁ డౌట లోకనయనశ్రేణుల్ ముదంబందఁ ద
ద్బలభిచ్చారుచతూరుభాండ మగుటన్ బర్హిర్ముఖుల్ దృప్తులై
చెలువొప్పంగను జేయుటల్ దగును జర్చింపం బయోజారికిన్. 209

క॥ అనుచును లజ్జాన్వితుఁడై
తనగురుసన్నిధికిఁ జేరి తాపసముఖ్యా
వినతియొనరింతు నన న
మ్ముని సస్నేహబహుమానముగ సతివేడ్కన్. 210

వ॥ ఆలింగనంబు సేసి యని. 211

గీ॥ వత్స యీప్రకారంబున వడిఁ బ్రసృష్ట
కర్తృనిష్టక్రియాఫలోత్కరము లగుచుఁ
జెలఁగునానాధ్వరంబులు సేయుచున్న
మమ్ము రక్షింపుదురుగాత నెమ్మి మీరు. 212

సీ॥ అనవిని రాఘవుం డాత్మగతంబున
మద్గురువచనంబు మోళిసీమఁ
దాల్చితి నని సమ్మదవ్యగ్రుఁ డౌనెడ
మగుడ విశ్వామిత్రమౌనివరుఁడు

సమరవరాగధూసరమైన యాతని
వరకపోలము తనవల్కలాంచ
లంబునఁ దుడుచుచు లక్ష్మణాగ్రజ యిట్లు
ప్రతికూలురై మనక్రతువుఁ జెఱుప

గీ॥ దానవులు మున్ను వచ్చిరి గాన నిటుల
మా ప్రియసుహృత్తు జనకుండు మమతచేతఁ
జేయుమఖమున కేకీడు జెందునొక్కొ
యనచుఁ జిత్తంబు కంపితం బయ్యె నిపుడు. 218

గీ॥ అనిపవిని రాముఁ డోస్వామి జనకుఁ డెవ్వఁ
డరయఁ ద్రిభువనదుర్లభంబైన నీదు
ప్రియసుహృచ్ఛబ్ద మతని కేరీతి నధిక
మహిమ మొనగూర్చె ననిన నమ్మౌని పలికె. 214

క॥ వినవా రాఘవ దైనం
దినశుభశుంభద్విదేహదేశములోనన్
ఘనదానఝరీయుతకుం
ఖనిరాకృతనీలగిరిని మిథిలానగరిన్. 215

మ॥ అనినన్ రాముఁడు స్వామి విందుము సదా యందేకదా మాంచి
ద్ధనువున్ సర్వధరావరావలిమరానర్ఘంబు సీరాగ్రలే
ఖనరేఖాంకధరాప్రసూతి నచలాగర్భోద్భవన్ గన్యకన్,
జనసందోహము దెల్పుచుండును మహాశ్చర్యప్రధానంబుగన్. 216

గీ॥ ఇప్పు డం దేమి యన వూని యాజనకుఁడు
భాస్కరువలననేర్చినపగిది నతని
శిష్యుఁడగు యాజ్ఞవల్క్యునిఁ జేరి బ్రహ్మ
సంహితనునేర్చి నేరిచి సాత్త్వికమున. 217

క॥ విడిచెను శస్త్రాస్త్రములను
దడయక యటుగాన నట్టిధన్వునిదీక్షన్
విడిపింప నేమివిఘ్నము
పొడమెనొకో యనెడు శంకఁ బొందితి ననఘా. 218

క॥ కావున నీవిధి శేషము
వేవేఁ బూర్ణంబు సేసి వెడలం దగు నా
భూవరుపీటకి సుభగం
భావుక శుభ పేటి కిపుడు పార్థివముఖ్యా. 219

క॥ అన రాముఁడు హర్షముతోఁ
దనతమ్మునిగూర్చి యేకతంబునఁ బలికెన్
విను నాకుఁ జంద్రశేఖరు
ఘనచాపవిలోకకౌతుకంబు జనించెన్. 220

గీ॥ అనిన సౌమిత్రి పరిహాసమొనయ ననఘ
యాయయోనిజయగునట్టి యబ్జవదన
వరయు వేడుక పొడమిన దనిన నేమి
తప్పుగాదని పలికినఁ దాటకారి. 221

క॥ తనమోమున మందస్మిత
మనువుపడం గినుకఁబోలె మాకాను భళీ
కనఁ బ్రహసనమున సూత్రము
గను వివరించితి నటంచుఁ గౌశికుతోడన్. 222

క॥ స్వామీ రఘుకులదేశిక
మీమది కెయ్యది ప్రియంబు మేమును దానిం
బ్రేమ శిరసావహింతుము
సామాన్యుల గురుమతంబు ఛాత్రులకరయన్. 223

వ॥ అని వినయవినమితవదనచంద్రుండగు రామచంద్రుండు పలికిన
ముదంబంది వందితసమస్తమునివారుండగు నగ్గాధికుమారుండు
ను రాజకుమారులం దోడ్కొని యిష్టాలాపంబులతో మిథిలాన
గరోపవనప్రాంతంబు ప్రవేశించె నంత. 224

సీ॥ తనువుపై వానసోకినరీతిఁ గనుపట్టు
బరులతో నెమ్మోముతరులతోడ
వటికెశ్ఛపారలచేఁ గుఱుచచూపులుచూచు
దృష్టితో ననలంబయష్టితోడ
నరలగడ్డమునఁ జేవురునించుపీడింపు
రసముతో జమిలికుప్పసముతోడ
పటిమగోప్పడి ప్రేలఁబెకుచు నుయ్యాలలూగు
కముపుతోఁ దడకాటునముపుతోడ

తే॥ కూరుకతమున నెమ్మనఁ గామపించు
డగ్గుతో నగ్గలపుఁబాడిదగ్గుతోడ

సారిదిఁ గనుపట్టె జరఠకంచుకి యొకండు
జనకశుద్ధాంతభామినీజనమువనుప. 225

వ॥ పోవుచున్నయతండు తనమనంబున. 226

చ॥ పలుకుల జీర్ణగాత్రముల బాటవ మించుకలేక మిక్కిలిన్
నలువురు నవ్వఁగాఁ బ్రహసనంబు సహించిన నన్ను నింకఁ బా
టిలినమహాయు వేమిట నటింపఁగఁజేయునొ కానరా దహో
వలిపలితాదిబాధ పగవారలకున్ వల దివ్వసుంధరన్. 227

క॥ అని పురపరిసరసురుచిర
వనవీథిని రఘునృపాలవరనందనులన్
ఘనుల న్నిజభుజభీకర
ధనులన్ మహనీయకీర్తిధనులం గాంచెన్. 228

వ॥ ఇత్తెఱంగునం గాంధినందను దన్మహాధ్వరప్రత్యూహపరిహారకు
లగునక్కుమారదారకులను గనుంగొని యంతరంగంబున నభంగు
రప్రమోదంబు నిగుడ మగుడ నగరుసొత్తెంచి కొన్నికత్యాంతరం
బులునిర్గమించి ముందట. 229

క॥ కాంచీమణికింకిణికా
ప్రాంచన్నినదంబు చెవులపండువు సేయన్
గంచుకి యాకర్ణించి రమో
కించుకచింతించి తెలిసి యుంచినవేడ్కన్, 230

మ॥ కలహంసీకటిభాగశోభితరణత్కాంచీమణీకింకిణీ
కలనాదం బిడియంచు నెంచఁగ, ధరాకన్యాపదాంభోజని
శ్చలసేవాచరణైకదాస్యమగు నాచంద్రాన్వయే తెంచి ని
ర్మలభక్తిం బ్రణమిల్లి యిట్లను సుధామాధుర్యధుర్యోక్తులన్. 281

గీ॥ అయ్య యెటనుండి నీరాక యానతీయఁ
దగిన వినిపింపుఁ డనిన నమ్మగువఁ జూచి
పావనల్లుఁడు పల్కె నోపూవుఁబోఁడి
యీవెఱుంగవె దాచఁగానేల నీకు. 282

శా॥ శశ్వద్బోధకళానినాథు జనకక్ష్మానాథు వీక్షింపఁగా
విశ్వామిత్రమహామునీంద్రుఁ డిటకున్ విచ్చేయఁడే రానుతుల్
విశ్వైశ్చర్యధురీణవిక్రమయుతుల్ విద్యోతమానాకృతుల్
విశ్వాసంబుదలిర్ప నిద్దఱు మహావీరుల్ దనుంగొల్వఁగన్. 283

ఉ॥ ఆనరనాథనందనులయాకృతు లేర్పడఁ జూచి రమ్మటం
చానినవేడ్కఁ నన్ను నిపు డంతిపురంబుజనంబు పంపఁగా
నేనును వారలున్న యెడ కేగి తదీయతనూవినూత్న రే
ఖానిఖిలాంగసౌష్ఠవము కన్నులపండువుగాఁగఁ జూచితిన్. 284

సీ॥ మొలకనవ్వులచాయ మెలయువెన్నలగాయఁ
దులకించుమోముచందురులచేత
శ్రీకారములజాడఁ జెలగుపీనఁలతోడఁ
గలసీవర్త్తులుకన్నుఁగవలచేత
జిగిఁగుల్కునవలేని చిఱుతకూకటు లూని
యులరునిద్దంపుఁజాదలలచేత
పటుతరోన్నతిఁబొల్చు బలితంపువిలుదాల్చు
కమనీయబాహుదండములచేత

గీ॥ తళుకుగలజాళువాజన్నిదములచేత
బొలిచి కంతుజయంతుల గెలుచునట్టి
రాచకొమరులచెలువంబుఁ జూచి రేని
బుధుష్ఠులకునైన మోహంబు పొడమకున్నె. 285

ఉ॥ ఆరుచిరాధరంబు నగి యాతనుసౌష్ఠవ మాగళంబుసిం
గారము నాభుజార్గళవికాసము నాకటివిభ్రమంబు నో
వారిజనేత్ర ధాత్రిఁ బెరవారికి లే దనిచెప్ప నేటికిన్
మారున కేని వాసవకుమారున కేనియుఁ గల్గనేర్చునే. 286

క॥ అనఁ గంచుకిఁ జూచి నితం
బిని వారలకులముఁ గులముఁ బేరుం బెంపున్
వినవలతుఁ దెలుపవే యన
ననుపమమధుమధురభణితి నతఁ డి ట్లనియెన్. 287

మ॥ అసురానీకమహాత్మమూర్తి యగు నయ్యంభోజనీభర్తృవం
శమునన్ శంసితకీర్తియై దశరథక్ష్మానాథుఁ డొప్పుం దద
స్త్రములం బూర్వసుపర్వయావతనితాంతశ్వాసవాతప్రకో
ప మొలర్పన్ భిదురంబుఁ గూర్పఁ దలఁచుం జంభద్వేషి హస్తంబునన్. 288

క॥ సాకేతనగరరాజ్యర
మాకల్పమనం దనర్చు నాధరణీభృ
త్ప్రాకారి తనయు లీరుచి
రాకారులు రామలక్ష్మణాహ్వయు లబలా. 289

గీ॥ అతులభుజదండచండిమాహతవిరోధి
వీరు లగుచును భువి ద్వంద్వచారులగుచు
భరతశత్రుఘ్నులను పేరఁ బరగువారు
వీరియనుజన్ములో రాజకీరవాణి. 240

సీ॥ అనఁ గలహంసి యిట్లను నోమహాభాగ
మనవిదేహనృపాలుమందిరమున
సీతోర్మిళానామశాతోదరీమణుల్
మాండవీశ్రుతకీర్తిమానవతులు
నున్నకైవడి వీరు నున్నారు నలువు రీ
రాకుమారకులు మహాకులప్ర
సూతులు సద్గుణాన్వితులు వీరికిఁ
బరిణయం బొనరించుభాగధేయ

గీ॥ మహిమ చేకూడదొకో యింత మనకు ననుఁడు
భద్ర మయ్యెను సకలంబు భగవదాజ్ఞఁ
దల్లడిల్లకు మనిన నప్పల్లవోష్ఠి
యలరి ప్రణమిల్లి యిట్లను నతనితోడ 241

ఉ॥ నిక్కము పల్కితో యనఘ నీవు మదీయమనోవిచారముల్
చొక్కలువుచ్చఁ బల్కితివొ మున్నుగ నీదృశభద్రసూచకం
బెక్కడ నైనఁ జూచి యిపు డిగతిఁబల్కితివో యనన్ మదిన్
మక్కువ మీఱఁగా నతఁడు మానవతీమణితోడ నిట్లనున్. 242

వ॥ ఒక్కవిశేషంబు గల దే నక్కుమారులం గనుంగొని మరలి
యేతేర గౌతమపుత్రుండు రాజపుత్రీసౌభాగ్యదేవతారాధనంబు

నకు నన్నుఁ బుత్తెంచె నత్తపోధనసత్త్రముండుఁ గాలత్రయవిత్త
ముండు గాన నతనివాక్యం బమోఘంబనుతర్కంబున శుభోద
ర్కంబు వలికితి నన నక్కలికి కొండొకవిచారించి యిట్లనియె. 243

గీ॥ జానకీవధూటిఁ జండీశకోదండ
మెక్కు బెట్టువాని కిత్తు ననుచు
జనకుఁ డాడుకొన్న సాహసంపుఁబ్రతిజ్ఞఁ
గొంచ కితఁడు నిర్వహించ గలఁడె. 244

గీ॥ నావుఁ డతఁడు మాకు నీవిచారమకదా
మగువ యుల్లమునకు దిగులొనర్చె
నైన శంకవలవ దమ్మహాద్భుతశక్తి
యీకుమారకునకు లేకయున్నె. 245

వ॥ అట్లులేకుండునేని. 246

క॥ సవనముముగిసియు రక్కసు
లవిసియు ముని నృపుని బ్రతిన యాసియు సీరా
ఘువు బాలు నింతదూరపు
టవనికిఁ దేనేల దశరథైకప్రియునిన్. 247

సీ॥ అన విని కలహంసి యాత్మలో నొకమాటఁ
దలపోసి కంచుకివలనుజూచి
యడలుచు నిల్లను "ననఘు నేఁ డొకవార్త
విని విషాదమునొందుతనమనంబు

భర్మపాంచాలికాపరిణయోత్సవకేళీ
కైతవంబున సాంద్రకౌతుకంబు
గావించునృపపుత్త్రిఁ గాంచి మీకటికార్య
మరయుట కిప్పుడే నగుగుదెంది

గీ॥ తావకాలోకసమున నంతయును మఱచి
చెవుల రక్కసులనుమాట నవులు మగుడఁ
దలఁచికొంటిఁ గడంక నాతరుణిసీత
కింతవెతసేయునవ్వార్త యెట్టి దనిన. 248

క॥ వినవా యిచటికి రావణ
దనుజపురోహితుఁ డొకండు తమయేలికకై
మనసీత నడుగవచ్చుట"
యన నతఁ డవసరముగానక యంగన కనియెఁ. 249

ఆ॥ నృపతనూజ యిట్టివిపరీతకార్యంబు
తెలిసి యింతవంత నలసె నేని
తరుణియంగకములు తారుణ్యలక్ష్మికి
నెదురుసూచుచున్న వింత నిజము. 250

ఆ॥ అనిన నగుచుఁబల్కు నయ్యింతి నిక్కమ
మ్మాట యనఘ వృద్ధులాట నింక
సిగ్గువిడిచి మీకుఁజెప్పెద వినుఁడు మా
సీత కిపుడు గలవిశేష మొకటి. 251

ఉ॥ బొమ్మలపెండ్లిసేసి నవబోడి యొకర్తె మిథునంబుఁ గూర్పఁగా
రమ్మని బాలికల్ బిలువ రానన పత్రపనం దలంకుచుం
గ్రమ్మిన కపోలపాళిఁ బులకప్రకరమ్ము కరమ్ము మించఁగా
నమ్మదిరాక్షి సిగ్గుపడినందుకు సిగ్గుపడు న్మనంబునన్. 252

క॥ అనవుఁడు నవ్వుచుఁ గంచుకి
యను నిపు డల్లైన బాల్యయౌవనసంధిం
గనరుచునున్నది జానకి
విను మోసలహంసి యిట్టివేళన కాదే. 253

క॥ మనమునఁ దలఁకెడు బాలా
జనములచే మను ననూనసామ్రాజ్యండై
మనసిజుఁ డాలవకన్నెఱుఁ
గనిమంత్రముగగ్గి వికచకమలదళాక్షీ. 254

చ॥ నవనవమార్దవాంగకఠినత్వముగూర్చి రయొనర్చె జవ్వనం
బవిరళభంగి నాభిగుపులౌఁజిగిగుబ్బ లురంబు సెందఁగా
సవినయధృష్టఁ తామసృణశంబరవైరికథావధాన లౌ
యువతులె కాక లోకమున నొందుశుభోదయ హేతువున్నదే. 255

గీ॥ అనినఁ గలహంసి నవ్వి యోయనఘ యిప్పు
డేను నేమియుఁ జెప్పలే దీవు నేమి
వినుటలే దిది యింక నీమనసులోన
మఱవఁదగునన్నఁ గంచుకి తెఱవతోడ. 256

ఆ॥ చెలువ నాగుణంబు దెలియ కాడెదవు నీ
వైన నేమి గోప్యమైనమాట
యడరఁ నొరులెఱుంగు టది యెట్లు నూతిలోఁ
గుంకువైచినట్టు లుండవలదె. 257

క॥ అని వెండియు నతఁ డిట్లను
మనజనపతిశౌష్కలాగమున మీావఱకుఁ
వినఁ డొకొ వినినఁ వినుగా
కనినం గలహంసి వేత్రహస్తున కనియెఁ. 258

క॥ కుహనాపసుఁడు దురాత్ముఁడు
మహిసుతకు దశాస్యుఁ జేడమగ ఁడగునో యఁ
దహతహఁ బొందెద నన విని
యహహా యని నవ్వి మగువ కతఁ డిట్లనియెఁ. 259

క॥ ముల్లోకంబుల గలిచిన
బల్లిదుఁడని పెండ్లియాడఁ బాత్రమె సీతఁ
దల్లడమేటికిఁ గుహనా
భిల్లశరాసనము విఘ్నబీజము గలుగఁ. 260

మ॥ జనకక్ష్మాధిపమౌళి యారయ మహోత్రాన్వయోత్తంసుఁ డ
ద్దనుజాధీశునకై జగద్విదితసంధానోని సైరించునే
యన నయ్యంగన నిర్భరప్రమదగుంభాంభోధి నోలాడి యో
యనఘా యెచ్చటనున్న వారు రఘువంశాంకూరచూడామణుల్.

వ॥ అనినఁ జతురవచనరచనాకోవిదుండగు నాసావిదల్లుంకు పువ్వుఁ
బోఁడి కిట్లనియె. 262

మ॥ రమణీ యారమణీయమూర్తులు పురప్రాంచద్వనీవీథినం
యనిసంక్రందను గాధినందను సముద్యద్భక్తి సేవించుచుం
బ్రమదం బొప్పఁగ నున్నవా రదెయఖర్వజ్ఞానకర్మైకయో
గముచే సాంగళమై లభించునపవర్గస్వర్గయుగ్మం బనన్. 263

వ॥ అనిపలికి సౌవిదల్లుం డప్పల్లవాధరం జూచి వయస్యా! నీవే తెం
చియాలస్యం బయ్యె నింక సత్వరంబుగాఁ గన్యాంతఃపురంబున
కుం జను మని పనిచి తానును జనకశుద్ధాంతంబుఁ జేరి తత్కాం
తాజనంబునకు రఘునందనుల తెఱం గెఱింగించి ముదం బొద
వించె ననంతరంబ. 264

మ॥ తనవెంటన్ రఘురాజనందను లమందస్ఫూర్తి నేతేర న
మ్మునిచంద్రుం డరుదెంచి కాంచె నెదుటన్ మూర్ధాభిషిక్తచ్ఛటా
ఘనకోటీరమణీఘృణీలిఖితరంగచ్ఛత్రవిస్తారమున్
జనకాధీశుజగాహజారము దిదృక్షారంగశృంగారమున్. 265

గీ॥ కాంచి పల్యంకికాందోళికానుదేభ
తురగముల డిగ్గి భయభక్తిభరితుఁగుచు
మున్నెఱుంగుదొరల్ దండములనిడంగ
నంచితోన్నతిఁ జేరనేతెంచునపుడు. 266

శా॥ కర్ణాకర్ణికచేఁ దదాగమన మాకర్ణించి భూజాని సా
వర్ణప్రోన్నతభద్రపీఠిఁ డిగి దివ్యద్వందికోలాహలం
బర్ణోరాశితరంగనిస్వనము నుడ్డాసింపఁ గౌతూహలా
కీర్ణుండై యెదురేగి చెంగటఁ ద్రిలోకీదేశికుం గౌశికున్. 267

వ॥ కనుంగొని సాష్టాంగదండప్రణామంబు లాచరించిన నవ్వాచంయ
మినురేంద్రుండు శీరధ్వజనరేంద్రు నాశీర్వచనపూర్వకంబుగా
గాఢాలింగనం బొనర్చి రఘునందనులుం దానును శతానందో
పదిష్టమార్గంబునం జిరత్నరత్ననూత్నస్తంభసంభృతరత్నపాం
చాలికాకాయమానప్రతిఫలితసవిధవివిధోపచారసంచారిపరిచా
రికాచంద్రవదనం బగు సభాసదనంబున కేతెంచి సముచితఖ
చితమణినికరవికచరుచినిచయచకచకాయమానంబగు జాంబూ
నదపీఠంబునం గూర్చుండి యర్ఘ్యపాద్యాదుల నభ్యర్చితుండై ని
జశాసనంబున సముచితాసనంబుల నందఱు నాసీనులై యుండ
నన్నరపతిం గుశలం బడుగ నప్పుడమితేఁ డిట్లనియె. 268

ఉ॥ ఓకుశికాన్వవాయకలశోదధిపూర్ణసుధామయూఖ మీ
రాక విపన్మహోగ్రజలరాశినిమగ్నజనావనక్రియా
నాక మదీయనందనికి నాథునిఁ గూర్చి యిదంమహీమహో
శ్రీకి నుపప్లవోపహతిఁ జేసి యికం గుశలం బొసంగరే. 269

వ॥ అని మఱియును. 270

మ॥ అనలుం డీయెడలం బ్రదక్షిణసముద్యజ్జ్వాలుఁడై మాగృహం
బున హవ్యంబు భుజించుచుండెను భవద్బ్రోద్దామతేజం బుద
గ్రనిరూఢిం బ్రసరింపనాంగిరసుఁ డారాశైథిలీలీల దా
ల్చును దా శాంతికపౌష్టికంబుల స్రువంబుల్ నిష్కృపం దృష్టుఁడై.

వ॥ అనిపలికిన. 272

సీ॥ తైత్తిరీయయజుర్వేశాన మేయతిభర్త
మూర్తీభవింప మోమునవెడల్చె
సౌరభేయీసహస్రముఁగాంచి యేమాని
మొనసినపెక్కండ్ర మునులఁగెల్చె
కమలాప్తసన్నిధానమున నేజటివాలి
శుక్లయజుర్మహాశ్రుతిఁ బఠించె
నిఖిలోపకారమై నెగడ నేజడదారి
ప్రతిభచే ధర్మశాస్త్రము రచించె

గీ॥ నమ్మహాయోగి యాజ్ఞవల్క్యాహ్వయుండు
దేశికుండట భవదీయ దేశమునకు
మదిఁ దలంపంగ సంతతాభ్యుదయలక్ష్మి
పొదలుటయెకాక యాపద లొదవు టెట్లు. 273

వ॥ అదియునుంగాక. 274

క॥ గౌతమసుతుఁడు పురోహితుఁ
డీతండట దండధారి యీవట బ్రహ్మ
జ్ఞాతవు భూవర యాపద
లేతీరున నొదవు నిమ్మహీఁగుండలికిన్. 275

చ॥ అని మునిరాజపాళి దరహాసవిభాసిముఖారవిందుఁడై
జనకునిఁ జూచి యోనృపతి చంద్రమ నీదుప్రతిజ్ఞ వమ్ముసే
యని జగ దేకమల్లుఁ డగునల్లునిఁ గావక తల్లడిల్లినీ
మనమునఁ జింతఁ దీర్చు టది మాపని నీకు విచారమేటికిన్. 276

మ॥ హారతుల్యుం డగుయాజ్ఞవల్క్యు కృప వేదాంతార్థముల్ గాంచి ని
ర్భరవిజ్ఞానకళానియాఢిఁ బరమబ్రహ్మానుసంధానబం
ధురకౌతూహలభవ్యదుగ్ధమయపాథోరాశి నోలాడు నీ
కరయం దాదృశఖేదమోదములు లోకాచారముల్ భూవరా. 277

వ॥ అనునయ్యవసరంబున లక్ష్మణుండు జనాంతికంబుగా రామభద్రు
నుద్దేశించి యస్మద్దేశికుం డగుకౌశికుం డేమహామహుచరిత్రంబతు
లితాపరిమేయవిచిత్రపాత్రంబని యనవరతంబు వక్కాణించు
చుండు నమ్మహాబాహుండగు వైదేహుం డీతండకదా యనిన నతం
డును బ్రమోదానురాగభరితుండై వత్స ! వాజసనేయబ్రాహ్మ
ణంబున కధికారియగు మహాపురుషుం డితండ సమ్మతాంతేవాసియ
గు నిమ్మహాత్మునకు యాజ్ఞవల్క్యుండు శుక్లయజుర్వేదంబు
నుపదేశించె ననియె నప్పుడవ్విశ్వామిత్రుండు క్షణమాత్రంబు వి
మర్శించి యతని కిట్లనియె. 278

చ॥ యతికులశైత్రలీలుఁ డగునాత్మగురుం దగయాజ్ఞ వల్క్యునిన్
శతదశగోధనం బొసఁగి సమ్మతుఁ జేసినవాని నాయహా
ర్పతికిఁ బ్రశిష్యుఁడై నజనపాలకులాగ్రణి నాతిథేయు న
ప్రతిముని నివ్విదేహుఁ గనుభాగ్యము చేకుర మాకునియ్యెదన్ . 279

ఉ॥ నావుఁడు మానిఁజూచి వరనాయకుఁ డిట్లను నైగమార్థమే
ధావిభవంబు నవ్వరమతత్త్వవిబోధము మీయధీన మ
య్యా విను యాజ్ఞవల్క్యునికటాధ్యయనం బనుమాట యొక్కటే
కేవలమున్ మదీయ యగు కీర్తిపతాక యగున్ జగంబునన్. 280

గీ॥ యాజ్ఞవల్క్యజనకు లగు మీస్వరూపంబు
దెలియ మునులకైన నలవియగునె
తగుప్రవాహనిత్యులగుట మ్మధికరించి
వేయుశాఖ లమరు వేదములకు. 281

క॥ అనఁ గౌశికుఁ గని గౌతమ
తనయుం డిట్లనియె నిట్టిధన్యులె కారా
ఘనభువనత్రయమహనీ
యనవప్రతిభాఢ్యులైనయార్యులు జగతిన్. 282

చ॥ అన జననాథవర్యాళి వినయమ్మున నమ్మునిఁ జూచి పల్కెనో
యనఘ యఘాపహంబులు మహాగమతుల్యము లైనయట్టి నీ
వితతవచోవిశేషములు వేడ్కమెయిన్ వినఁగోరు నామనం
బనయము నొంచుచున్నవి సుదర్థములై తగు నర్థవాదముల్. 283

గీ॥ కానఁ జాలింపవలయు నోమౌనిచంద్ర
యనుచు నంజలి నిజశిరంబున ఘటింప
మానవేంద్రలలామ నీమాట వింటి
ననుచు దోయిలివిడిపించి యతనిఁ గాంచి. 284

క॥ "శంకరచాపారోపవి
శంకటచాతుర్యధుర్యజామాతృని రా
టంకాయమానమానిత
*నంశలోప్రభవ" యటంచు జటి దీవించెన్.* 285

గీ॥ అట్టు లాశీర్వదించుసంయమివరేణ్యుఁ
డలర బ్రార్థింతు మహాత్మ భవద
నుగ్రహంబున నేను ధన్యుండ నైతి
నని సుధాబిందు బృందముల్ చిలుక ననియె. 286

చ॥ అనునెడ లక్ష్మణుం డను రహస్యముగా రఘురాముతోడ ని
మ్మునిసమవాయ మోహంబొరులు మోదముతో నిజఘోరఘోన్నతుల్
వినుతి యొనర్చుచున్న యదివింటివె నా ననుజన్ముతోడ న
య్యనఘుఁడు వల్కెనీవనినయర్థము నిక్కముసుమ్ము దెల్లనన్. 287

గీ॥ వీర లిందఱు లోకోపకారమునకు
శ్రుతులుస్మృతులుంత్రు వీరిసన్నుతులొనర్చి
ఖ్యాతిఁగందుము వీరలయధికమహిమ
వీరలెఱుంగుదురు మనకెరుఁగఁ దరమె. 288

వ॥ అనియెనప్పుడుసీరధ్వజమహీదారుం డగ్గాధికుమారునకిట్లనియె. 289

శా॥ సామామ్నాయసమస్యఋక్పటలికానంవాద ముద్యద్యజు
స్తోమాకాంక్షితసీవి నాఁదవరి యొచ్చో సజ్జనాభీష్టముల్
నేమంబొప్ప ఘటించు తావకమహాశీర్వాద మోసంయమి
స్వామీ మామకపుత్రికిన్ వరుఁ బురోవర్తింబలెందెల్పెడిన్. 290

క॥ నావుఁడు నవదరహాస
శ్రీ వదనాదర్శమునకుఁ జికిలి ఘటింపన్
భూవల్లభునకు నిట్లను
భావాచంయమవరేణ్యుఁ డతులితఫణితిన్. 291

శా॥ ఉర్వీనాథకులావతంస విను మోహో ఱైహికాముష్మికా
ఖర్వశ్రీకరముల్ ద్రయీతులితముల్ కర్ణద్వయీగోచరా
పూర్వజ్యోతు లఘాపహంబులు జగత్పూతంబు లుర్వీసురా
శీర్వాదంబులు రిత్తవోవున ఫలశ్రీగూర్చుగా కెయ్యెడన్. 292

సీ॥ అని యిట్లు రాజుతో నాడువిశ్వామిత్రు
తలపువీక్షించి గౌతమసుతుండు
భళిర యిమ్ముని రామభద్రు నల్లునిగాఁగఁ
బల్కెడు సాకూతభాషణముల
పలుమాఱు భూపాలుఁ బరిమోహితుం జేయు
చున్నవాఁ డితనియుద్యోగమునకు
ననుకూలముగ నొక్కయర్థంబు నేనెఱుం
గినియట్ల యడిగెద ననితలంచి

గీ॥ గాధినందన కలశాబ్ధికన్యకాధి
పతికి శ్రీవత్సమును గౌస్తుభంబుఁబోలె
వఱలు నీరాకుమారు లెవ్వారివారు
తెలుపవేయన నమ్మౌనితిలకుఁడలరి. 293

గీ॥ భళిర మామకకాంక్షితప్రకటనంబు
కొఱకుఁ దనుదాన యీతండు తెరువుఁ జేసె
ననుచు మదినుబ్బి యతనిగన్గొని మహాత్మ
వీరు కాకుత్స్థరాజకుమారులనిన. 294

క॥ ఇంచుకవడి వత్తఁడు విచా
రించి మదిం దెలిసికొన్న రీతిఁ బ్రమోద
ప్రాంచన్ముఖుఁడై సంయమి
పంచాస్యునిఁ జూచి చతురభణితింబలికెన్. 295

సీ॥ ఏరాజుకీర్తి లోకైకజాంఘిక యయు
చ్ఛలమున విహరించు సంతతంబు
నేధరాధిపుఁ డశ్వమేధదక్షిణఁ జేసెఁ
జతురబ్ధిపరివృతక్ష్మాతలంబు
నేగహ్వరీనాథుయాగంబునకు నశే
షామృతాంధోవర్గ మతిథికోటి
యేనృపుపుత్రకామేష్టికి నిందిరా
పతితాన ఫలదుండు ఫలము నయ్యె

గీ॥ నట్టిదశరథభూపాలునాత్మభవులు
రామలక్ష్మణులనువారె యీమహాత్ము
లేతదీయపరాక్రమఖ్యాతి యనఘ
విందు మనిశంబు వీనులవిందుగాఁగ. 296

చ॥ సురుచిరతాటకామథనశోభనవాంఛ మహాస్త్రశస్త్రముల్
నిరుపమలీల మీరొసఁగ నేర్చి సమున్నతిఁ బేర్చి తావకా
ధ్వరపరిరక్షణంబు గురుదక్షిణఁ జేయరె దిక్తటీవిక
స్వరతరనూత్నకీర్తి హరిచందనను మీరఘురాజనందనుల్. 297

గీ॥ వీరు జగదేకవీరులు వీరిలోన
రాముఁడెవ్వఁడు లక్ష్మణనాముఁడెవ్వఁ
డానతిమ్మన నిట్లను ననుపమోక్తి
మాధురీసాధురీతి నగ్గాధిసూతి. 298

మ॥ ప్రకటశ్రీవిలసిల్లు ధామనిధిగోత్రక్షత్రసంతానవ
ల్లికకున్ వాడనిపూవుబంతులక్రియన్ లీలం జనించెం గుమా
రకవర్గంబు తదగ్రజుండితఁడు జాగ్రత్తాటకాకాళరా
త్రికిఁ బ్రత్యూషము రామచంద్రుఁడు గుణస్థేమాభిసాంద్రుం డనన్.
కం॥ విని లక్ష్మణుఁడో యితఁడని
మనమున నమ్ముని వసిష్ఠమహనీయతపో
ఘనతరమహిమను మహి మను
మనువంశము మిగుల సంభ్రమంబునఁ బొదలెన్. 300

వ॥ అనునంత నమ్మిథిలావల్లభుండమ్మునితల్లజంబులసల్లాపంబు లా
కర్ణించి సవినయంబుగా విశ్వామిత్రుంగనుంగొని మహాత్మా యీ
దృశప్రజాసమాజంబుతో నీయోజం గ్రీడించుచీవు సాక్షాల్లక్ష్మ
కళత్రుండవుగాక మునిమాత్రుండవే యని జగత్పవిత్రంబగు త
చ్చరిత్రంబుగ్గడించి యిట్లనియె. 301

మ॥ పురుహూతోగ్ర కఠోరహుంకృతి పరాభూత త్రిశంకుత్రపా
భర సంపాదితప్రజ్వలచ్చటులకోపజ్వాలి ముల్లోకముల్
వరుసన్ వేల్చు నినుం గనుంగొని జరావైక్లబ్యశీర్ణాక్షర
స్వరచాటూక్తుల నంతరాయమల భాషాభర్తగావింపఁడే. 302

వ॥ కావున నీయట్టి మహానుభావునకు యాగంబునకు నన్యసహాయం బపేక్షణీయంబగునే యన శతానందుం డన్నరేంద్రుం గటాక్షించి నీవాక్యంబు నిక్కంబైనను దపోధనయూథంబునకుఁ గ్రోధంబు దీక్షావిరోధంబుగాన మఖరక్షణంబునకు శూరుండగు క్షత్రికుమారుఁ గోరుట యుచితంబనిన నమ్మాటలకు సమ్మతించి రామలక్ష్మణుల తెఱంగుఁ గనుంగొని యభంగురప్రమోదతరంగితాంతరంగుండై మంతనంబున గౌతమతనూజున కారాజిట్లనియె. 303

ఉ॥ కౌశికమౌని రాకయు జగన్నుతబోధవిభూతిమించు మ
ద్దేశికు సన్నిధానము సతిప్రమదోన్నతిఁ జేయు బ్రహ్మవి
ద్యాశిథిలానుభూతియును నాత్మకొసంగ విడంవసుంధరా
ధీశకుమారకద్వయనిరీక్షణసౌఖ్యశతాంశ మేనియుం. 304

క॥ అనవిని యతఁడిట్లను నో
జనవర యేతత్కుమారసాక్షాత్కృతిచేఁ
గనుపట్టెద రిదె నాకుఁ
మనమున సీతోర్మిళా కుమారీమణులుం. 305

వ॥ అనిన నన్నరేంద్రుండు శతానందువాక్యంబులకుఁ గృతానందుండై గాధినందనునకు రఘునందనులం జూపి యిట్లనియె. 306

ఉ॥ ప్రాయము లేత భావభవపంకజవైరులమీఱి కేరు ని
కాయము మార్దవైకజనకంబు చరిత్ర ముదగ్ర విక్రమా
మేయము వీరిఁగన్గొని సమీహితలాభముగాంచినట్లు గా
ధేయమునీంద్ర యేలొకొ మదీయమనంబు ముదంబునొందెడుం. 307

క॥ నావుడుఁ జటులనగవొలయఁగ
నావాచంయమివరేణ్యుఁ డనఘాగ్ర్యుఁ బ్రహ్మో
దావాప్తికి హేతువు నీ
భావంబని యడుగు మన నృపాలకుఁ డాత్మన్. 308

వ॥ కొండొక విచారించి యమ్మునియభిప్రాయం బెఱింగి సఖేదస్మితం
బుగా నిట్లనియె. 309

సీ॥ గోత్రైకకర్త యేగోత్రాకశత్రుఁ
కమితతేజోధాని యినుఁడు వైరి
కులగురుం డేనరేంద్రుల కనూనబ్రహ్మ
నిష్ఠావధాని వసిష్ఠమౌని
యాజన్మశుద్ధ మేరాజన్యుల కఖండ
జగదండపరిపూర్తి చారుకీర్తి
కేళిమందిర మేనృపాలకశ్రేణికి
సౌమనస్యఘనంబు మీమనంబు

గీ॥ వారు సంబంధయోగ్యులో వరమునీంద్ర
మైనఁగానిమ్ము తద్బాంధవాంతరాయ
హేతు వేతన్మహాశుల్కసేతు వనిన
పార్థివునిఁజూచి నగుచు నప్పారికాంక్షి. 310

క॥ శ్రీరామునకు నశేషగు
ణారామునకుం దనూజ నర్పించుట కి

స్మేరుశరాసనచాపన
మారోపణ మంత్రాయమగును నరేంద్రా. 311

క॥ ఇదియెంత యీవిచారము
మదినుంచకు మన మునీంద్రుమాటలకర్థం
బిది యది యనుచుం దెలియక
యెద నందియ మొదవ నప్పు డేకాంతమునన్. 312

ఉ॥ గౌతమసూతికి న్నృపశిఖామణి యిట్లను వింటివే ధరి
త్రీతనయావివాహసముదీరితఘోరతరార్ఘ్యవైభవం
బీతఁ డెఱింగియుం బలికెనీగతి నిందుల కర్థనిర్ణయం
బీతతిఁ గానలేక యిదె యెంతయు నుల్లముతల్లడిల్లెడున్. 313

ఉ॥ ఓయనఘాత్మ నిర్భరతరోగ్రతపోమహనీయశక్తి గా
ధేయుఁ డుదారమారహరదివ్యశరాసనరాజముం దృణ
ప్రాయముఁ జేసి లీలమెయి బాలకుఁ డెక్కిడునట్లుచేయునో
యీయెడ మత్ప్రతిజ్ఞ యెడయించునో నావిని మౌనియిట్లనున్. 314

ఉ॥ ఎక్కడిమాట లోవసుమతీశ్వర యీశ్వరదివ్యచాపముం
డక్కడుపాటవంబు భువనప్రథితంబగునీప్రతిజ్ఞయుం
జిక్కదు నిక్క మింకొకటిసెప్పెద నప్రతిమప్రభావుఁడై
దిక్కులనిండు రామవిభుతేజ మలౌకిక మివ్వసుంధరన్. 315

క॥ అనవిని జనకుఁడు కౌశికు
గనుఁగొని యోపారికాంక్షి కంఠీరవ మీ

యనుపమగంభీరోక్తుల
కనయము నూహించి కాన మర్ధంబనుడున్. 316

గీ॥ మాని నవ్వుచు జనకభూజానిఁ జూచి
యనఘ యటులేనిఁ జూపుఁ డాహవ్యవాహ
లోచనోద్భటచాప మీరాచపట్టి
కితఁడ తద్వ్యాఖ్యసేయు వేయేలయనియె. 317

వ॥ అనినవిని డెండంబున నానందంబుకందళింప రఘునందనుం డా
త్మగతంబున. 318

సీ॥ సమకూరు టెన్నఁడో జానకీజితకుంభ
కుచకుంభపరిరంభగుంభనంబు
చేకూడు టెన్నఁడో సీతావధూసుధా
మధురాధరాస్వాదమంగళంబు
సిద్ధించు టెన్నఁడో క్షితినందినీకటీ
తటపటీకర్షణోదారకేళి
యొనకూడు టెన్నఁడో యుర్వీసుతాకృతా
మితరతాంతనితాంతచతురిమంబు

గీ॥ అని యళీకమనోరథ వ్యాప్తి నలరు
నాయభీష్టంబు పూరింప నీయతీంద్రుఁ
డడిగెఁ జండీశకోదండ మని చెలంగి
జనకుచందంబుగాంచి యయ్యినకులుండు. 319

శా॥ పాపం బెక్కడ దేవదానవదురాపంబైన యీతన్మహా
చాపం బెక్కడ నంచు నెమ్మది నుపేక్షాబుద్ధిగావించుకో
భూపాలుం డటుగాక గాధిసుతుఁ డాప్తుండంచు నిచ్చో దురా
క్షేపంబుల్ వలుకంగఁబోక యిప్డు డంగీకారముం జేయునో. 320

వ॥ అని వితర్కించునప్పు డప్పుడమిఱేఁడు వేఁడినిట్టూర్పునిగుడించి కౌశికుం గాంచి మహాత్మా మహీకన్య ననన్యసామాన్యచరిత్రుం డగు రఘుపుత్రునకు కర్పించి భవదనుగ్రహంబుగాంచి వర్తించు భాగ్యంబెక్కడ నేనెక్కడ నని ముక్కంటివింటినిక్కం జూపి యిట్లనియె. 321

మ॥ నగవిధ్వంసనువిల్ జగత్త్రితయసంత్రాణవ్రతోద్యాపనం
బగుటల్ రోహితమయ్యె నేన్నృపులచాపాపోఢి, నమ్మేటిరా
మగ లూహింతురు దీనిఁ గన్గొని మదిన్ మార్ద్వీకణశ్యామికా
మృగనాభిస్ఫుటగంధగంధిలభుజశ్రేణుల్ నిరర్ధంబుగన్. 322

వ॥ అనిన నమ్ముని జనకమహీజానిం గనుంగొని నీవనన్యసామాన్యపుణ్యరాశి విట్లెల్లయధన్యంమన్యుండ వయ్యెఁదవని వెండియు. 323

ఉ॥ ఓరజనీకరాన్వయనృపోత్తమ తాదృశభాగ్యలక్ష్మి చే
కూరెను నీకు మాకు నొడఁగూడెనుఁ గన్గొనఁ దన్మహోత్సవం
బాగసిచూడ విశ్వభువనాధయదానచణుల్ నృపాగ్రణుల్
ధారుణి నెందఱున్న గుణధాముని రామునిఁ బోలనేర్తురే. 324

వ॥ అనిన నన్నరేంద్రుం డాజటాధరేంద్రుం గనుఁగొని మహాత్మా! మణిమంత్రౌషధాదిప్రభావంబునుంబోలె రఘుకులడింభా

సుభావం బద్ధుతావహంబగు నైన నవన్యదు రాసదంబగుగిరిశ శ
రాసనంబు తెలం గళింగింతునని వెండియు నిట్లనిరి. 325

సీ॥ ఏకార్ముకంబున కిందుకోటీరుండు
దక్షాధ్వరధ్వంసి ధన్వియయ్యె
నేశరాసనమున కింకారమణుండు
కుంభినీధరుఁ డంపకోలయయ్యె
నేధనుర్లతకు నంభోధరాధ్వచరంబు
రక్షఃపురాఘుంబు లక్ష్యమయ్యె
నేచాపమున కబ్జలోచనోన్నతశయ్య
దర్వీకరస్వామి మౌర్వియయ్యె

గీ॥ నట్టిమహనీయకోదండ మఖిలవిబుధ
నికరతేజఃప్రచండ ముద్విగ్నభువన
జయసముద్దండ మద్భుతోచ్ఛ్రాయకరండ
మహహ శక్యంబె తన్మహామహిమఁ బొగడ. 326

గీ॥ అన శతానందుఁడిట్లను నధిప యింకఁ
జాలుచాలు పినాకప్రశస్తికథలు
కౌశికునిమాట నిక్కంబుగాఁ దలంపు
మనఘుఁ డీరామునకు నసాధ్యంబుగలదె. 327

ఉ॥ కోటినిశాటపాటనమునకుఁ విహితోద్యముఁడై తపోవనీ
వాటమునం బ్రతాపవహ్నితవాహనమింధనసామిఫేనిగాఁ

దాటకఁ జేసినట్టి సముదగ్రపరాక్రమశాలికిన్ని రా
ఘూటమగుం జయంబు దశకంఠముఖుల్ గలహించిరేనియున్. 328

సీ॥ అనివల్కుచున్నచో నవ్వేళ నొక్క
దౌవారికుం డొక్కింత చేరఁబోయి
దేవ! ఓజనకధాత్రీనాథ! యలపంక్తి
గళపురోహితుఁడు శౌష్కలుఁడు మిమ్ముఁ
బొడఁగనవచ్చి యిప్పుడు వాకారంబున
నున్నవాఁ డన నతఁ డూరకున్న
నేతెంచుఁగాక రానిమ్మని గౌతమా
త్మజుఁడు పల్కిన వాఁడు మగుడిచనియె

గీ॥ నంతసల్లన శ్రీరాముఁ డనుజుఁ జూచి
యసమమహాప్రతీపచాపాధిరోప
ణోత్సవంబున కెడఁజేసె నోకుమార
యకట విధిపోక నిపు డిద్దురాత్మురాక. 329

తరల॥ అనిన లేనగ వానసంబున నంకురింపగ లక్ష్మణుం
డనఘ యీతనిరాకచే నెడయైన దీశధనుర్వ్యలో
కనమహోత్సవమాత్రమే యనఁ గౌసలేయుఁడు తమ్మునిం
బ్రణయకోపదరస్మితాంచదపాంగదృష్టిఁ గనుంగొనెన్. 330

వ॥ తదనంతరంబ శౌష్కలుండు దౌవారికుండనుప ననుపమచి
రత్నరత్ననికరదంతురాంతరంబులగు కొన్నికక్ష్యాంతరంబు లతి
క్రమించి చనిచని తత్పురోభాగంబునఁ బద్మరాగప్రభావిభాసమా

నదళదిశావాటంబగు కొలువుకూటంబుఁ గనుంగొని యచ్చట నున్న వారి వేర్వేరంబరికించి కటకటా! మాదృశజనవిశ్వామిత్రుండగు విశ్వామిత్రుండు జనకశతానందులతోడంగూడి యీ యెడన యున్న వాఁ డుండుగాక యివ్వరాకునివలన మాకున య్యెడునది యెయ్యది యని మదిందలంచి యక్కాలంకుల నక లంక తేజులగు రఘుతనూజులంగాంచి మనోజ్ఞాకారులగు నీక్షత్రియ బ్రహ్మచారు లెవ్వరొకో యని వెంకియు నతండద్దారకుల దేరకొనంజూచుచు. 331

క॥ మాంజిసండప్రముఖ
వ్యంజనముల శాంతరసము వరహుత్యశ్రీ
రంజితులగు వీరలయెడ
నంజక వీరోపకరణమైకనుపట్టెఁగా. 332

క॥ నిగమత్రయంబుచెంగట
దగువిశిమంత్రాహుతులవధస్వమునా ని
మ్నగురికదర్ల సహజోన్నత
మగు నివ్వేయువుయగము నిగులనంసంబయ్యెఁగా. 333

వ॥ అని కొంచొకవిచారించి. 334

గీ॥ అవరజద్వితీయుఁడగు రామహాతకుంను
వీఁను గాధిసుతునివెంట నిచటి
కరుగుదేరఁజోలు నని యంతఁదాటక
పాటుఁ దలఁచి మనముపరితపింప. 335

గీ॥ హా సుకేతుపుత్రి యక్కజంబగు నీదు
లావుఁ బెంపు దక్కె దైవవశత
నొక్కనరునివలన నుక్కడఁగితివెట్లు
తగరుదాకఁ గొండపగిలినట్లు. 336

గీ॥ బహుగుణఁదపసి కొన్ని వెడమొల్కులొసఁగినఁ
గొప్పదప్పి బ్రహ్మకొడుకఁబోలె
నకట వీఁడు చూడు మనరణ్యకులుఁడయ్యు
నొల్లెఱుంగ కింతఁద్రుళ్లిపడియె. 337

క॥ సుందాసురసుతశోణిత
తుందిలశరధుర్యుఁడగుచు ద్రోహామితఁ దొన
ర్చెం గౌశికంతకుటుంబము
సం దీక్షాశిక్షమఖక్రియాబాంధవుఁడై. 338

క॥ అగుఁగాక వీనిబాహా
యుగయుగళోదగ్రబలమహోద్ధతిఁ జూడం
దగు ననుకొని సీరధ్వజ
జగతీపతి కొలువుఁ జేరి సవినయఫణితిన్. 339

వ॥ అవ్వసుంధరాధీశుఁ గుశలంబడిగి తన్ని దేశంబున సవిధదేశంబునం గూరుచున్న సురాహితపురోహితుంగనుంగొని యమ్మహీవరుండు మహాత్మా యీయాయనీచరగ్రామణికి నేమంబకదా యని వెండియు నిట్లనియె. 340

క॥ ఆపద లెడలింప నథ
ర్వోపాయవిదుల్ మహామహులు మీరుండఁగ
మీ పంక్తిముఖునిశుభములు
ప్రాపించుటయడుగనేల యదిసందియమే. 841

క॥ నావుఁడు నగి యతఁ డవ్వసు
ధావరునకుననియె నాపదలుగీవదలుఁగ
రావణునకుఁగలిగినఁగద
భూవర మావేదమంత్రములు గింత్రములుఁగ. 842

సీ॥ సవరించె నెవ్వాఁడు జయలక్ష్మిఁ బటుభుజా
ప్రగ్రీవసుభగసౌధాగ్రసీమ
నొనరించె నెవ్వాఁడు పెనుద్రోవ ఫణిలోక
జయకాంతి గోచరశైలమెత్తి
కనుపట్టఁ డెవ్వాఁడు కదనరంగంబున
బలభేదివెన్ను కన్నులకుఁదక్క
సమకూర్చె నెవ్వాఁడు చటులకాత్తేయక
తుతిముఖంబులకు లేజవ్వనంబు

గీ॥ నొసఁగె నెవ్వాఁడు కీర్తికింపెసఁగుతావి
యతనువారసఖపుష్పకావాహణకేళి
నట్టిదశకంఠునకుఁ ద్రిలోకాధి రాజ్య
పట్టభద్రున కాపదలే వుట్టునెట్లు. 843

క॥ అని దశకంధరుమహిమల్
జనకునితో నుగ్గడించుకొమ్మలుమాటల్
విని నగుచు సుమిత్రానం
దనుఁ డగ్రజుఁ జూచి మంతనంబునఁ బలికెన్. 344

సీ॥ కోడిగంబులు సేసి కోనంగియాటకు
దిద్దరే, తెలిదీవి ముద్దరాండ్రు
మోంకు వాలము సుట్టి మున్నీటి పెన్నీట
నీతనేర్పఁడె నిర్జరేంద్రసూతి
తనబందిగమునకు మనుఁగాపు సేయఁడే
విక్రమోన్నతిఁ గార్తవీర్యనృపతి
కక్షకసి, కొంకకుప్పిగంతు వేయించరే
చేరి దైత్యేంద్రదాసీజనములు

గీ॥ ఇంద్రచెవిఁ యిట్లనుటెయుఁ బెక్కండ్రచేత
భంగపడినట్టి రావణుబంటుతనము
లుగ్గడింపుచునున్నాఁడు సిగ్గులేక
కటకటా వీని యీ వైదికప్రధాని. 345

క॥ నావుఁడు రఘుపతి వినయ వ
తాన్వ వలదిట్లాడ వాలి హైహయపంక్తి
గ్రీవు లుదారులు వారల
లో వారికి హెచ్చుగుండుఁ గను తేవెన్నన్ 346

ఉ॥ వాలికిఁ గార్తవీర్యనృపవర్యునకున్ రణభూమి నొక్కచోఁ
దూలినమాత్ర పంక్తిముఖు దోర్మహిమంబునకుం గొలంతయే
కేళివిలోలనకంఠతను కీకసమాంసము శేతదంసముల్
కూలి ప్రమోదశాలియగుచుం దుదుచుం గజచర్మశాటికన్. 347

శా॥ ఆ రాత్రించరభర్త శక్రపవిధారాధః క్రియానిర్భర
స్వారాజ్యానుభవం బెసంగ వివిధాస్థానీసమాటీకవ
స్వైరక్రీడలడంచి చంచలరమాశాతోదరి న్నిల్పె దు
ర్వారస్ఫూర్తిఁ గళిర్పఁగా నిజభుజప్రాసాదమధ్యంబునన్. 348

కం॥ అని రాముఁడనియె నంతట
జనకుఁడు కౌశికులనిజూచి సత్యంబగు నో
యనఘాత్మ! యెంతపొగడినఁ
జనుఁజను దశకంఠునందు సామాన్యండే 349

వ॥ అనినవిని కౌశికులుం డిట్లనియె. 350

చ॥ ఉడుపతిమౌళి మెచ్చ విహితోదితమస్తకుఁడై వహాప్తికిం
గడంగెను నేమహాత్ముని ముఖంబులు దైన్యపరాఙ్ముఖంబులై
యడుగుమటన్న నీనడుగుమంచు వెతం బొరి చూపులాడుచుం
గడుఁగడించు నట్టిసశకంధరునిం గొనియాడశక్యమే. 351

సీ॥ అభిమానశాలినా నాపులస్త్యాయన
మౌళి నన్న ధరాకుమారినడుగ
భూనాథ గౌతమవరాని పౌరోహిత్య
మహిమచే మను నీదుమందిరమున

కనిచినాఁడవ, గాధితనయుఁ డమ్మాటలు
గీటునఁబుచ్చుచు క్షితితలేశ
పరికించితే రాము వారశరాననదిదృ
క్షామోదసత్వరస్వాంతు ననిన. 353

గీ॥ జనకుఁడిట్లను దేవ మీమననువచ్చి
నట్లానర్పక తగునయ్య యిట్లుపలుక
రఘుకులీనులు నిమివంశరాజవరులు
భవదధీనులకారె తాపసవరేణ్య. 354

గీ॥ అనిన కౌశికుఁడనియె నోజనకరాజ
రాజసంబునఁ బ్రత్యుత్తరంబునీవు
కటకటా మామకోక్తి యాకాశవచన
మనియొ మఱి దుష్పరిచ్ఛేదమనియొ చెపుమ 355

ఉ॥ ఈవలయుం గుమారి నిపుడెవ్వరికేనియు నిట్టిచోఁ ద్రిలో
కీవిజయైకతానుఁ డడిగెం దశకంధరుఁ డందుకీయకో
కీవిధి నారకుండఁదగవే తగవేది భవచ్చరిత్ర ధా
త్రీవర సాత్వికంబని మరీచిముఖుల్ వొగడన్ వినంబడున్. 356

గీ॥ అనిన నవ్వి గౌతమాత్మజుండను నోయి
విప్ర నీకుఁ బెద్దవిన్నపంబు
కాని జనకభూమిజాని ప్రత్యుత్తరం
బిచ్చినాఁడు నీవువచ్చినపుడ. 357

క॥ అనుడు విప్రుఁడు రాజకన్యాసమర్ప
ణంబు దక్కఁగఁ బ్రత్యుత్తరంబు మాట
నిక్కమేనియు నదియెద్ది యొక్కమాటు
విందమని పల్క నాశతానందుఁడనియె. 358

క॥ శూలాయుధ కోదండము
హేలాగతి నెక్కువెట్టి యెవ్వఁడు వేడ్కం
దేలించు మమ్ము నతనికి
బాలామణి సీత పూర్ణపాత్రంబనఘా. 359

గీ॥ అనిన శౌష్కలుఁ డమ్మాట కదరిపడుచు
మాటికి నమశ్శివాయ నమశ్శివాయ
యనుచు వీనులు వెసమూసికొనుచుఁ బలికె
నీతిమెఱయంగ గౌతమసూతితోడ. 360

చ॥ ఇటుపలుకంగ నీకుఁజనునే మునిచంద్ర యభంగురాంగుళీ
పటలనిఘృష్ట యతుగిరిబాంధవసానుపదోక్తి విక్రమో
స్ఫుట భుజదండమండితుఁడు పంక్తిముఖుం డొనరింపఁ బూనునే
కటకట వీరశాంభవ శిఖామణి యిట్టి యనార్యకృత్యముల్. 361

ఉ॥ నావుఁడు గౌతమాత్మజుఁడు నవ్వుచు నిట్లను సూనృతప్రతి
జ్ఞావిభవుండు క్షత్రకుల సత్తముఁ డీతఁడు పంక్తి కంఠుఁడుగ్ర
శైవుఁడు గాన నెక్కిడఁడు చంద్రకళాధరుచాప మిందు కో
పాలో వివరింపనేటికిఁ దదుత్తర మీవ యెఱుంగఁగాఁదగున్. 362

గీ॥ అనఁడు వచ్చుచు కౌష్కలుండనియె నలువ
కంగిరసుఁడు బులస్త్యుండు నాత్మభవులు
గానఁ బౌలస్త్యునెడ ననూయానువృత్తి
యాంగిరస నీవు దాయాదివాటనొక్కొ. 363

వ॥ అని యధ్వశకుంఠి పురోహితుం డాగ్రహారోహితుండయి వైదేహిం
దంగించి యిట్లనియె. 364

గీ॥ పరమశైవశిఖామణి సంస్తుతుఁడు
జమ్మదూలమ్ము లన్యరాజన్యకోటి
లరుగ వాగోపణము శుల్క మట్లుగాన
నెట్టులున్నదో నీపూజ యింక మహీజ. 365

వ॥ అనిన విని పెంపంబునం గ్రోధశోకంబులు గంపెళింప శతానం
దుండు కౌష్కలుం గనుంగొని త్రిపురనిశాటఘాటతాటంకినీ
కర్ణపూర భారపరిహార క్రియాదితుదళుండగు నీలగళుని శయ
శయాళువగు నీచాపం బారాధ్యరూపంబగుట నిక్కంబు కైకశీతన
యునకు వినయ విశ్వాస భక్తిరసావేశంబు లొదవం బాశుపత
మంత్రోపదేశం బొనర్పంబోలుఁ గాకయున్న నఖర్వగర్వధూర్వహ
స్వభావుండగు మీ దశగ్రీవుండు శైవుండగునే యని కొండొక
నవ్వి వెండియు నిట్లనియె. 366

గీ॥ హరున కాధారభూతమా నమ్మహాద్రి
తొత్తి భుజకౌతుకంబునఁ బెల్లగించి

యతని ధను వెక్కుబెట్టుమటన్న నహహా
శైవుఁడయ్యెనె నేను మీరావణుందు. 367

క॥ అని యాగతిఁ గేరడములు
జనకపురోహితుఁడు పలుక శౌష్కలుఁ డాకరుం
డును దక్కఁగ నొండొరులను
గనుఁగొని నగిరంగఘునను బకాపకయనుచున్. 368

వ॥ అంత. 369

ఉ॥ గౌతమసూతి రాఘవుని గన్గొని యో జగదేకవిక్రమో
ద్ధూతనిశాట యూధనువు ధూర్జటి హస్తవిభూతిభూషిత
జ్యాతత మింక నెక్కిడుము శౌర్యమదాంధులకున్ ధనుర్గుణా
ఘాత భుజాప్రభూతకిణకాళిమ మోములఁ జౌకళింపఁగన్. 370

సీ॥ అన విని శౌష్కలుం డాగ్రహంబునఁ బల్కు
నోరి శతానంద యూరకిట్లు
దేవయోగ్యంబైన జీవరత్నముఁ ద్రోచి
జెగురుఁగైకొన్న చెనఁటికరణి
వెఱివె పౌలస్త్యు విడనాడెదేమిరా
మనుజకీటంబుపై మమతఁజేసి
గౌతమమునిచంద్రుఁ గనుఁబ్రామి వెసవ్రజ
కై యట్టుపడదె నీ కన్నతల్లి

గీ॥ యా యహల్యకుఁ బుట్టినయట్టి నీకుఁ
దలఁప వేఱొకగుణమేల కలుగనేర్చుఁ
"దల్లి బడిపిల్ల" యనుమాట యెల్లజనులు
పలుకుదురకాదె లోకటిపాటగాఁగ. 371

క॥ అన గౌతమసుతుఁ డాగ్రహ
మొనయఁగ "నేమంటి వోరి యేమంటివిరా
తనువెఱుఁగవు నాముందట"
నని లేచిన గాధిసూతి యనునయమొనగన్. 372

గీ॥ వలదు మనయింటి కతిథియై వచ్చినట్టి
శౌష్కలునితోడ నేటికి శుష్కకలహ
మని నివారించి యాత్మలో నలరుచున్న
దాశరథిఁజూచి నగుచు నక్కౌశికుండు. 373

చ॥ అనఘచరిత్ర యోరఘుకులాంబుధిపూర్ణనిశాకశత్ర యీ
జనకపురోహితుండు పురసంహరచాపగృహోపసర్పణం
బనుమతినేసె నీ కనిన నాత్మఁ జెలంగి మహాప్రసాదమం
చనుజుఁడుఁ దాను నేగె వినయంబును సిగ్గును నందడింపఁగన్. 374

వ॥ అంత నాశౌష్కలుండు సీరధ్వజుంగనుంగొని దశగ్రీవప్రభావం
బుగ్గడించుచు నిట్లనియె. 375

క॥ హర పూజార్థము దశకం
ధరుఁ డొకనాఁ డొస్పృహఁ, తనదు శిరంబుల్

వరుసం దొమ్మిది కరభీ
కరశరతరవారిధార ఖండించుటయున్. 376

చ॥ పశుపతి యమ్మహాద్భుతసపర్యకు మెచ్చి మదీయ వరంబుఁదా
దృశ భయదక్రియాసదృశ మెద్దియుఁగానక నానపూనఁ ద
త్ప్రశమనమాచరింపఁ బరిపాటి జగత్త్రయివేడనద్ది య
ద్దశముశిరంబె యర్థియట తావకభాగ్యముఁ జెప్పశక్యమే. 377

గీ॥ అనఘ శతానందుఁ డమ్మాట జనకవిభుని
చెవులఁబడనీక కోదండ భవనవిధ
వివిధ లోకాద్భుతక్రియాన్వితుఁడైన
రాఘవుని జూపి యను ననురాగ మెసఁగ. 378

చ॥ శివునకు నింపు సేసె మును శింజినియై తెగనిండఁదీసినన్
శ్రవణవతంసమై విడిచినం గరకంకణమై ఫణాధర
ప్రవరుఁ డనన్యధన్విసులభంబగు నేవిలుఁజేరి యట్టి భా
ర్గవగురుచాప మెక్కిడియెఁ గంటివె రాము గుణాభిరామునిన్. 379

వ॥ అను నయ్యవసరంబున. 380

సీ॥ బధిరత్వ మొనరించె భాషానితంబినీ
ప్రాణేశు నెనిమిదివీనులకును
కబళీకరించె దాక్షాయణీరమణీమ
నోహరు నెనిమిది దేహములను
నార్భటింపఁగఁ జేసె నందంద బహుగుహా
కోటిచే నెనిమిది కులనగముల

చెవుడు గల్పించె సక్షిద్వయంబునమహా
ద్భుతముగ నెనిమిది భుజగములకుఁ

గీ॥ గిలుకొల్పె నిరంతరాందోళనంబు
మిక్కుటంబుగ నెనిమిది దిక్కులకును
లక్ష్మణాగ్రజ భుజ నిర్గళన్మహోక్షు
వాహ కోదండదండ కోలాహలంబు 381

క॥ పటుతరగతి నిట్లొడవిన
పటపటరవ మొలకించి పార్థివుఁ డయ్యో
నిటలాక్షుని విలు విఱిగెన
కటకటయని వగచె నరుదుఁ గౌతుకమడరన్ 382

మ॥ శ్రీనిదేనప్రకరాననాంబుజములన్ సీతావివాహోత్సవ
శ్రుతిమంత్రావళినై వధూముఖములన్ శోభాన్వయై మింట నా
యతరక్షోహతికై యుపశ్రుతిశతంబై కోఁచెఁ దగ్రామదోః
ప్రతిభాకృష్టత్రుటద్వ్రిషధ్వజ ధనుర్భంభోళి నిర్ధ్వానముల్ 383

వ॥ ఆసమయంబున నాసురభూసురులు విషాదాద్భుతంబులు పెనం
గొన నాత్మగతంబున 384

గీ॥ ఫెల్లుమని శాంబరీభిల్లు విల్లు విఱిచి
సర్వకర్మిణ శౌర్యోద్యమ్మ నుర్వినించె
నౌర యత్యద్భుతముగ నిశ్చేరజంపు
రాచమెఱుగుసు తను జనుల్ జూచిపొగడ. 385

క॥ అని యడలుచుండె నయ్యెడ
జనకమహీధవుఁడు గాధినందనుఁ గన వం
దన మాచరించి వాచా
ఘనచాతురిఁ బలికె నిటలఘటితాంజలియై  386

సీ॥ సీత రఘు రామగుణమణిక్రీతయయ్యె
నన్వయాచారసరణి నే ననఘ యింక
లక్ష్మణునకిత్తు నూర్మిళాలక్ష్మి లాతి
ననిన నరహాసమెసఁగ నమ్మునివరుండు.  387

క॥ భూనాథతిలక నీకు శ
తానందున కెద్ది యుచిత మది సేయుఁ దనకా
మానసపతి నీమం నే
మో నొడివి యహల్యాపట్టి మునిపతికనియెన్.  388

సీ॥ సంయమీశ్వర మహేశ్వరచాప మెక్కిడె
మీ రాఘవుండ నను మేలివార్త
మొగటఁ జెప్పినవాఁడఁగద నాకుఁ బారితో
షిక మెద్దియనినఁ గాశికుఁడు నవ్వి
వత్స శతానంద వాంఛితం బెయ్యది
వినిపింపుమిచ్చెదనన నతండు
మా కుశధ్వజరాజమణి తనూభవలగు
మాండవీశ్రుతికీర్తి మానినులకు

గీ॥ భరత శత్రుఘ్ననాముల భవ్యకీర్తి
కాములను వేఁడెదనటన్న గాధిసూతి
యలరి నిఖిలంబు కర్తవ్య మనఘ యింక
సొంపుమైఁ బంక్తిరథుఁ బిల్వనంపు మనిన. 389

గీ॥ జనకభూపతి కుశికనందనుని జూచి
దేవ యుత్తరకోసలాధిపుని బిలువ
మనక తానందుఁ బంపుదమన నతండు
ప్రమదమున లేచి గాధిసంభవుని జూచి. 390

గీ॥ అనఘ శుభలేఖ వ్రాయింపుఁడన నతండు
వ్రాయసము వారిఁ జూచి మీ రాజు పేర
దశరథాధీశ్వరునకు నుత్తరము వ్రాయుఁ
డన మనంబునఁ గౌతుకంబడర నతఁడు. 391

క॥ కెలిచింతాపు టొజిలోసలి
గిలుకల గంటంబు కేలఁ గీలించి సచో
లలనాపదమణినూపుర
కలనాదమెసంగ వ్రాసి గణగణఁ జదివెన్. 392

సీ॥ శ్రీమన్మహారాజశేఖరులగు జన
కేంద్రు లుత్తరకోసలేంద్రులైన
పంక్తిరథక్షమాపతివారి చాల్మను
ష్యులకుఁబుత్తెంచుఁ బ్రయోజనంబు

జగదేకదేశికుండగు కౌశికుని యాజ్ఞఁ
దమరాఘవునకు సీతా మహిళను
లక్ష్మణునకు నూర్మిళాకుమారిని భర
తునకు మాండవిని శత్రుఘ్ననకును

గీ॥ కుసుమసమమూర్తి శ్రుతకీర్తి నొసఁగినాము
పరిణయమునకు సకుటుంబ బాంధవముగఁ
దాము దయసేయవలె నని దశరథేశ్వ
రులకుఁ జాలుమనుష్యులు దెలుపవలయు. 393

క॥ అనిచదివి లేఖ నొసఁగినఁ
జనియెఁ గౌతముఁడు యతియు జనపతియును ద
న్ననుప మహోన్నతి మెఱయఁగ
ననుసమపల్యంకికానమారూఢుండై. 394

క॥ అంతఁ దపోధనరజనీ
కాంతుఁడు నతవిబుధనికరకమలవనీభా
స్వంతుఁడు తనకృతకృత్యత
కెంతయుహర్షించి యాత్మ నిట్లనితలఁచెన్. 395

శా॥ త్రుంచెన్ రాముఁ డనంగవైరిధనువుం దోర్దండలీలాహతిన్
డించెన్ ధాత్రివిదేహభూపతిసమున్నిద్రప్రతిజ్ఞాభరం
బించెన్ నామది పాణిపీడనవిధాహేవాకలక్ష్మిన్ బ్రకా
శించెన్ మత్సఖమందిరంబులు ఫలించె న్నేఁడు మాదీవనల్. 396

వ॥ అనివితర్కించుసమయంబున సమందమందాతురోమతిరోహి
తుండై పౌలస్త్యపురోహితుండు విదేహదేశాధీశునుద్దేశించి యి
ట్లనియె. 397

చ॥ తెలివిదలిర్ప నీవు తెఱఁతేరకువచ్చినకన్ను నిచ్చి యు
త్పలఘుబలుం బులస్త్యకులు నద్దశకంధరు నాదరింపఁగాఁ
దలపవ పెద్దవయ్యు వసుధావర బుద్ధినిబిన్నవై తిలో
కులకు గుణప్రకర్షమునకుం వయసుల్ తగుకారణంబులే. 398

క॥ అని కౌశికుఁజూచి తపో
ధనవర యిపుడైన దేని తాటకఁజంపిం
చిననేరముఁ దీర్చికొనర
వినుమా నీ కిడియవేళ నేర్పరివైనన్. 399

గీ॥ వెడగుబుద్ధుల నిట్లైననవిడిచిపెట్టి
జనకునకుఁజెప్పి జానకీచంద్రవదన
వసురనాథునకిప్పించి యతనికీవు
చనవరివిగమ్ము త్రిజగముల్ నినుభజింప. 400

క॥ అనినఁ దపస్వి కపజ్ఞా
భినయంబెనయం దస్విబృందారకనా
థునిగనుఁగొని జనకమహీ
జనపతి యిట్లనియెఁ బ్రమదసముదితమతియై. 401

వ॥ మునీంద్రా ధనుర్ధరంమన్య సామాన్యరాజన్యవరార్థప్రార్థ్యమాన
జానకీకథాదోధూయమానంబగు మన్మానసంబు శ్రీరాముని

నెమ్మోమ్ము జాబిల్లినల్లసిల్లు మొల్లంపువెన్నెలవెల్లి వెల్లువం జల్లగాఁ జల్లులాడినంగాని నేసదీరనేరదు. మిహిరకరనిచయపరిచయకృత దుర్నిరూపతాపభరంబగు కైరవోత్కరంబునకుఁ జెలువంపుఁజలువంజిందు కలువవిందు పొందుదక్క వేఱొక్కవెజ్జు ముజ్జగంబులంగలుగునే కావున నమ్మహాత్మునమ్ముఖంబునకుం బోవుదము రమ్మని యమ్మునియుం దానసులేచిచనం జూచి దుష్కరక్లేశావేశంబున శౌష్కలుం డాకసంబునఁ జూపిక్కనిగుడించి హా విదేహన. దిని యమంద సౌందర్యవతియగు నీయట్టియువతికిం గటకటా వికటనిజ భుజాభవన భువనవిజయలక్ష్మీసమారోహ మహోత్సవ ప్రభవద విరళ ధవళరుచిచ్ఛటా జటాలనిటాలవీక్షణ గ్రావుంజగు నద్దశగ్రీవుంజు వేసినం బద్మాల్లభ్యం బలభ్యం బయ్యనే యని పగచి మనంబునిట్లనియె. 402

క॥ సనతుఁగఁ ద్రిభువనలక్ష్మికి
ననఘా రావణున కేఁడు జనకుఁడు నవతం
గ్రీవునీవు పుడమి వెల్వడి
శివిగాసం గాన నీదు తెఁగ నెవ్వారికిఁ. 403

వ॥ అని కిన్నెరయుతర జనకుంగూర్చి యిట్లనియె. 404

మ॥ వినవా యేమి పురాణ విక్రమకథావిఖ్యాతముల్ మాదశా
ననుదంభోళి కఠోరఘోర భుజదండంబుల్ దదీయస్మృతిం
దనగంధంబెడలం గనంబకు మిళిందశ్రేణికిం బాకశా
సనభద్రేభము నైజమాల్యపటలీ సాధారణప్రక్రియన్. 405

ఉ॥ అట్టిభుజావిభూతిఁదగు నారజనీచరచక్రవర్తికిం
బట్టినొసంగి మామవగుభాగ్యముఁ బొందక యాఁగతిన్ వృథా
కట్టడిపాటయొక్కటియ కాని, నరేశ్వర యింకమీఁదఁ దా
నెట్టును సీత దానవకులేశ్వరు హస్తగృహీత యౌఁజుమీ. 406

క॥ అని రాముఁజేరి యోరీ
మనుజార్భక చివికిపనికిమాలిన యీవి
ల్లునిఱిచినని గర్వింపం
బనిలే దిల్లకిఁకనంతేఁ బంపుగ యుగుననే. 407

శా॥ యూరువతీచరాగ్రణి జతామరతా... సేతుణామణీ
చామరవాతపోతవికసద్ఘృణమండల...సారభో
గ్గాముఁ డశేషలోకజయధాముఁ ...గనియించు జానకీ
రాముని బెండ్లియాడకుము రా మనునీతి మదింపలంచినన్. 408

క॥ శిశుఁ బాలుసుట్టి యాకొ
శికసంయమిమాట వీనుచెవిఁబెట్టినచో
నకనకలు నీ కనర్థము
ప్రకటిల్లును వీనికేమి బవనిఁడుసుమ్మీ. 409

క॥ అని నొరులు చంపకుండుదు
రనియుక దా గ్రామ్మణో నహంతవ్యయనన్
విని ముసుమున్నుగ నీచా
పనవాలగ నితఁడుపూనె బారిపుఁడయ్యెన్. 410

వ॥ అనిపల్కి తనమనంబునం గొండొకవిచారించి యయ్యసురమహీ
సురుం డిక్కార్యంబు లంకేశ్వరున కెఱింగిపవలయునని తలంచి య
ప్పురంబు నిర్గమించి లంకానగరంబునకరిగి మతిమంతుండగు మాల్య
వంతుంగాంచి తత్పరస్పరంబుగా నిరంతరసురాపాన ఘూర్ణమాన
పూర్వగీర్వాణ నవ్యాన సంకుల ప్రమాణంబగు దశకంఠు దివాణం
బుసేరి యథోచితంబుగాఁ దద్దర్శనంబుగాంచి తనపోయివచ్చిన
తెఱంగు విన్నవించిన విన్నవై యద్దశముఖుండు శూర్పణఖం
బిలిపించి మిథిలావృత్తాంతంబరసిరమ్మని యంతఃపురంబునకరిగెఁ
నంతమాల్యవంతుఁడు నిజనిశాంతంబున కేతెంచి భానుమంతుం
డస్తమింపఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి కృతాభ్యవహారుండై
విహారమందిరంబున విశ్రమించె. 411

మ॥ అమరేంద్రాహితదుర్నివారతర ఘోరాకార రాకారస
త్క్రమశీతాంశువిభావిలాసరసధారాధార రాధారతా
సమకాండోగ్రవిఖండితాసురపురీసంచార సంచారక
ప్రమథీతాండవతాండవత్రుటితతారావార వారాదరా. 412

క॥ దుర్గాకుచదుర్గానిశ
మార్గదళోదగ్రసర్గ మహితనిసర్గా
స్వర్గాపవర్గమార్గా
సర్గశసంసర్గ మార్గణమ్మునివర్గా. 413

కందగర్భితమణిగణనికరము॥ భవహర శ్రితజనభవహర, రవితా
రవరశిఖినయన రజతధరణిభృ

ద్భువ భువనసుత పరివృత, నవనా
జవనతురగితవిశదవృష సగణా. 414

గద్య॥ ఇది శ్రీమద్రామేశ్వర శాశ్వతకృపాకటాక్షవీక్షణసమాసాదిత
సకలసామ్రాజ్యధౌరేయా శ్రాంతనిశ్శాణనావధీరిత రాధేయ
బిజ్జులకులకలశనిధానకార్త్తికీనిశాకశత్ర వెన్నూనిశగోత్రప
విత్ర కృష్ణరాయమహీధవకుమార సంగరాంగ
ణకుమార దయాగుణగోపాల తిమ్మభూ
పాలప్రణీతంబైన యనర్ఘరాఘ
వంబను మహాకావ్యంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు

అవిఘ్నమస్తు

శ్రీహయగ్రీవాయనమః

# అనర్ఘరాఘవము

## తృతీయాశ్వాసము.



క॥ శ్రీకర నానాభక్తావ
శీకర దృప్యన్మహోగ్రసింధురపలభు
గ్భీకర నిర్జితసూకర
ప్రాకటశ్రీరామలింగ భసితసితాంగా. 1

వ॥ అవధరింపు మవ్విధంబునసుఖనిద్ర సెంది యంతట. 2

సీ॥ నిలయభూరుహకోటి నెలుఁగిచ్చి యూర్ధ్వస్వ
రములాలకించు కాకములరవళి
ప్రేయోవిలోకన శ్రేయోనుమోదంబు
గను కోకయువతుల కలకలంబు
నాప్రభాతము మేఁతలాడి యూలంబశా
ఖలు నేగు గబ్బిలంబుల రవంబు
దరదళత్పంకజోదర నిర్గమోత్సాహ
మెడఁబూను గండుతుమ్మెదల రొదలు

గీ॥ నెనసి వైతాళికోక్తుల నినుమడింప
నులికిపడిలేచి కన్నులుపులుముకొనుచు

నావులించుచు నట్టాలకాగ్రమెక్కి
మాల్యవంతుండు ప్రత్యూషమహిమ కలం. 3

ఉ॥ ప్రీతిఘటించెఁ జక్కులకుఁ బెట్టుగ వల్లదె భానుమన్నవ
జ్యోతి వియోగశోకయుగయోగవిధాననవీనచాతురీ
దూతి విధుప్రభాస్వవన దోహద వైభవశాలిశోలికా
గీతి దినావసానశిఖికీలితదీప్తి కృతానుభూతియై. 4

మ॥ బళిరా వాసకసజ్జికల్ హరిదిశల్ భానుండు దిగ్భర్తతాఁ
గలయం దత్కిరణంబులల్లవె రవిగ్రావాగ్నినాడింధమం
బులు లోలత్క్షణదానివార్యరససంభోగైకనిద్రాగమం
బుల నిక్షేపము నర్చెఁ గోకపటలీఫుల్లోత్పలశ్రేణులన్. 5

గీ॥ అనుచుఁ బురలక్ష్మిఁ జూచి యిట్లనియె నౌర
పౌరసంభోగవైభవప్రచురిమయ్యెఁ
బంక్తికంఠమహోద్దండబాహుషండ
పాలితంబైన యట్టి యిప్పట్టణంబు. 6

మ॥ ప్రకటంబై రవిరశ్మి తూర్పునఁ దమిస్రామర్మనిర్భేదనో
త్సుకలీలం బొడసేరఁ గేళిగృహమించోఁ బాసి యాకార యూ
వికచాబ్జేక్షణ నిమ్నలస్తనతటీవిన్యస్తకస్తూరికా
మకరీముద్ర వెడల్చెఁ బ్రాణవిభు దోస్సంఘర్షప్రదేశంబునన్. 7

చ॥ నలినవనీవిహాసకలనాపరిహాసకుఁ డీయినుండు రా
నల పువ్వుఁబోండ్లకుం బతిభుజాంతరసీమలలోన నిల్పుచూ

చెక్కులఁబొదకట్టినట్టి నిజకుంకుమపంకవిచిత్రపత్రముల్
గులుకుమెఱుంగుగుబ్బలకుఁ గూర్చు వెసం బులకాంకురంబులన్. 8

క॥ పడకిండ్లువెడలి వచ్చిరి
పడఁతుక లొండొరుల చెట్టఁబట్టుక యేమో
నొడువుచుఁ గ్రొన్నెలవంకల
నడనడఁ గుచగిరులఁ బులకలెలమిఁజనింపన్. 9

ఉ॥ వేడుకమై రహస్యకథవేకువఁ బోటులు తెల్పుమన్న యీ
చేడె నవోఢగానఁ గడుసిగ్గునఁ బల్కక మోమువాంచినన్
గోడలిటారి చన్నుఁగవఁ గుంకుమపత్రకముల్ రచింపఁ జే
కూడి తదీయ సీత్కృతి నిగాఢనఖాంకము దెల్పె వారికిన్. 10

గీ॥ ఆపురాభోగమీక్షించి యలరి యంత
రఘుకుమారపరాక్రమక్రమము దలఁచి
మన్నహా విచార భరమున నున్నవనుచుఁ
గలఁగి తనలోన నిట్లని తలఁచె నహుఁడు. 11

గీ॥ జనకుపీటినుండి శౌష్కలుండేతెంచి
నొడివినట్టి రాచవమగువార్త
వినుగుపోలెఁ జెవులఁబడినది మొదలు నా
మొడఁన నకట యెంతబెడఁదదోచె. 12

క॥ మానవుఁడో శరుఁడు జితబహు
దానవుఁడై హరధనుర్మథనమూర్త్న భుజ
శ్రీనల రెడునఁట యిక్కథ
వీనులఁబడఁ గుండెలవియు వే యెవ్వరికిన్. 13

చ. అటువలె నద్భుతైకనిలయంబగు తేజము మర్త్యలోకమం
దెటులజనించె మిన్నకయ? యింతయకాదు దశాస్యునెంచినం
గుటిలచరిత్రుఁ డేమగునొకో యని చింతిలునాకుఁ గన్నులం
గటకట తెల్లవారె నవగాఢ విచారతరంగ సంగతిన్. 14

చ. జనకపురంబువార్త మది జాలి ఘటింపఁగ దద్విచారముల్
మనమున మాటి, కూర్చుఁ జిరునవ్వుఁ దదీయదిశన్ బులస్త్యనం
దనుఁడు సురావరోధవనితాజనతాకచకర్షణక్రియా
ఘనతరకల్పకప్రసవగంధికరాంబుజుఁడయ్యె నక్కటా. 15

క. అని నింగిఁ జూడ్కినిడి యి
ట్లను హా విధి యేమిసేతు నతిదారుణతన్
గనఁబడు నీచిరజీవిత
రొనరుట నేమేమి చూడనున్నాఁడనొకో. 16

చ. వలువ ప్రసన్నుఁడై నిలువ నాఁటికిమర్త్యులఁగీటకోటిగాఁ
పలఁచి తపస్యదుర్జయత దర్పభరంబున వేఁడుకొంటి కో
మలమతి నేఁడదౌ యదియ మర్మముగాఁజెను నైననేమి హా
కలవరమింతెకాక దశకంఠుఁడవానినుఁ గీడుసెందునే. 17

వ. అనియతండుకొండొకయూహించి యవ్విదేహనృపవర్యుండు
నీతిధుర్యుండయ్యె నిట్టియకార్యం బెట్లుగావించెనని వెండియు. 18

సీ. ప్రపితామహుండైన పంకేరుహాసనుఁ
దనలోనఁ జేతికిఁగొనకయున్న
తాతయై త్రిభువనఖ్యాతిఁగాంచు పురాణ
మునిఁ బులస్త్యుని మాన్యుఁడనకయున్న

జనకుఁడై విబుధసంస్తవనీయమహిమచే
మను విశ్రవసుకీర్తి వినక యున్న
హితబాంధవారూఢి నుతిగాంచు మముబోటు
లను లక్ష్యకోటిఁగాఁ గనక యున్న

గీ॥ మఘవమకుటమణిప్రభామండితాంఘ్రి
నఖసుధారోచియైన దానవకులేంద్రు
డైన జామాతఁగాఁ జేయఁగానఁడయ్యె
విమలమతియయ్యుఁ గౌశికుభ్రమలఁదగిలి. 19

గీ॥ అని యొకించుక చింతించి యాత్మలోన
దనుజపతిమంత్రి యేలొకో జనకరాజ
రాజధానికి నేగి శూర్పణఖ రాక
జాగుగావించె ననియెంచు సమయమునను. 20

క॥ దనుజేంద్రు శాసనంబునఁ
జని మిథిలావార్తఁ దెలిసి సత్వరగతిచేఁ
జనుదెంచుచుఁ దనమది ని
ట్లనియెఁ శూర్పణఖ కోర్కులచ్చుపడంగన్. 21

సీ॥ చకచకల్ ప్రకటించు చికిలివజ్రపుఁబాసి
కములఁ బాసిలు నెమ్మొగములతోడ
భుగభుగల్ నిగుడించు జగికుంకుమఁపు నల్లు
పసిమి గాంచిన మేనిరసిమితోడ
మినమినల్ గనుపించు నునుజాళువాజన్ని
దములఁ మించు భుజాంతరములతోడ

ధళధళల్ దులకించు చెలువంపుఁబీతాంబ
రములఁ బొల్పగు కటీరములతోడ

గీ॥ రంగుమీఱెడు నల్ల ప్రొద్దునంగడంపు
రాచపెండ్లికుమారులఁ జూచునపుడు
కపటకృతమానుషీవేషకల్పనంబు
హేయమయ్యును నా కుపాదేయమయ్యె. 22

గీ॥ అనుచు వెండియుఁబల్కు నారాజ యిట్టి
గుణములుస్వభావ మిది యనిగణుతిసేయ
వచ్చు రిపుహస్తగతములై స్వాంతవీథిఁ
బరమకౌతూహలస్ఫూర్తిఁ బాదుకొల్పె. 23

వ॥ అని యభినందించుచు ననతిదూరంబున నేతెంచు నానక్తంచరిం
గాంచి మాల్యవంతుండు గారవంబునఁ గుమారీ! యేనిందుఁ జేరి
యున్నవాఁడ నీవు నిచటికరుగుదెన్నున నదియు నిప్పలుకాల
కించి యిదె కట్టెదుట నట్టాలక మత్తవారణము నధిష్ఠించి మాకని
ష్ఠమాతామహుం డున్నవాఁడు పోయెదనని నితాంతాక్రాంత
చింతాసంతాప పరీతస్వాంతరంగుఁడగు నతని తెఱంగు గనుం
గొని తనలోనిట్లనియె.

చ॥ ఘనతరజాగరశ్రమము కన్నులఁదొట్టఁగ మాటిమాటికిఁ
బెనఁగొను నావులింతలును బెద్దయు విప్పగువక్త్రి మాత్మకొం
దిన యతికార్యభారములఁ దెల్పఁగ నీతఁడు జాతి నెవ్వఁడో
యనఁదగుఁ గాన దుర్జ్ఞయవిధాకుల శీలము లిట్టివే కదా. 25

సీ॥ అదిగాక సామాన్యుఁడగు ధరాధీశుని
సచివభావంబైన సకలకార్య
నిర్ణయునై పుణ్యనిర్వాహ సామర్థ్య
బహుతరక్లాంతిచే భారమగు వి
శేషించి యాతఁ డశేషసాహసరసై
కవ్యవసాయవిఖ్యాతిఁజండ
చారిత్రుఁడైనట్టి మాారావణున కమా
త్యుండఁట యేమననున్న దింక.

గీ॥ వనితలంచుచు నారాక నరయుచున్న
వాఁడు నిశ్చయమని చేరవచ్చి మ్రొక్క
సతఁడు పెండ్లికూతురవుగమ్మనుచు దీవె
ననిడి కూర్చుండనియమించి యనియెనిట్లు. 26

గీ॥ బాల! భరతశత్రుఘ్నులుఁ బంక్తిరథుఁడు
వెంటఁదోడ్కొని జనకునివీడు సేరె
నా? యటన్నను విని శూర్పణఖ యొకింత
యాత్మలో నూహసేసి యిట్లనుచుఁబలికె. 27

గీ॥ ఆర్య దశరథుఁడే తెంచినంత నకు
మారకులకును గోదానమంగళంబు
లెలమివర్తిలుచుండఁగా నేను మిథిల
కతిరయంబున నేగితి ననుచుఁబలుక. 28

వ॥ విని యమ్మాల్యవంతుఁడు నిట్టూర్పు నిగిడించి విన్ననై యో కన్ని
యా! రామునకు మున్ను పరిణయంబుగాక తమ్ములకు వివాహము

హోత్సవమ్ము ప్రవర్తిల్లదుగదా ధరాకుమారి యాదశరథాధి
పమౌళికిఁ బెద్దకోడలగుట నీమాట సూటిదప్పునని కొండొక
విచారించి కటకటా క్షత్రియ బ్రాహ్మణుండగు కౌశికపాతకుని
దుర్నాటకం బిట్టిదికదా యని వెండియునిట్లనియె. 28

ఉ॥ కోణపకోటిహోమమునకుం గృతనిశ్చయుఁడై గజాయుత
ప్రాణధురీణఁ దాటకఁ బ్రతాపమహోత్సవధార్యగాఁగ గీ
ర్వాణులు మెచ్చఁ జేసిన పరాక్రమశాలికి వాని కాజిఁ గ
ల్యాణము నిక్కువంబగు దశాననముఖ్యులు విగ్రహించినన్. 29

సీ॥ సవనవిఘ్నక్రియాశాంతికై దశరథ
క్షితినాథుఁ బొడఁగాంచి సుతుని వేఁడ
వేడి తోడ్కొనిపోయి విమతభీకరభంగి
నాస్త్రమంత్రోపదేశ మొసఁగ
నొసఁగి సుబాహుముఖ్యుల నాహవక్షోణిఁ
బెక్కండ్రఁ దునిమించి యుక్కునిలిపి
నిలిపి యంతటఁ బోక పిలువని పేరంట
ముగ మిథిలాపురంబునకునరిగె.

గీ॥ నరిగి హరువిల్లు విఱిపించి యతనితనయఁ
బరిణయమొనర్చె నకట యీపాపజాతి
కొంపఁ జెఱిపింప నీ రాచకొమరుచేత
నేమి సేయింపనున్నాఁడొ యింకమీఁద. 30

క॥ అన నంగన యిదినిక్కము
జనకపురంబున వసిష్ఠ సంయమి యెదుటం

దనఘునత నెరపు నమ్ముని
యన నవ్వుచు నవ్వధూటి కతఁడిట్లనియెన్.

క॥ రమణీయతపోమహిమన్
రమణీ!యమ్మునికి నొదవు బ్రాహ్మణ్యాదే
శము క్షత్త్రకార్యమున్ విను
వమి నైజము కాదెసానవద్భావమునన్. 31

వ॥ ఇంతియుకా జాత్ప్రత్తిక బ్రాహ్మబ్రాహ్మణ్యంబులం ద్విజాతికుండగు
నితని సన్నిధిం గృతాధ్యయనుం డగుటం జేసి నిసర్గమహిమోదా
రుండగు నక్కుమారుం డునునిందితాచారుం డయ్యెడు నది యెట్లం
టేని. 32

చ॥ అవినయజన్మభూమి యయినట్టి యవిద్య వడంప నోపియున్
బ్రవిమలవిద్య దుర్జనసమాగతమై పెనుచున్ ఖలత్వమున్
భువి భయహేతువైన తమము దెమలింపఁగజాలియున్ మణి
చ్ఛవి సపరింపదే భయము సర్పఫణాగతమై జనాళికిన్. 33

వ॥ అని వెండియుఁ నతండిట్లనియె. 34

క॥ అంగన యింకిట వర్ణిం
పం గారణమేమి యైనపను లైపోనీ
మ్రింగిన కడుఁలకుఁ జవులడు
గంగా నేమిటికి మీావికార్యము వినుమా.! 35

క॥ ఈ రావణుఁ డిప్పుడు బలా
త్కారంబున జనకతనయఁ గైకొనఁదలఁచున్
వారింపందగునే త
త్ప్రారంభం బింక నెన్ని భంగుల నైనన్. 36

సీ॥ అనుడు మనకుఁగలదె జనకజాసంప్రాప్తి
బలిమి దక్క నొం డుపాయమనిన
నకట యిట్టియకటవికటంపుమాటలు
నాతి నీకుఁబలుక నీతిగాదు. 37

వ॥ జగదేకవీరుండును ధర్మవిజయాధారుండును నగు నక్కుమారుండు త్రిలోకీమాన్యుండుగాని సామాన్యుండు గాఁడు కావునఁ దత్పరిగ్రహీతసీతాప్రసభాపహరణంబు ప్రమాదకారణంబని తత్ప్రభావం బుగ్గడించి మాల్యవంతుం డిట్లనియె. 38

ఉ॥ డాకొను బాహుకాండమదడంబర మంచు మదింపఁ డయ్యెనే
కాకరబంధసూవనవిధాయక మంచు నుతింపఁ డయ్యెనే
రాకొమరుండటంచు మునిరాజులు మెచ్చఁ దగాజ్ఞఁదా వెసం
జేకొని యెక్కువెట్టి తిగిచెన్ విఱిచెన్ హరు చాపదండమున్. 39

క॥ ఏవంవిధమహిమావి
ర్భావునియెడ నాతతాయి భావముఁగనునీ
రావణు నెఱిఁగియెఱిఁగి యను
జీవులమగు మన కుపేక్ష సేయం దగునే. 40

వ॥ అనిన విని మాతామహా! నీతిభూషితంబులగు మీభాషితంబులు నిక్కంబగునని యక్కంబుకంఠి వేఁడినిట్టూర్పులు నిగుడ మగుడ నిట్లనియె. 41

గీ॥ అలఘుతరశక్తి భువనత్రయంబుగెలిచి
గెలుపులచ్చిని భుజపీఠి నిలుపునట్టి

రావణునియందు నిటు విచారంబుసేయ
గటకటా వింటి విధిగదా కాలమహిమ 41

గీ॥ అనుడు మాల్యవంతుఁడను రఘూద్వహుఁబోటి
మేటిమగఁడొకండు నేటిదాఁక
గలుగ కునికిఁ బంక్తిగళు శౌర్యమీషేశ
నెదురులేనిచోటఁ గదురు వాఁడె. 43

చ॥ మునిపతిచే మహాస్త్రములు మున్నుగ నేర్చి పినాకభంజనం
బున బలభేదిముఖ్యులకు మోదమొనర్చి గుణాళి ముజ్జగం
బును గ్రయలబ్ధమై తగ సముస్నతిఁ బేర్చిన రాముసన్నిధిం
బనిఁగొనుసే లతాంగి మనప్రాభవచేష్టితదుష్టకర్మముల్. 44

క॥ నావుడు నిందుకు సంశయ
మే వైవాహోత్సవమున మిథిలాపురిలో
దైవతమునిజనకృత సం
భావన లేఁ జూడలేదె ప్రత్యక్షముగన్. 45

క॥ అపవతఁజిల్లను ఏషేఁడి
తనమునఁ బసలేనిపనికిఁ దాఁబోయినచో
మనపతికి నికనవశ్యము
వనితామణి యేకలోద్ధవధ సేకూరుఁగా. 46

ఉ॥ శూరతమీఱఁగా మిథిలసొచ్చి బలాత్కృతి నాలిఁగొంచుఁ బోఁ
బౌరుషశాలి యారఘునృపాలతనూభవుఁడెట్లు సైచు న
వ్వీరవరుం డుదగ్రగతివెంటఁ బడం బెడఁబాయు కష్టు డ
వ్వారజనంబు పెద్దగులు బంధుసమాజముఁ జెప్పనేటికిన్. 47

క॥ దనగతి దుఃఖామర్షజ
మగు తేజము నెరపి మండలానుగ్రహమున్
భువిఁ గాంచు జనుఁ డటంచున్
సవిశేషముగాఁగ నీతిశాస్త్రము దెలుపున్. 48

క॥ అనవిని యసు రసు రనుచున్
మనుజాశనపతికనిష్ఠమాతామహునిం
గనుఁగొని యిం కిట యుక్తం
బనఘా మనకెద్ది? యనిన నతఁడిట్లనియెన్. 49

గీ॥ మేలు కలకంఠి! కార్యజ్ఞురాలవాదు
వినుముచెప్పెద నాకుఁదోఁచినవిధంబు
వనచరులకెల్ల మంత్రియై వసుధమించు
జాంబవన్నాము డొకఋక్షచక్రవర్తి. 50

సీ॥ అతఁడు మతంగాశ్రమావని వసియించు
శ్రమణ నాఁ దగు సిద్ధ శబరిఁ జేరి
ప్రార్థించి వల్కె నోపావనచారిత్ర
వానరేశ్వరుఁడైన వాలివలన
దీనులై బద్ధావమానులై ప్రజలు గి
ష్కింధఁ గుమారుసుగ్రీవుఁ బట్ట
భద్రుఁ జేయఁదలంచి భానువంశవతంసు
డగు రాము సాహాయ్య మభిలషింప

గీ॥ వంజవానుతుఁ డచ్చోటి కరుగుదెంచి
వారి కిట్లను "సబ్రహ్మచారియైన

యాజ్ఞవల్క్యమునీంద్రు పాదాంబుజములు
గాంచి యిపు డేను మగుడి యేతెంచునపుడు. 51

క॥ మిథిలానగరప్రాంతిక
పృథివిం బటుతిగ్మకిరణభీషణతాప
ప్రథిమ నితాంతదురంత
వ్యథఁ జేడ్పడియున్న జరఠవనితం గంటిన్. 52

గీ॥ కాంచి యెవ్వరిదాన వో కంబుకంఠి
యిప్పు డెందుండివచ్చితి వెందుఁబోవ
వలయు నయ్యెది పే రేమి తెలుపుమనిన
నీరెలుంగునఁబలికె నవ్వారిజాక్షి. 53

క॥ భరతుని యోగక్షేమం
బరయఁగఁ గేకయతనూజ యనుప నయోధ్యా
పురినుండి జనకుపీటికి
నరుగుచు నిటఁబడితి మంథరాహ్వయ వనఘా. 54

గీ॥ త్రోవ నీళ్లులేక పోవఁ గాళ్లును రాక
యెండపిడుగుదాకి బెండువడితి
ననుచు నోటిమాటయును నోటనుండ న
వ్వృద్ధఁబోడి యపుడ జీవివిడిచె. 55

వ॥ అని హనుమంతుం డుగ్గడించిన యుదంతంబునకు హృదంతరంబున సంతసించి మంథరాశరీరవియోగంబు మదీయకార్యోపయోగం బయ్యె నని యేను మున్ను సురాసురసంగరంబున నైనవరప్రసంగంబు నెఱుంగుదుంగానఁ దదనుకూలంబుగా నొక్కజాలంబు పన్ని యీలేఖలిఖియించితి వినుమని యిట్లనిపఠించె. 56

సీ॥ శ్రీమదఖండధాత్రీ మహామండలే
శ్వరుఁడైన దశరథాధీశ్వరుల దివ్య
పాదపద్మములకు భక్తిమైఁ గేలయ
విభుఁ దనూభవ సేయు విన్నపంబు
స్వామి దేవాసురసంగరభూమి ము
న్నంగీకరించినయట్టి వరము
లవి రెండు నిప్పుడే నడిగాద భరతు న
శేషసామ్రాజ్యాభిషిక్తుఁ జేసి

గీ॥ లక్ష్మణునిఁగూడి జానకీలలనతోడఁ
దాపసాకృతిఁ బూని పద్నాలుగేండ్లు
దండకాటవి రఘురాము నుండఁబనిచి
నన్ను మన్నింపుఁ డంతియ విన్నపంబు 57

గీ॥ అనుచుఁ బఠియించి నాచేతనైనకార్య
మింతమాత్రంబ యిది సంఘటింపఁజేయ
నీకు భార మటన్న నన్నీరజాక్షి
యేమగావింపఁదగునది యెద్దియనుఁడు. 58

వ॥ జాంబవంతుం డన్నితంబినింగనుంగొని నీప్రభవత్కార్యంబు నాం
సేయఁగోపాయితంబుగా నుంచి పరపురప్రవేశ విద్యాచమత్కారం
బున మంథరాశరీరం బధిష్ఠించి మిథిలాపురంబు సొత్తెంచి దశరథ
సన్నిధానంబున నేతత్సంవిధానం బనూనంబు సేయు మటైన జానకీ
లక్ష్మణసహితుండై రఘువంశకేతుం డగ్గురు నియోగంబునం గరా
ళవ్యాలాభీల జంబాల నిశాతకంటకవ్రాత దుస్తరప్రస్తరాకీర్ణంబగు

దండకాభ్యర్ణంబుఁ బ్రవేశించి వైదేశికుండుగాన తా నవశ్యంబు
వాలి నిగ్రహపూర్వకంబగు ప్రత్యుపకారసంధిం గుమారసుగ్రీవు
ననుగ్రహించి కృతార్థుం జేయు" నని ప్రార్థించె, నని మాల్యవంతుండు
చెప్పిన విని యప్పల్లవాధరి యుల్లంబు తల్లడిల్ల వెండియు నతని
కిట్లనియె. 59

క॥ ఈనృపపోతము వాలి న
హీనభుజాశాలి దనుము నెదురే యితరుల్
వీనికి? భువి "గుడిమ్రింగెను
వానికి గుడిలింగ ముపదంశముగాదే." 60

చ॥ అనుచుఁ జలించి, భల్లుకకులాగ్రణి కొంకలముందలంచి, య
ద్దనుజవధూటి నవ్వుచును దాతకు నిట్లను 'నాకు జాంబవం
తుని కుటిలత్వముం గృతవినూతనకార్యవిశేషకల్పనం
బును విన వేడ్కయయ్యెడు సమున్నతిఁ దెల్పుము తత్కథాశము౯

వ॥ అనుటయు మాల్యవంతుం డిట్లనియె. 62

క॥ వనచరు లిట్లు ప్రార్థించిన
మనమున హర్షించి శబరి మార్తాండతనూ
జునిపైఁగల యనురాగము
తనుఁ దరువిడ జనకరాజధానికి నరిగె౯. 63

గీ॥ అని జనస్థానముననున్న దనుజులిటకు
వచ్చి తెలుపంగ వింటి నో మచ్చెకంటి
జాంబవత్కార్యమిది యమోఘంబు గాన
రాముఁ డేతెంచు నిప్పుడారణ్యమునకు 64

క॥ ఏతెంచి, విరాధముఖా
న్వీతంబై భీమమైన వింధ్యాద్రిగుహా
వ్రాతంబున విహరింపఁగ
సీతాహృతి సుకరముగఁ బిసితభుక్ప్రతికిన్. 65

మ॥ అదిగాదేని నయోధ్య నయ్యేఘనటం జాత్మన్ వితర్కించి చే
యఁదలంపన్ సుర దైత్య యోధతతిలో నగ్రేసరుండై మహో
ద్యదహంకారత నింద్రదత్తపటుమాయామంత్ర పారీణుఁడై
న దశాస్యుండనుచెంగటం బఱఁగునే నక్తంచరోపాయముల్. 66

క॥ అనఁ, దరుణి యకట! నీకిటో
పశతునియెడ నిట్టికీడుపని యొనరింపం
జనునే? యన నతఁడిట్లను
వనితా నీమాట సాధువర్తితమరయన్. 67

క॥ వినుము భువి నెవ్వఁడేనియుఁ
వనఁ జేరినవాని పుత్రదారాదుల కె
గ్గొనరించు, నతనిమండల
మనయమ్ముఁ జెడు నంచుఁ బెద్దలంద్రు కుమారీ. 68

వ॥ ఇది నిక్కంబైనను నిసర్గతేజస్వియగు నత్తాటకాఘుస్మరుం డస్మదా
శ్రయవృత్తిం బ్రవర్తిల్ల నేరఁడనిన సమ్మతించి యప్పలలాశివిలాసిని
యింకనొక్కసందియంబుగలదని వెండియు నిట్లనియె. 69

సీ॥ వినయాభిరాము రాముని గనంగొని తండ్రి
వనవాసమునకుఁ బొమ్మనుట యెట్లు?
మఱి వసత్యాశంక నతఁడు పొమ్మనునపో
భరతుఁ డందుకు నొడంబడుట యెట్లు?

క్షితి లోకసామ్రాజ్యరతి నతం డొడఁబడి
యుండుఁడో సౌమిత్రి యోర్చుటెట్లు?
వెనువెంటఁ జనువాఁడ నని యతం డొప్పఁడో
గురుఁడు కౌశికుఁ డీయకొనుటయెట్లు?

గీ॥ మునిజనానుగుణం బిది యనుచు నతఁడు
నియ్యకొనుఁడో రమూన్కివారుఁ డయ్యమాట
వీటిఁబుచ్చక యస్మదుగ్రాటవికిని
ఏచ్చునే ప్రాజ్యసామ్రాజ్య వాంఛలుడిగి. 70

గీ॥ అనిన విని మాల్యవంతుఁ డోవనజగంధి!
డెందమున మానుమా వట్టిసందియంబు
కీర్తికాముకులగు ధరాభర్తలకును
రాగ మొదవునె రాజ్యోపభోగములను. 71

క॥ నావుఁడు మాతామహుతో
నావెంటఁదుక యింకనొక యనర్థాంతర మే
భావంబున నూహించెద
నా విని యతఁ డెద్ది? యనిన నవలా వలికెన్. 72

మ॥ భవకోదండవిఖండనోర్జితభుజాప్రౌఢిన్ విజృంభించు రా
ఘవుపైఁ బుట్టినయట్టికిన్క నిఖిలక్షత్రాంతకుండైన భా
ర్గవరాముం డరుదెంచె నంచు నటఁ గర్ణాకర్ణిచే నొక్కవా
ర్త వినంగాఁబడె నిప్పుడేను మిథిలాప్రాంతోర్వియం దుండఁగన్. 73

గీ॥ అనుఁడు మాల్యవంతుఁ డగునగు నివ్వార్త
యుక్తమరయ భృగుకులోద్వహుండు

నయనసాయకుసఖుఁ బ్రియశిష్యుఁ డగుగదా
బాల! యతఁడు రాక యేలమాను. 74

మ॥ కరసంరోధిత నర్మదామకరచక్ర క్రూరదంష్ట్రాగ్రసము
త్కరఘాతవ్రణజాతకర్కశలసద్బాహాసహస్రాన్వితుం
దరికొల్పెన్ గృతవీర్యపుత్రుఁ బరశూచ్ఛ్యద్వహ్ని నవ్వాఁడు శ్రీ
త్పరమస్ఫూర్తి విభాసి దేశికధనుర్భంగం బుపేక్షించునే. 75

గీ॥ ఐనఁ గానిమ్ము సకలమూర్ధాభిషిక్త
కంధరాబంధురాస్రావగాహ గాఢ
పంకిలకఠోరతర కుఠారాంకుఁడైన
యతని కేసి న జేయుఁ డీయధిపసుతుఁడు. 76

గీ॥ అనఁడు విని సైప కంగన యతనిఁ జూచి
'పాలబుగ్గలయీరాచబాలు నెంత
గొనల నెక్కించి పలికెది' యనిన నవ్వి
యవ్విలాసినితోడ నిట్లనియె నతఁడు. 77

క॥ చంచలలోచన! యతనిం
గొంచెం బనఁజనదు దొడ్డకొంచెఁబులఁ బ్రా
పించున బంటుతనంబులు
'గొంచెపుఁబిడుగులకుఁగాదె కొండలు పగులన్.' 78

గీ॥ అఖిలరాజదురార్షమై యశేష
దేవతామయమైన యద్దివ్యధనువు
మించి భుజశక్తి నవలీలఁ ద్రుంచినపుడె
నాతి! యతఁడు జగత్త్రయజేతసువ్వె. 79

గీ॥ అఖిల రాజన్యరక్తధారాంబురాశిఁ
ద్రిషవణస్నానమొనరించి తేజరిల్లు
చిరతపోనిధి భృగురాముఁ డరుగుదెంచి
యేమిసేయునో యిటమీఁద నెఱుఁగరాదు. 79

వ॥ కావున నేతత్ప్రసంగంబు నిశాచరపుంగవున కెఱింగింపవలయు ననుచు మాల్యవంతుండు శూర్పణఖయుం దాను దశముఖాస్థాన బునకుం జనిరి. నంత నిక్కడ మిథిలానగరంబున నుత్తరకోస లేశ్వరుండు కానలేయాదితనూభవ శోభనోత్సవంబు సంప్రతిల్ల యుల్లంబు పల్లవింప నిలింపవల్లభప్రముఖ నిఖిలదేవానీకంబును దిగంతాయాతరాజలోకంబును యథోచితసంభావనాపూర్వకంబు గా వీడ్కొల్పి గాధేయగౌతమప్రభృతిమౌనిసందోహంబును సీ రధ్వజాదిభాంధవవ్యూహంబును బరివేష్టింప నున్నసమయంబున. 80

మ॥ అటకే తెంచె భృగూద్వహుండు నిజబాహాప్రస్తరస్తంభ వి
స్ఫుటమౌర్వీపటుచాపశక్తివలనద్భూచక్రజైత్రాంకుఁ డు
ద్భటరాజన్యమదేభయూథమృగయాదక్షుండు నారాచముల్
చటులాస్త్రవ్రణజాత జాతకిణ వక్షఃపీఠిపై నూఱుచున్. 81

శా॥ చాగు స్త్రైణకపోలపత్రరచనా చౌర్యక్రియాభీరువై
తోరంబైన భుజం బశేషనృపజిద్ఘోరాగ్రచాపాప్తిఁ బా
ల్పారం దూణము లుత్తరీయకకుచేలాకృష్ట తంతుచ్ఛటా
సారం గట్టుచుఁ జేరవచ్చె నతఁ డిచ్ఛన్ జాపముల్ భీతిలన్. 82

వ॥ ఇట్లేతెంచుచు నతండు. 83

సీ॥ చర్చించిచూడ శస్త్రాస్త్రకథనంబు
గగనారవిందసంకాశ మయ్యె

ప్రత్యగ్రగీర్వాణపాణింధమములైన
గగనమార్గములు దుర్గమము లయ్యె
ప్రతివాసరము సముద్భటభటచ్ఛట నీను
వసుధానశారోహ వంధ్య యయ్యె
పద్మ పద్మాంతరభ్రమరంబులనె కాని
కరిఘటాకటముల నెఱుఁగదయ్యె

గీ॥ జముఁడు మునుమున్న యసమానసాంయుగీన
రాజనెల్ల యథాసృష్టభోజి యగుచుఁ
బూని ముగియింప నిట వేకిలేని లంఘ
నములు వాటిల్లెఁ గటకటా! నారదునకు. 84

వ॥ అని సవిస్మయంబుగఁ గొండొకవిచారించి వెండియు నాభృగూద్వ
హుం డిట్లనియె. 85

ఉ॥ ఏవిలునారి యిందుధరుఁడెక్కిడుచుం జెవిఁజేర్చినం బుర
శ్రీవరకర్ణపూరములు ద్రెళ్ళఁ బ్రకోష్ఠతటిన్ ఘటించు నో
నావనితాకరాబ్జవలయంబులకున్ విలయంబుగల్గు నేఁ
డావిలు రాముచేత నహహా! విఱిగెన్ దొఱఁగెన్ మహోన్నతిన్. 86

క॥ అని వికటభ్రుకుటీన
ర్తన మడర విదేహులార! దాశరథిన్ రా
మునిఁ జూపుఁ డెచటనున్నాఁ
డని మఱియుఁ బిచండిలాగ్రహాగ్నుండై. 87

మ॥ స్ఫుటగర్వార్జునదోస్సహస్రనఖరప్రోద్గచ్ఛదస్రార్చిరు
ద్భటమహామత్సరశుగ్రవహ్ని నృపసత్త్వామాత్రపూర్ణాహుతిన్

బటిమం గాంచక నేఁడు చూడుఁ డకటా! ప్రాల్మాలెడుం జాల నా
కటఁ దత్త్వార్క బహ్వైకభుక్తి విఘసత్పుత్రాధమశ్రేణికిన్. 88

వ. అని యజ్జటికరటి కటూక్తి వికటంబుగా నికటంబునకేతేర నవా
ర్యధైర్యసంభ్రమోదారుండై రఘుకుమారుండు. 89

మ. నిటలాక్షుం డుపదేశమర్థి నొసఁగన్ సేనానితోఁ గూడి యు
ద్భటచాపాగమసాహసముల్ దెలిసి యోధశ్రేణిలోన్ మహా
జటిసింహంబులలోన నప్రతిమతేజస్స్ఫూర్తి వర్తించు నీ
పటుపుణ్యుల్ భృగురాముఁ జూడఁగలిగెన్ భాగ్యాతిరేకంబునన్

క. అనునెడ భృగుపతి శివునకుఁ
దనపైఁ గలకనికరంబుఁ దలఁచి విషాదం
బనయము నెమ్మదిఁ గ్రమ్మఁగఁ
దనుఁ దా నిందించుకొనుచుఁ దానిట్లనియెన్. 91

ఉ. శంక యొకింతలేక పరమప్రతిఘాతిమదాంధబుద్ధి బల్
బింకమునం గుమారగుఖురళీకలహంబున ధిక్కరించి భ
స్మాంకుర! యంచుఁ దిట్టినను నంబయుఁ దానును జూచి నవ్వ నే
గాంకకిరీటుచాపహతి హా వినియుం గనియున్ సహించెదన్. 92

వ. అని కొండొకవిచారించి యజ్జటిధూర్జటి కటకటా! యీరఘు
కులాంకురంబు సముద్భటరణోల్లాసినగు నన్నరణ్యవాసిగా నెఱింగి
తరంగితమదాంధస్వాంతుండై యింతపరాక్రమించునే! యని
యాగ్రహించి సురాగ్రణీభుజాగ్రజాగ్రద్దంభోళిధారాకఠోరంబగు
కుఠారంబుఁ బరికించి యత్యుంచిదుచ్చైస్స్వరంబున నచ్చటిజనం
బు మనంబున సంగల్లశిల్ల నిట్లనియె. 93

శా॥ ఓరీ రాఘవులార! మీరు వినరా! యుగ్రావనీభృత్కులాం
కూరం బిర్వదియొక్కమాఱు చటులక్రోధోన్నతిం ద్రుంచి దు
ర్వారంబై వినికృత్తగర్భపలలాస్రస్రావవిస్రాంగకో
దారంబైన కుఠారముం బితృవధవ్యక్తాఘనిస్తారముల్. 94

గీ॥ అనుచు నేతెంచు భృగువంశవనధిపర్వ
శర్వరీనాథు బహుమానపూర్వకముగఁ
గాంచి యతనిపరాక్రమక్రమము నెంచి
మిత్రకులమౌళి వల్కె సౌమిత్రి తోడ. 95

మ॥ అలఘుస్ఫూర్తిం దశాస్యుఁ గెల్చి నిజబాహాశ్రేణి నిశ్రేణికా
తులితారూఢజగచ్ఛటాజయరమాధుర్యాంచితోరస్స్థలీ
కలనం బొల్చిన కార్తవీర్యుఁ గలనన్ ఖండించె నీభార్గవుం
డల సేనానిముఖంబులం జూచు సమరోద్యద్భీతి వెన్నిచ్చినన్. 96

క॥ ఏతాదృశనిజభుజమహి
మాతతజయశాలి యీతఁ డని యనితరసం
ప్రీతిం జిదాకృతిం గనుఁగొని
సీతాక్షి వెఱఁగంది మఱియు నతఁ డిట్లనియెన్. 97

సీ॥ మకుటసౌభాగ్యంబైన మౌళిభాగంబున
నిడుదపెంజడగుంపు ముడిచినాఁడు
నిఖిలభీకరభంగి నిజభుజాంతరపీఠిఁ
జాపంబుఁ బరశువు మోపినాఁడు
భసితంపునునుఁబూఁత నసమించుముం జేతఁ
రౌద్రాక్షవలయంబు దాల్చినాఁడు*

* ఇచట యతిదోషము ప్రమాదజనితము.

శోణాంబుబిశ్రీల రాణించు కెంగేలఁ
గ్రావాదితూపులు గూర్చినాఁడు

గీ॥ ప్రకటతీవ్రవ్రణచ్ఛటావికటరీతి
నొప్పు నతఁ డేణచర్మంబు గప్పినాఁడు
చాగు రే! యింతయఖిలరసప్రకాండ
సమ్మిళితమూర్తి యిమ్మౌనిచక్రవర్తి. 98

వ॥ అని చేరనేతెంచు నవ్వంచనాచుంచువుం గనుంగొని భార్గవుం డం
తర్గతంబున 'నిక్కుమారుం డనుశ్రూయమాణగుణగణానురూప
దీపితాకారుం' డనితలంచి ప్రకాశంబుగ నాదాశరథి కిట్లనియె. 99

మ॥ బళిరా! ఘోరనృపాలడింభ మదడంభక్రూరనానాకుభృ
త్కులసంహారికుఠారభీకరు నన్నుఁ గుంభీంద్రకుంభచ్ఛిదా
కలనాభంగనఖానుషంగమగు సింగంబుం గురంగంబనన్
గోలనం జేరి మదిన్ ఘటించితి తరంగీభూతహార్దోన్నతిన్. 100

క॥ నావుఁడు నకుటిలనిర్మల
భావుఁడగుచు నతనిఁ జూచి భరతాగ్రజుఁ డో
దేవా! నీ నా యంతర
మీ వానతి యిచ్చినటుల యింతయె తెలుపన్. 101

మ॥ జనకుండౌ భృగువంశనిచంద్రుడవలన్ సర్వాగమార్థావళో
కనమున్ ధూర్జటిచే శరాసనకళాకౌశల్యముం గాంచి, వా
ఙ్మనసాతీతభుజాబలార్జితమహిన్ త్మాదేవతాకోటికి
చ్చిన నిన్నప్రతిమప్రభావమహితున్ సేవించెదన్ భార్గవా. 102

క. అనవుఁడు భార్గవుఁ డోరీ
జనపాలకడింభ! సంతసము నొందితి నా
మనమున నీభుజవిభవ త
దనుగుణసౌజన్యములకు నదియట్లుండెన్. 103

మ. పటుశక్తిం గృతవీర్యనందనవధూబాష్పప్రియంభావుకో
ద్భటబాణోదిత శోణితాంబుధి నివాపం బర్థిఁ గావించి, యా
చటులక్షత్రతతిన్ భుజించి పిదపం జల్లాఱు క్రోధాగ్ని వె
ల్లుట కీవింధనమైతి వంధకవిభిత్కోదండదండాహృతిన్. 104

వ. అనిన మందస్మితకందళితవదనారవిందుండై రఘునందనుండు భృ
గునందనున కిట్లనియె. 105

ఉ. నిక్కము మానినాథ మది నిన్ను గణింపక బాల్యచాపలం
బొక్కటి మిక్కుటంబుగ మహోగ్రతరోగ్రశరాసనంబు నే
నెక్కిడఁ బో నయత్నముగ నిట్టియమంగళ మావహిల్లె నీ
యొక్కడు తప్పు నీమది సహింపుము నింపుము కూర్మి నాయెడన్. 106

క. నావుడు మెచ్చుక చెప్పెద
నీవు భవన్మహిమ నోరినృపడింభక హా!
భావజమథనప్రథనాం
కేవాసిం బరశుధరు గణింపవె నన్నున్. 107

మ. శరజన్మం బినుమారుగ్గాంచె నముచంచన్మృత్యుదంష్ట్రాసహో
దరముల్ మచ్ఛరముల్ రణాంగణమునం ద న్నింత చేఁగాచినన్
బురజిత్ప్రీతి, మహోన్నతిం గెలిచితిన్ ముయ్యేడుమాఱుల్ సము
ద్ధురదోశ్శక్తి వసుంధరన్ నృపక్షుద్రాదృగ్గచ్ఛటాబంధురన్. 108

క॥ అనవుఁడు నివకులుఁ డిట్లను
ననఘా! భృగువంశతిలక! యవివేకభరం
బునఁగాని నినుగణింపమి
ఘనతరగర్వాంధబుద్ధిఁ గాదు తలంతున్. 109

ఉ॥ నీవు త్రిలోకవీరుఁడవు నీజనయిత్రియవీరమాత యో
దేవ! మహానుభావ! భవదీయభుజాపరిభూతబాహులే
యావనశాస్య మంబ జగదంబ త్రపంబరికించి దీనయై
భావమునన్ భవజ్జననిభాగ్యము పెంపు వహింపఁగోరుటన్. 110

క॥ అనిపలికెడు రఘుకులపా
వను ననుపమవచనరచన వైయాత్యంబున్
విని యిట్లను నలభృగుకుల
మునికేసరి చిఱునగవు మొగమున నిగుడన్. 111

మ॥ అనుభూతిం బునరుక్తముల్ మహిమ మదీయాశ్చర్యచర్యాస్తుతుల్
చన దాజోలి ధరింపు తెంపు మెయి విశ్వామిత్రుచేఁగన్న నీ
ఘనశస్త్రాస్త్రము. లింక మత్కర ముదగ్రక్రూరసంగ్రామఖే
లనసన్నద్ధకుఠారభీకరము కాలక్షేపముల్ సైఁచునే. 112

ఉత్సాహ॥ అనుఁడు నెంతకెత్తుకొనియె నౌర! యితఁడు గాధినం
దనుని మోపనాడె నైనఁ దానికేమి యాడనీ
కనలి "త్రుళ్లునద్దుగాదెగంతమోయు" నంచు నె
మ్మనమునం దలంచి నృపతి మానితోడనిట్లనున్. 113

చ॥ జలధిమితోర్విమాత్రము వశంబుగ నిర్వదియొక్కమాఱు దో
ర్బలమునఁ గెల్చియుం బరులపాలుగఁ జేసిన ధార్మికుండ వీ

వలఘుఁడ నేను బాలుఁడ భయంకర మిప్పని గావఁ గోపముం
జలమునుమాను మోయనఘ జాతినపూజ్యులు మీరు మాయెడన్.

వ॥ అనవుఁడు జామదగ్న్యుండు సక్రోధకంపంబుగా నాత్మగతంబున.

ఉ॥ సాటికిఁబోటి కీఖలుఁడుక్షత్రియపోతము నేఁడు మాటకున్
మాట యొకింత వీరవరమార్గము దప్పకపల్కె నద్దిరా
పోటరివోలె నంచుఁ దనబుద్ధిఁ దలంచుచు నంత భూరివా
చాటత నోరి! భార్గవుఁడు జాతినపూజ్యుఁడె నీకునయ్యెడన్. 116

చ॥ అనివచియించి యిప్పటికి నాయుధపాణివి గావదేమి నీ
వినయనిగుంభితోక్తులు నవీనకళంకముగా యుగాంతకో
పనయమదంష్ట్రికాక్రకచభాసికతోరకుఠారసంభృతిం
గనుఁగొన శక్యమైనయది గాఁ గదెమత్కరమంచు వెండియున్. 117

స్రగ్ధర॥ త్రైలోక్యత్రాణదీక్షాధరమగు హారిదోర్దండజిత్క్షత్రవర్ణం
బాలీనంబయ్యె మున్నే యలఘుభుజములర్థిమ్మహా వీరుఁ డత్యా
భీలక్రోధానుభూతిం బెరిగెను జగముల్ భీమణోగ్రద్యుగాంత
జ్వాలాజాజ్వల్యమానజ్వలనకబళనాశంకచేఁ దల్లడిల్లన్. 118

వ॥ అని పెట్టిదలంపుబలుకులంబల్కు నజ్జటిధూర్జటిం గటాక్షించి స
మంచితజ్ఞానజనకుండగు జనకుండిట్లనియె. 119

గీ॥ క్షత్రవధరూపమగు మహాసత్రమునకు
క్షితితలంబెల్ల దక్షిణఁజేసినట్టి
సోమయాజికి నీకేలకుమ్మహేతి
తగదు వినుమయ్య భృగురామ!సుగుణధామ. 120

సీ॥ అని శాంతగంభీరనినద మేర్పడఁ బల్కి
జనకునిఁజూచి యిట్లనియె నతఁడు
వినుము సీరధ్వజ! వనజాప్తు సన్నిధి
శుక్లయజుర్మహాశ్రుతిఁజదివిన
యనఘుఁ డాయాజ్ఞవల్క్యమునీంద్రుకరుణచే
వేదవేదార్థకోవిదుఁడవైన
నీమాట వినఁజాలు నిక్క మైనను నిది
సమయమే? శిష్టానుసరణమునకు

గీ॥ జగతి ముయ్యేడుమాఱులు తెగ జయించి
ఋత్విజులకిచ్చినట్టి దింకేల యడుగ
నభిమతద్వంద్వరణకేళి నఖలనృపతి
పటలమోటనసార మత్పరశుధార. 121

వ॥ అని యిత్తెఱంగునం దరంగితాగ్రహజ్వలనజాజ్వల్యమానుండై
పలుకు భృగురాముం గాంచి సమంచితవినయభాషాసుధాభిషేకం
బునఁ జల్లార్పందలంచి, దశరథుం డిట్లనియె. 122

మ॥ అనఘా భార్గవ! నీకు మొక్కెద విరోధావాప్తిఁజాలింపు మ
న్నన లోకత్రితయాభయావిరతదానస్థూలలక్షుంబవై
మను చాపాగ్రమునందు నేల ధరియింపన్ వేఁతి నీరీతిగా
మునయం జెల్లున పుత్రభాండమగు రామున్ సద్గుణారామునిన్.

కం॥ అన విని భృగుపతి రాముని
గనుఁగొని గంభీరధీరకర్కశఫణితిం
దన రెడు వీఁ డెవ్వఁడురా
యన, "దశరథుఁ డితఁడు గురుఁడయా నా" కనుఁడున్. 124

క. శోకాకులితస్వాంతుం
డై కనలుచు ఘూర్ణకంధ మఖిలాశలయుం
దీకరణి మోహనులెత్తున
హా కటకట యనుచు దశరథాభిముఖుండై. 125

గీ. భార్గవుఁడు వల్కు వినుమో యిపార్థివేంద్ర
పుత్రమన్నామమాత్రైకమైత్రిఁ గనుట
నీవు మానార్హుఁడవకాని యించుకేని
వీరసమయంబుఁ బరికింప నేరవైతి. 126

గీ. చండికానాథకోదండఖండనమున
నొచవి మది నేఁడు కోపమహోగ్రవహ్ని
రఘువిదేహకుటుంబధారాళబాష్ప
సంతతాసేకమునఁ గాక శాంతమగున 127

చ. అన విని యిట్లనున్ భృగుకులాగ్రణిఁ జూచి విదేహధారుణీ
జనపతి యోమునిప్రవర శస్త్రకలాపము సన్యసించి ని
ల్చిన మముఁబోటిశాంతులకుఁ జెచ్చెరఁ గోపము రేఁచి క్రమ్మఱన్
ధనువుపరిగ్రహించుటకుఁ దత్తరపెట్టెదవీవు నావుఁడున్. 128

క. ఉలికిపడి మౌని యిట్లను
బలిరోరి విదేహవంశపావన నీవుం
బలుపోటరివలె వెఱవక
పలికెద విటు ,వెన్నకాళ పంపులువచ్చెన్. 129

శా. చిత్రాంశుప్రియశిష్యుఁడైన యతికిన్ శిష్యుండవంచుం దమో
విశ్వాసోగ్రతపస్విరుండవనుచున్ వృద్ధుండనంచుం గృపా

పాత్రం బన్న నహో ఘనుర్వచనముల్ భాషించి యన్మన్మహో
ద్ధతశాత్రిలంఘమఖామృతంబ వయి తేఁగా నిన్నుఁ జోకార్చెదన్. 180

సీ॥ అనిపల్కు భృగునందనునిఁ గనుఁగొని కౌశి
నందుఁ డిట్లనుఁ గృపానందుఁ డగుచు
వినవయ్య మునివిభుంచన మున్ను గశ్యప
చ్యవనాదిమౌనుల శాసనమున
సంప్రహారక్రియాసమభిహారము డించి
యవిరళబ్రహ్మానుభవము గాంచి
పరమసాత్త్విక గుణాభరణమా నీకును
బొడమెనే విపరీతబుద్ధి యనఘ
గీ॥ కటకటా పూని యిటు లెంతకాల మేని
నితరునింబలె నిను బట్టి వెతలఁ బెట్టి
క్రించుఁదనమున నాటలాడించఁ గోడఁగ
నుఱక కోపంబు రేఁచి యాయుధపిశాచి. 181

గీ॥ అన కౌశింతనవ్వి యాతఁ డాజ్యస్నేహ
మితనిమవిక నెంత వెతరాయునన్నా
నైన మందిమాటలాడి నే నలరింతు
ననుచు భృగుతనూజుఁ డతనిఁ జూచి. 182

ఉ॥ ఓకుశిచంద్ర! మానవరోత్తము నిత్యముఖక్రియాపురో
డాశరసజ్ఞుఁ గాంచితి నటద్భుజవిక్రమజాగ్రదాగ్రహో
ద్వేకులు వీరె రాఘవులు వేదికులంబు చలంబుదీరఁగా
నాశ మొనర్చి శావకమనఃప్రియవృత్తి వహింతునంతటన్. 183

చ॥ అకటయు నాగ్రహంబెసఁగ నంగిరసుండను నోరి క్షత్రియా
తనయ దురాత్మ క్షత్రవనితాజనగర్భవిదారణంబుచే
నొవరెడు భ్రూణహత్యలకు నోడనివాఁడ భార్గవాన్వయం
బున జనియించినట్టి యొకజోయవుగాక మహీసురుండవే. 184

ఉ॥ భానుకులప్రసూతుల కృపాణము నొంచినచో నిసర్గని
ప్రాణము విప్రకోటియెడ, వారలకో? యెటువంటివాఁడ వీ
వైన సహింపఁగావలయు, నట్లని నీవుమదిందలంచితో?
మానమదాతిరేకవలమానగతిం జెలరేఁగి త్రుళ్ళుటల్. 185

క॥ కానీ వారికి వెఱువక
మానిన మానితివిగాక మఱి వెఱవవుగా
మానసమున నెంతటి య
జ్ఞానివి సుబ్రహ్మవర్చసంబునకైనన్. 186

చ॥ అనవుఁడు రోషభీషణముఖాంబుజుఁడై పరిహాసకౌశలం
బనయము నేపుఁజూప నకేఁడాంగిరసుం బరికించి యేమిరా
నను నెదిరించిపల్కెదు మనంబున శంకయొకింతలేక నీ
వనిమిషనాథనందనుఁడవంచునొ? గౌతమవంశపాంసనా. 187

క॥ ఎల్లరు వేల్పులు మును నీ
తల్లి నినుం గనినయపుడ దరహాసమునన్
దెల్లముగఁ గుండశబ్దము
పుల్లింగము సేసితనుచుఁ బొగడరె నిన్నున్. 188

వ॥ అని వెండియు నఖండజాగ్రదాగ్రహాగ్రస్తుండై యప్పరశుహస్తుం
డిట్లనియె. 189

మ॥ మది నీరాఘవు లస్త్రగాథలు దలంపంబూనినారేని య
న్నిదముల్ దాల్చినవారలెల్ల ద్విజులేనీ నిమ్ము నందుంగణిం
పుదురేనీ హతరాడ్వమిత్కవరక్షుప్రోద్దామవహ్నా మద్దురా
సదమార్వీకుశకర్షణోల్బణ కిణాంచద్బాహు వింకేటికిన్. 140

ఉ॥ నావుఁడు మానితోడ నజనందనుఁడిట్లను నోమహాత్మ రా
జీవభవప్రసూతుఁడు వసిష్ఠసనాభి భృగుండు తాత నీ
కీవుఁ బ్రియావిదుండవని యోర్చి సహించితి నిప్పుడేని మ
ద్భావము నీయెడం దెగడు భార్గవ మానము దుస్స్వభావముల్.

వ॥ అనిన భార్గవుఁడు 142

క॥ అదరిపడి యోరి యేమని
వదరెదురా రాచపురుగ! వాలాయము నీ
మదిఁ దెగడ తెగినఁ దెగుగా
కదియత మత్పరశు వడరునంతకు ననుఁడున్. 143

వ॥ విని పితృనిందా సంజాత క్రోధ సంధుక్షిత హృదయుండై
లక్ష్మణుం డిట్లనియె. 144

మ॥ ఘనుఁడీరాముఁడు దా సముద్రగజాఁడికన్ గాకుండినన్ మానసీ
మనువంశప్రభవుండె కాఁడని బుధుల్ మచ్చేష్ట నిందించనీ
నను ధీరుండననీ యధీరుఁడననీ నానాజనుల్, పూనితిం
గనదాటోపత దుష్టభూదివిజశిక్షాదీక్ష నేఁడాదిగన్. 145

చ॥ అనినఁ దదుక్తి కమ్మునియనాదర మేర్పడ రాముఁ జూచి నీ
యనుజుఁ డయోయి దేమి నిను నగ్రభవుండిక గాకయున్నమే
లనియెడు నా వతంసు పరిహాస మెలర్పఁగ నమ్మహాతపో
ధనమణితోడ నిట్లను నితాంతసుధామధురోక్తి చాతురిన్. 146

క॥ బాలుఁడుగాన వివేకము
చాలక వీఁడేమియనినఁ జను నగ్గింపం
బోలదు మీకు జటాలని
టాలవిలోచన! ప్రసన్నుఁడవు గమ్మనుచున్. 147

ఉ॥ రాముఁడు వల్క నవ్వి భృగురాముఁడు మేల్పనివాఁడువీఁడు మా
కేమిటికల్క యుష్మదనువృత్తి పరుండగు వీఁడు నీవు మ
ద్భీమభుజాకృపాణహతిఁ ద్రెళ్లినతోఁడన త్రెళ్లు నక్క తే
జోమహిమంబు శాంతముగుచో శమియింపవె తన్మణిప్రభల్. 184

వ॥ అని లక్ష్మణుం గనుంగొని. 149

ఉ॥ క్రౌంచనగేంద్రసింధురశిరంబు శరాఘనఖాంకురంబులన్
జించి మరాళమౌక్తికవిశేషములన్ వెదఁజల్లి యెల్లెడన్.
సంచితసింహవృత్తిఁ దగు నన్నిటుచేరఁగనుత్సహించి గా
వించితి వద్భుతంబు బళి వీరశరీరమ కాదు నావుఁడున్. 150

క॥ ఆరాముతమ్ముఁ డిట్లను
నోఋషిసుత్రామ భూమకోత్సాహము నిన్
జేరుటకో సమరంబునఁ
బోరుటకో యివుడు తెలియఁబోలును నీకున్ 151

సీ॥ అనఁ గోపమున రాముఁ డనుజన్ము నీక్షించి
యన్న! యీదుర్వినయాతిరేక
మెందుండివచ్చె నీ కతఁడెంత? నీవెంత?
తాపసాక్షేపంబు తగున యనిన
విని యతం డగ్రజుఁ గనుఁగొని స్వామి! యా

నతివింటి నూరకున్నాఁడ ననుడు
మునిఁ జూచి రౌాతిపోధన క్షమింపుము నేను
శ్రీరామునాజ్ఞ యంత్రితుఁడనైతి

గీ॥ ననుటయును, విని రాముతో ననియె మౌని
యాహవవ్యగ్రమగు మదీయాగ్రహంబు
వాయ దీమంచిమాటలఁ 'బాముకాటు
చీఁదుడిచినఁ జనునె, యేనీమనైన. 152

క॥ అటుగాక చాటువాచా
నటనం బిటఁ బనికిరాదు నాయస్త్రంబుల్
చటులాస్త్రములఁ దెమల్పుము
పటుసమరోచితముగాదె ప్రాయము నీకుఁ. 153

వ॥ అదియుంగాక. 154

గీ॥ జననుతంబగు రఘువంశమున జనించి
కౌశికుభజించి దివ్యాస్త్రగరిమఁగాంచి
వెలయు నీ వింక క్షాత్రంబు విడిచితేని
నీకులంబున కపకీర్తి రాకయున్నె. 155

క॥ అనవుఁడు రఘునందనుఁడ
మ్మునిపతి నీక్షించి ముద్దుమోమున లేన
వ్వొనయఁగ వినయంబున నను
నవఘా నీమాటనిక్రమగు నూహింపఁగ. 156

ఉ॥ వాసికినెక్కినట్టిరఘువంశమునం బ్రభవించి దివ్యబా
ణాసనవిద్యఁ గౌశికుదయం దగఁ గాంచితి నైనఁ దాపసా

గ్రేసర దీవ లోకు లపకీర్తి యటన్నను గీర్తి యన్న నే
భూమరుమీఁద నాయుధముఁ బూనుటకై వెలితోఁ మనంబునన్.

చ॥ అన విని భార్గవుండు సముదగ్రతరాగ్రహుఁడై రఘూద్వహుం
గనుఁగొని ఘోరదుర్ముఖుఁడ కౌశికుఖాతి వసిష్ఠరీతి నీ
కనిశము మేలుగావలయునంచు సమాశ్రయనైకవృత్తిచే
నానరకు విప్రుఁడే భృగుకులోత్తముఁ డిప్పలుమాటలేటికిన్. 158

క॥ ఎటువంటికష్ట మిన్నీ
యిటువలె నుచ్చావచంబు లీక్షత్త్రియుఁడా
డుట వింటి మునుచు వెండియుఁ
గటకటపడి కటములదరఁగా నతఁడనియెన్. 159

క॥ సుతయుతముగ దశరథభూ
పతిఁ ద్రుంచి విదేహకులకబంధస్కంధో
త్పతదస్రలతాకేతు
ప్రతతిం గైసేతుఁ గదనరంగంబెల్లన్. 160

ఉ॥ నావుఁడు చూచి చూచి యని వన్న హహా! వెలిపింపఁజూచె దీ
వీవెడమాట లింకవిను మిట్లయినన్ మముబోటివారికిన్
భావములోన నాగ్రహముపాటిలు నన్న విభిన్నరోషదా
వానలవిగ్రహుండగుచు నాముని రామునిఁజూచి యిట్లనున్. 161

క॥ మది నీకాగ్రహమొదవిన్
నొదవుంగాకీవు సేయనోపినయది రౌ
ద్ర్యోది వెడఁగా! 'నీకోపము
పెదవులఁతీ, టన నితాంతభీషణఫణితిన్. 162

వ॥ సావష్టంభంబుగా రఘునందనుండు భృగునందనున కిట్లనియె. 163

చ॥ అరిజయముల్ రణంబున నుదారభవద్భుజశౌర్యగుణంబుగా
నిరువదియొండు గూర్చి యిపు డిర్వదిరెండవ గెల్పుఁ గూర్పఁగా
నరయు మహోగ్రతావకశరాసన చాతురిఁ జూడఁగోరెదన్
గిరిశదురాపచాపవినికృష్టి నెపంబ పరితుష్టి చాలమిన్. 164

క॥ అన విని ముని సంరంభం
బెనయఁగ నేమంటివోరి యేమంటివిరా
యని, తద్వీరాలాపము
తనమనమునఁ దలఁచి తలఁచి దర్పోద్ధతుఁడై. 165

గీ॥ కెంపుకొని యెల్లదిక్కులనిండుకొనిన
భీషణంబగు నున్మహారోషవహ్ని
శాఖాశతంబు లన్ని యయ్యె విదేహరఘునృ
పాలురు ముని మఱియు నశ్వాగ్రవుంకు. 166

క॥ కోపాటోపము సైపఁగ
నోపక యెలుగెత్తి పలుకు నోహోసప్త
ద్వీపాభ్యంతరవర్తిను
లీపాలకులార యుండుఁడీ హెచ్చరికన్. 167

ఉ॥ జనయిత్రిం దలఁద్రుంచి యెవ్వఁడు మహాక్షత్రాసృగాస్వాదకౌం
తిన దోస్సాయకుఠారధార ధరణిన్ నిఃక్షత్రియం జేసె న
వ్వనిబల్మీపులపుంటిగంటి నిపుడున్ రాలున్ మరాళచ్ఛలం
బునఁ గ్రౌంచాద్రికి నెమ్ము లమ్మునిమదింబూనెన్ బునఃక్రోధమున్.

సీ॥ అన రాముఁ డద్దిరా యయ్యకుసివ మెత్తె
ననినవ్వి యిట్లను నతనిఁ జూచి
బాలకేళిఁ బురారికేలివి ల్లవలీలఁ
జిదిమినబంట నే నెదుటనుండఁ
బటుభాషణములఁ జెంగటలేనిరాజుల
వెఱసింపనేల యో వెఱ్ఱితపసి
కృతవీర్యసుతమహోన్నతభుజాటవిఁ ద్రుంచి
ఫలితార్థమైన నీబాహు వెద్ది
గీ॥ పోరుఁగా కది నేఁడేమి కూరఁగోయఁ
బోయెనే యన ముని యోరితోయజాప్త
వంశపాంసన హరధనుర్ధ్వంసనంబు
మాటికిని బల్కెదేమిరా యోటలేక. 169

క॥ కటకట రాచకనీసపు
కొటికయుఁ గృతవీర్యసుతసమున్నతబాహా
పటలీపాటనపటిమో
గ్భటబాహువు నెసకఁ జూపెదవు పాపవిధీ. 170

క॥ అనుపమకోదండకళా
వినుతుఁడనగు నన్నువంటివీరున కకటా
మును వినని వినవలసెఁ
గననివి కనవలసె నేఁడు కాలముమహిమన్. 171

వ॥ అనిపలికి. 172

క॥ మఱియును నుతవృంగైదువు
నెర నది మునుగల్పి తోరిన్నపకీటము నా

నెఱసింగిణీ విలు తెఱఁగీ
వెఱుఁగుదు వెకదా యటంచు నిట్లనిపలికెన్, 173

మ॥ మొదలన్ మద్గురుహోమధేనువునకై మున్ గార్తవీర్యుండు దాఁ
జదువన్నేర్పు ననేక రాజకవధస్వాధ్యాయ మివ్వింటికిన్
మదీయ ద్రోహక్రమహాగ్ని మీయెడఁ గడున్ సామాన్యమయ్యెం బదిం
బదిగా నేఁసు వెలింగెదున్ గురుధనుర్భంగాజ్యధారాహుతిన్. 174

గీ॥ అనుఁడు రఘుసూతి వినుమో యి చెనటితపసి
పట్ట పసలేక పలువిచ్చి ప్రాతగిలిన
నీదుసత్రి పతాక వర్ణింపనేల
చూపుమా నేఁడు నీలావుఁజూడవలయు. 175

క॥ అని కినుకపొడమి రాముఁడు
తనతమ్ముని జూచి తెమ్ము ధనువన భృగునం
దనుఁ డొరి రాచవసుధా
తను వెఱుఁగక యొన్నియుఁ జెప్పు ప్రల్లదముల్. 176

ఉ॥ భావజసాహసంబు బహుభంగుల నెక్కుడ వీతసారమై
యావిలు మున్న నొచ్చినది యందుకు నీవు నిమిత్తమాత్ర మీ
కావర మేటికిన్ నృపతిఖండనచండమదీయసాధనం
బీవిలు దైత్యవైరి దిని యెక్కుడుమా భుజదర్పమేర్పడన్. 177

క॥ పాయక యావిల్లెక్కుడి
యీయెడ నన్నెదిరి తేని యిదె నూరు కుఠా
రాయుధ మున్నది హేతి మ
దీయమహాక్షత్రసత్రదీక్షావిదికిన్. 178

సీ॥ అని రాముచేతికి నమ్మహాకోదండ
మొసఁగినఁ గైకొని బిసరుహాప్త
వంశవతంస మవ్వాచంయమిస్వామిఁ
గాంచి యిచ్చోటు సంగ్రామమునకు
వలనుగా దలసముస్థలమున కేగుద
మనినఁ గోపంబునఁజనుచు మాని
సమధిక క్షాత్ర తేజంబున బ్రహ్మతే
జమునదర్పించు నోజనములార

గీ॥ మీరు నిఖిలాస్త్రశుభకరాశీరవముల
గావుఁ డేతత్కృతారార్తిఁగడపి ప్రోవుఁ
డదశరథము నరామంబు జననకంబుఁ
జేయుచున్నాఁడఁ గినిసి యాక్షితితలంబు. 179

వ॥ అని భృగునందనుండు రఘునందననమేతుండై సమరయోగ్యస
మస్థలంబునకుం జనినయనంతరంబ, 180

ఉ॥ కన్నియయొర్తు పన్నిదముగల్గునొ యిందుకునంచు తన్నతన్
మిన్నకచూచు సీతముఖనీరజపాండిమ యాకసంబునన్
వెన్నెలఁగాయఁ జక్రధరువిల్లరివోసి శరంబుఁగూర్చివి
చ్ఛిన్నముగాఁగఁజేసె రఘుసింహుఁడు భార్గవుదివ్యమార్గముల్. 181

గీ॥ పౌరు లప్పుడుమాంగల్యభాసమాన
వాద్యనినదం బొనర్చుచు వసుమతీసు
తావివాహోత్సవసమన్వితంబుగాఁగ
భార్గవజయోత్సవంబును బాడి రెలమి. 182

క॥ అంతవలె నేసిన పిమ్మటఁ
దటుకున దాశరథి జామదగ్న్యునితోడన్
ఘటితాంజలిపుటుఁడై యు
త్కటవినయధురీణుఁడగుచుఁ దానిట్లనియెన్. 183

మ॥ అనికిం బిల్చిన వైరికోటియెడ మా కస్త్రంబు శాస్త్రోక్తమై
చనినన్ విప్రులయం దనాయుధకళాజల్పాకులిక్ష్వాకు ల
జ్జనసంస్తుత్యుల పావనాన్వయమునన్ జన్మించియు న్నాకు దు
ర్వినయం బిట్లొదవెన్ సహింపుము తపోవిద్యానవద్యవ్రతా. 184

ఉ॥ నావుఁడు మౌనియిట్లనియె నవ్వుచు నీయెడఁ దప్పు లేదు వ
త్సా! వివరించెదన్ వినుము తావకవైష్ణవదివ్యతేజ మే
నీవిధిఁ జూడఁగోరి కనియించి తదున్నతిఁ గాంచి యద్భుతం
బావహిలంగ నిర్భరుఁడనైతి నొకింత హృదంతరంబునన్. 185

సీ॥ అన రాముఁ డనయంబు వినయంబు దళుకొత్త
మానిఁ గన్గొని యోమహానుభావ
యిటకు వేంచేయుఁ డింకిటకు వేంచేయుఁడు
నావుఁడు నతఁడు చిన్నారిముద్దు
గడ్డంబుఁ బుడుకుచుఁ గా రాదు మముబోటి
యారణ్యకులకు నోయన్న! తడవు
జనపదావాసంబు విను మట్లుగావునఁ
బోయివచ్చెద నుండఁ బోలదనిన.

గీ॥ తాటకారాతి వల్కె నోతాపసేంద్ర
పంక్తిరథుఁడును జనకభూపాలమణియు

యాజ్ఞవల్క్యాన మేతులై యల్ల వారె
యెదురుచూచుచున్న వా రెదుట మీకు. 186

సీ॥ అచటికే తెంచి వారిచే నర్ఘ్యపాద్య
ముఖ్యసముచిత సత్కారములను గాంచి
నెమ్మి నిక్ష్వాకుకులమును నిమికులంబు
పావనము సేయఁ డనిన నప్పారికాంక్షి. 18

వ॥ రఘునందనుం గనుంగొని యన్నా సకలజనమాన్యులగు నిట్టి రాజ
న్యుల యాతిథ్యకార్యం బపరిహార్యం బై నను వైఖానసోచితా
చారంబునకు దూరంబగు మత్పచారంబుకతన నిఖలధర్మాచార్యుం
డగు యాజ్ఞవల్క్యమునివర్యుననిధానంబునకు రా నాన యయ్యోను
నీయెడనయుండి మద్భావంబున నమ్మహానుభావు సేవింతునని పల్కి
యుచ్చైస్స్వరంబునం దత్సభాజనంబువిన నిట్లనియె. 188

సీ॥ అర్థి ధర్మార్థకామమోక్షార్థులైన
చతురు లేయోగిపతిమహాశ్రుతిఁబఠింతు
రట్టి యనవద్యవిద్యావిహారభూమి
యాజ్ఞవల్క్యయతిస్వామి నాశ్రయింతు. 189

వ॥ అని కృతాభివందనుండగు భృగునందనుంగుఱిచి నృపాస్థానాసనాసీ
నుండగు నయ్యోగి తుహినభానుం డిట్లనియె. 190

క॥ ఓయనఘ నీయఘంబుల్
గాయత్రీదేవియడఁచు నానామునిరా
డ్గేయములగు పవమానము
లేయెడ నీతపములకు నమృద్ధియొసంగున్. 191

గీ॥ అనుచు దీవింప భార్గవుఁడు తని కర్థి
నంజలిఘటించి యోగిశిఖావతంస
మిగులలజ్జించి యున్నాఁడ మిమ్ముఁజూడ
నాకనుజ్ఞయొ యిఁక నరణ్యమునకనిన. 192

మ॥ అగు నీకుఁ విజయంబు పొమ్ము ఖలగేహంబుల్ భవద్గేహముల్
సుగుణశ్రీమయమాళిమాల్యమగు దెచ్చో నీవు చూచోంట్లకున్
జగదుత్పాదనరక్షణప్రహరణేచ్ఛావిహారికిన్ శౌరికిన్
దగ నట్లాఅవమూర్తివై భృగుకులాంతర్మూర్తివై తీయెదన్. 193

వ॥ అనిపలుక్క యాజ్ఞవల్క్యచేత ననుజ్ఞాతుండై భృగువంశకేతుండు
లక్ష్మణభ్రాతంబేర్కొని వినీతిం జేరు నక్కుమారులం గ్రక్కున
నక్కునం జేర్చి యన్నా రాచమిన్న విరచితోద్వాహగేహమంగళా
చారుండై సీరధ్వజమహీధారుండు నిన్నుఁ బ్రతీక్షించుచున్నవాఁ
డన్న కేంద్రునభశ్వర్ణంబునకుఁ దూర్ణంబుగఁజనుమని వినిర్గమింపఁ
దన్మార్గభాగంబు సోద్వేగంబుగాఁ గొండొకతడవుప్రతీక్షించి యింక
నేను దాతిసన్నిధానంబునకరిగాదననుచుఁ జనుచున్నరఘుపుంగ
వుండు ముంగలనవలోకించి యారా మదీయజనకుండును జనకుం
డును నిచ్చటికే వచ్చుచున్నవారనుసంతేఁ గొంతయు తెంచి యతనిం
గాంచి యారాజన్యులనోన్యపరిరంభణంబులాచరించి రవు డమ్మి
థిలాధీశ్వరుం డుత్తర కోసలేశ్వరున కిట్లనియె. 194

గీ॥ జనపరోత్తమ నీపట్టి జామదగ్న్య
శరపరశ్వధగర్వనిర్భరనిసర్గ
జైత్రతేజంబు గయికొన్న చండ మింక
నాత్మఁజాయున భువి నైతిహాసికులకు. 195

క. అని యతఁడు నికటవరణిం
జనుదెంచు సుబాహుదైత్యసంవర్తకృతాం
తునిఁజూపి మదిఁ గుతూహల
మెనయఁగ నిట్లనియె దశరథేశ్వరుతోడన్. 196

సీ. జగదేకజీవాతువగు రాచమగటిమి
మగుడనిల్పిన మేటిమగఁడు వాఁడె
భార్గవీయభుజానివర్గగర్వోద్రేక
మఱఁగ రాచిన వీరవరుఁడు వాఁడె
వంశకర్తలలోన వనజాతవనబంధుఁ
గొనలకెక్కించిన ఘనుఁడు వాఁడె
వర్ణాశ్రమాచారనిర్ణేతయై ధాత్రిఁ
బాలింపఁదగు ధర్మపరుఁడు వాఁడె.

గీ. కేవనే తెంచి నేత్రరాజీవయుగళి
నమృతపూరంబుఁజల్లెడు నల్లవాఁడె
యఖిలకల్యాణగుణవైభవాభిరాము
రాము నీక్షించితే పంక్తిరథనృపాల. 197

గీ. అన నతఁడువల్కు మాలత్మజాగ్రజుండు
బాలుఁడయ్యును ధర్మసంశీలుఁడగుట
శరధిపరివేష్టితాఖండధరణిమండ
లాధిపత్యాభిషేకోత్సవార్హుఁ డనఘ. 198

వ. కావున

మ. ప్రకటంబైన జరాభరంబున వహింపఁగ రాని వర్ణాశ్రమా
ధికభారం బిక నీకుమారకునియందే నిల్పి యున్నద్దిలీ

సకులాచారము పేర్మిమై ననుభవింపంగోరియున్నాఁడనే
నొకసిద్ధాశ్రమసీమ మానినయి యాయుశ్శేషమున్ మైథిలా. 199

గీ॥ అనుఁడు జనకుండు బళి దశస్యందనా! త్వ
దీయహృదయంబు మిక్కిలి దేశకాల
భాగవిజ్ఞాని గాదె నీపలికినట్టి
దారి క్రమముగ నడవంగఁదగిన దనఘ. 200

క॥ అని వా రన్యోన్యము ముద
మొనయఁగ భాషించుతఱిని సిద్ధచరిత్రుం
డనఘుఁడు రఘురాముం డట
చనుదెంచి వినీతి నతులుసల్పెనఁ గూర్మిన్. 201

క॥ వారిరువురు రఘుపుంగవు
రారమ్మనికౌగిలించి ప్రకటానందాం
భోరాశిఁ దేలి రయ్యెడ
సారమతిం దశరథుండు జనకునకనియెన్. 202

ఉ॥ ఓమిథిలేంద్ర రాముఁ బ్రమదోన్నతిచేనభిషిక్తుఁ జేయ శ్రే
యోమహితంబు భార్గవజయోత్సవకాలము నేఁడుయోగ్యమా
నే మిట నాలసించుటకు హేతువటంచును బల్కుచో గుణ
స్థేముఁడు లక్ష్మణుండరుగుదెంచి నమస్కృతిఁజేసి యిట్లనున్. 203

గీ॥ అయ్య నేఁ డిదె మామధ్యమాంబ లేఖ
పంపె మంథరచేనంచుఁ బలుకఁ బంక్తి
రథుఁడు జనకుండు మదినిబ్బరంబుఁ జెంది
రొండొరుల మోమువీక్షించి యుల్లములను. 204

శా॥ ఏమో యంచుఁ దలంచుచుండఁ బ్రమదం బేపారఁగా రాముఁ డో
సౌమిత్రీ మనయంబకున్ హితవయస్యాశ్రేణి యుక్తంబుగా
క్షేమంబే యని నీకు మంథరయెఱింగించెఁగదా నాఁడు పా
నామాడ్కిన్ వచియించె నన్నయెడ సుదత్ప్రీతిమై నిట్లనున్. 205

గీ॥ సిద్ధ మస్మత్ప్రవాస చాశ్చిత్త్యమంబ
సకల పీడించుననిపల్కు నవసరమున
జనకుఁ డాలేఖఁ గైకొని జనములెల్ల
నాలకింపుచునుండ నిట్లనుచుఁ జదివె. 206

సీ॥ శ్రీమదఖండధాత్రీమహామండలే
శ్వరులైన దశరథేశ్వరులదివ్య
పాదపద్మములకు భక్తిమైఁ గేకయ
విభుతనూభవ సేయువిన్నపంబు
స్వామి దేవాసురసంగరభూమి ము
న్నంగీకరించినయట్టివరము
లవి రెండు నిప్పు డీనడిగెద భరతు న
శేషసామ్రాజ్యభిషిక్తుఁ జేసి

గీ॥ లక్ష్మణునిగూడి జానకీలలనతోడఁ
దాపసాకృతిఁబూని పద్నాలుగేండ్లు
దండకాటవి రఘురాము నుండఁబనిచి
నన్ను మన్నింపుఁ డింతయువిన్నపంబు. 207

వ॥ అనిపఠించి. 208

చ॥ అతిముఱి గుండె బగ్గురన నమ్మిథిలేశుఁడు కంపితాంగుఁడై
కలఁచినచిల్వనుంబలెను గమ్మ కడంబడఁ జిమ్మ కన్నులం

దఱచుగ నశ్రుబిందువులుదొర్లఁగఁగా నిలు పోపలేక యు
స్సుఱుమని మైఁజెమర్పఁ గనుఁబ్రుక్కుచు మూర్ఛిలి వ్రాలె ధారుణిన్

ఉ॥ అత్తఱిఁ బత్రిశార్ఙ్గకశిలాశని కర్ణగుహాళి వడింబడం
జిత్తమృగేంద్ర మిట్టునటు కుందఱవందఱయై చలింపఁగా
నుత్తరకోసలక్షితిభృదుత్తముఁ డుగ్ర నయనాశ్రునిర్ఝరుల్
మొత్తముగాఁగఁ బర్వఁ బెనుమూర్ఛ ధరాస్థలి వ్రాలె నంతయున్.

సీ॥ చటులహాలాహలచిటచిటాత్కృతి విని
మైమఱచిన ధాతృమఘవులనఁగఁ
గల్పాంతభైరవకహకహాత్కృతి విని
ధరఁ ద్రెళ్లు మేరుమందరములనగఁ
బతగసామ్రాడ్గరుత్పటపటాత్కృతి విని
సురిగిన శేషవాసుకులనంగ
నున్నిద్రశరభకంఠోద్ధహాహాత్కృతి
విని సొమ్మసిలు రవివిధులనంగ

గీ॥ నటుల దుర్వార్త వీనులనంటి కొంటి
ప్రకటమూర్ఛాంధకారనిర్మగ్నులైన
జనకదశరథధారుణీశ్వరుల శ్రమము
శైత్యకృత్యంబులను రామచంద్రుఁ డణఁచె. 211

వ॥ అప్పు డక్కొమ్మ నెమ్మొగమ్మునఁ గనుదమ్ముల నొత్తుక యు
త్తమాంగంబు నేర్చికొని యమందానందంబున సుమిత్రానంద
నుంగనుఁగొని యన్న లక్ష్మణ శుభలక్షణాఢ్యయు నవోఢానిజ
న్మయు నస్మదారాధవసబ్రహ్మచారిణియు నగు మీవదినెం ద
రలించుక గమనోచితోద్యోగంబున నతివేగంబునఁ బురోభాగం

బునవసియించియుండు మని నియోగించిన వతం డోకించుకొని యుఁ బ్రతిసెప్పక యప్పలుకంగీకరించి గుప్పునంజనియె నంత న మ్మిథిలాకాంతుం డెట్టకేలకునిట్టూర్పునిగుడించి కేకయనంద నందలంచి యిట్లనియె. 212

సీ॥ త్రిభువనఖ్యాతకీర్తికలాపుఁడైన కే
కయచక్రవర్తి నీ కన్నతండ్రి
యఖిలలోకారాధ్యుఁడై తనర్చిన కైర
వారి నీ శ్వశురాన్వయంబుకర్త
యఖిలయాతినృపసేవితాంఘ్రిసరోజుఁడై
యలరిన యజుఁడు నీ యనుగుమామ
శక్రాభివర్ణితవిక్రమక్రముఁడైన
పంక్తిరథుండు నీ ప్రాణభర్త

గీ॥ యట్టి నీ కిపు డయ్యెనో యద్భుతముగ
సకలరాజపురంధ్రికాజనవినింద్య
మైన దుస్తరనాథదుఃఖావలోక
దురిత ముసిగట్ట నిటు లేలతోఁచె నకట. 213

వ॥ అని సోపాలంభంబుగాఁబలికె నప్పు డప్పంక్తిరథుం డోక్కృంచు కనేదదేరి హా యని రామునకిట్లనియె. 214

గీ॥ దారుణావాచ్యదుస్తరదాహమోహ
మసుమనోభావవిషయమై మాకుఁ జాలఁ
బ్రాప్తమైనది దుఃఖానుభవము తనయ
యిట్టిమముఁ బాసిపో నుత్సహింపఁ దగవె. 215

గీ॥ అనుచుఁ గొండొకతలపోసి యవనిపుత్రిఁ
దలఁచి హా సీత! జానకీ! దనుజకోటి
కాతిథేయీభావించుట కకట నేఁడు
నీవు నాయిల్లుసొచ్చితే దైవవశత. 216

క॥ అన నంత జనకభూపతి
కనలుచు నాసమ్ముఁజూచి కైకేయి బలి
పనిమిటియనుసరణము నా
తనయకుఁ గృపసేసి తనుమఁడానిట్లనియెఁ. 217

సీ॥ ఆంధ్రదేశములు నిశాన్యశాఖానంద
చండవిక్రమమున మండుచుండు
నీరామలక్ష్మణు లిషుచాపపాణులు
కానఁ గయ్యము తనుదాన కలుగు
నావనభూములు పార్శ్వతుషారాల
దుర్వారసంచారదుస్తరంబు
లీధరానందన యెంతయు ముద్దరాల్
బాల గావున భయభ్రాంతినొందు

గీ॥ వకట నీమాట నీయకృత్యంబు సేసి
దశరథుంకు నిజాపవాదంబు గడిగి
కొనుచు ముక్తానుఁడగును నీకులమువారి
యపయశం బింక నేమిట నణఁగునొక్కొ. 218

వ॥ అదియునుంగాక. 219

గీ॥ భరతరాజ్యరమాకర్ణపటుతమాల
కిసలయం బైన నీయపకీర్తి దిక్కు

లందుఁ బ్రబలంగ మాకైన నరయఁ దరమె
యకట తలమెత్తి లోకుల యాననములు. 220

క॥ అనుడంత రాముఁడిట్లను
జనకునితో మద్గురుండు స్వస్థుండైయుం
డె ననుచు నే వినునట్లుగ
ననఘా నడిపింపవలయు నని యుక్తిజ్ఞుఁడై. 221

ఉ॥ వారలకుం బ్రదక్షిణమువచ్చి నమస్కృతిఁజేసి సమ్మదో
దారమనస్కుఁడై మహీసుతన్ మఱి లక్ష్మణుఁ గూడి వెంబడిం
జారులు మంత్రులున్ హితులు బాంధవులుం దనుబాయలేక బల్
గారవమొప్ప నిల్వఁడనఁగా నరుదేరఁ బురంబువెల్వడెన్. 222

ఉ॥ అంతట లేచి పంక్తిరథుఁ డన్న రఘూత్తమ నిన్నుఁబాయలే
నెంతయుఁ బ్రాణముల్ నిలువ వేగతి నోర్చెద నిందు రావె నా
చింతలువంతలుం దొలఁగఁజేయవె యంచును బల్ రవంబుతో
నంతిపురంబు సేర మిథిలాధిపుఁ డాతని నూరడింపఁగన్. 223

మ॥ అణిమాదీశ్వరశౌర! తారశరనీహారప్రభాకార! కా
రణనిర్ముక్తవిహార! హారదురగప్రాంచద్భుజోదార! దా
రణఘోరాసురమార! శారదఘనారంభాతిదుర్వార! వా
రణజిద్దోస్సహకార! శారదమరుప్రధ్వానదీర్ణాంబరా. 224

క॥ కాండాఖండపిచండా
చండాంశుసహస్రధామచణదోర్దండా
దండాయుధమదఖండా
ఖండాబ్జయుతోత్తమాంగగంగాకాండా. 225

మాలిని॥ మథితదనుజగోత్రా మందిరద్రూపగోత్రా
విధు రవి శిఖి నేత్రా విస్ఫురచ్చర్మనేత్రా
బుధసరసిజమిత్రా భోగిపర్యంకమిత్రా
ప్రథితగుణపవిత్రా పాపవల్లీలవిత్రా. 226

గద్య॥ ఇది శ్రీమద్రామేశ్వరశాశ్వతకృపాకటాక్షవీక్షణసమాసాదిత
సకలసామ్రాజ్యధౌరేయాక్రాంతనిక్షణనావధీరిత రాధేయ
బిజ్జలకులకలశనిధానకార్త్తికీనిశాకళత్ర వెన్నూళగోత్రప
విత్ర కృష్ణరాయమహీధవకుమార సంగరాంగ
ణకుమార దయాగుణగోపాల తిమ్మభూ
పాలప్రణీతంబైన యనర్ఘరాఘ
వంబనుమహాకావ్యంబునందు
తృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీహయగ్రీవాయనమః

# ※ అనర్ఘరాఘవము ※

## చతుర్థాశ్వాసము.

శ్రీరామేశ! రమేశాం
భోరుహసంభవ సురేశముఖ దివిజమన
స్సారసనివేశ! కేశవ
పారాశాశావకాశ ప్రాకటయశా॥ 1

వ॥ అవధరింపు మాసమయంబున జాంబవత్ప్రేషిత పూర్వమైన, శ్రమ
ణ మిథిలాపురవృత్తాంతం బాద్యంతంబుగా నెఱింగి క్రమ్మఱి యతని
పాలికివచ్చి సంభాషించుచు నిట్లనియె 2

సీ॥ అంతట జనకధరాధీశు నగరంబు
వెడలి నే మంథరయొడలు విసిచి
పవనతనూజగోపాయితంబైనట్టి
యాత్మదేహము నప్పటట్లతాల్చి
గంగాతరంగిణిఁ గడచి సత్వరగతి
శృంగిబేరపురంబుఁ జేరియున్న
యంత నావెంటనే యలవాఁగె రాఘవు
లిడె సీత యనువార్త లెల్లదెసలఁ

గీ॥ తెలఁగ గుహుఁ డంతలో నన్నుఁ జేరవచ్చి
రామలక్ష్మణులనఁగ నొప్పారు వీర
లెవ్వరిది నాకునెఱిఁగింపవే యటన్న
నించువేడుక నతనితో నిట్టులంటి. 4

చ॥ ఘనముగ నెమ్మదిన్ సుతులఁ గాంచఁగ ముచ్చటనొంది ఋశ్యశృం
గునిఁ దగ వేఁడ నాతని యనుగ్రహశక్తి రమాధవాంశులం
దనయుల నల్వురం గనియె ధన్యుఁడు పంక్తిరథుండు వారిలో
ననఘగుణాభిరాముఁ డితఁ డాద్యుఁ డతండు తృతీయుఁ డెన్నఁగన్

గీ॥ అనుచు వచియింప నాభల్లుకాధినాథుఁ
డాత్మ నలరుచు మీఁద నేమాయెననిన
శ్రమణ యతనికిఁ గర్ణరసాయనముగ
ననుపమోజ్జ్వలఫణితి నిట్లనుఁ బలికె. 5

క॥ కుతుకాగత బాంధవసం
తతి నుదకాంతముగ ననిచి దశరథసూనుం
డతిభక్తిఁ గుహునకు గొనిరా
నతులితగతి నోడయెక్కె హర్షోజ్జ్వలుఁడై 6

శా॥ శామాద్రిప్రియమాళిమాల్యముగు గంగం దాటి యానావికున్.
సౌమిత్రిప్రియబంధుతా దరముచే సంప్రీతుఁ గావించుచున్
వ్యాఘ్రగ్రావ్యాకులాలవల్ శబరకాంతల్ వేడ్కఁజూపువెంటరాఁ
క్షేమం జేరెను చిత్రకూటము మృగాళీలోజ్జ్వలత్కూటమున్. 7

గీ॥ అనిన విని జాంబవంతుఁ డాహా యిదెంత
కరుణ మొనఁగూడెనన నందుకతనఁగాదె

దాచిపల్కితి నింగుదీతరుతలమున
జడలు వారలు దాల్చుట నుడువలేక. 8

ఉ॥ నా వతఁ డక్కుమారుల కనారతదైవబలంబుకల్మి నో
మానిని మీఁద వంతయుఁ గ్రమంబున మేలగు నంచుఁ బల్కఁగా
నావలినాఁడె వల్కె వినయంబుఘటిల్లఁగ గొన్నినాళ్ళ నే
నానికటంబునందె గుహునానతి మీఁటక యుంటి నెంతయున్. 9

వ॥ అంతఁ గొంతకాలంబునకు భరతుండు ప్రకృతి పౌరజానపదసహి
తుండై దశస్యందనస్వర్గాధిరోహణవార్త యగ్రజన్మున కెఱింగించి
యయోధ్యానగరంబునకుఁ దోడ్తెత్తునని యమ్మార్గంబునఁ జిత్ర
కూటాచలంబున కేతెంచి. 10

సీ॥ రఘురాముఁ జూచి నేత్రజలప్రవాహముల్
గుఱియఁ బాదంబుల కెఱఁగి కొంత
తడవున కయ్యుదంతము గద్గదస్వర
మున నెఱిఁగింప రాముఁడును శోక
మూర్ఛితుఁడై ధైర్యమున నంతఁ దెలివొంద
నో రఘూత్తమ రాఘవులభరంబు
భరియింప నింక నెవ్వరుదిక్కు మీ రయో
ధ్యకువచ్చి ప్రజలసంతాపభరముఁ

గీ॥ బాపవలె నని ప్రేమానుబంధ మలర
మాటికినిబల్కు తమ్మునిమమత జూచి
యలరి యమాయాన నీకు నేపనిన నింకఁ
దండ్రియానతి జవదాటఁదగునె మాకుఁ 11

కం॥ కావున నీవును దశరథ
భూవరుచందమునఁ బ్రజలఁ బోషింపుచు నిం
తే విభవ మలఁగ నీతిం
గావింపుము రాజ్యపాలకత్వము ననఘా. 12

గీ॥ అనుచు నూఱడించి యనిపిన భరతుఁడు
జడలు దాల్చి రామచంద్ర విభుని
పాదుకాద్వయంబు భయభక్తి శరభంగ
మునివరుండు వనుప ముదముమీఱ. 13

కం॥ అందుకొని కన్నుఁగవ నా
నందంబున నొత్తుకొనుచు నవమణిపీఠిన్
జెందించి ప్రజలఁ బ్రోచుచు
నందిగ్రామమున నుండె నయ మలరంగన్. 14

కం॥ అనిన విని జాంబవంతుఁడు
మనమున సంతసమునొంది మనకోర్కి ఫలిం
చెను మీకు సిద్ధి యోమన
ననుపమమృదువచనరచన నది యిట్లనియెన్. 15

ఉ॥ అంత ఖరాదిరాత్రిచరు లాత్మఁ జెలంగి పితృవ్యథాసమా
క్రాంతుఁడు సూతకుండు నగు రాఘవుఁ డస్త్రపరిగ్రహంబు దా
నెంగయఁ జేయఁ డిట్టితఱి నేపనిఁ బూనిన నౌనటంచు దు
ర్దాంతపరాక్రముం డగు విరాధనిశాచరుఁ బంపి రంచనన్. 16

గీ॥ కటకటా బుద్ధిశూన్యులుగాదె దనుజు
లేటి సూతక మొకకార్య మెదిరినపుడు

కాళుల కటంచు భల్లూకరాజు వలికి
యంత నేమాయె ననిన నయ్యలరుఁబోఁడి, 17

క॥ అంత విరాధుని రాఘవు
డంతకపురి కనిచి సంభ్రమాతిశయం బా
త్మాంతరమునఁ బెనఁగొన న
త్యంతత్వర నుత్తరక్రియలు దీర్చెఁదగన్. 18

వ॥ తదనంతరంబ. 19

సీ॥ దురవగాహాగభీరతర చతుఃపాథోధి
ముష్టింధయుం డయి మునయు మేటి
వికటదురాలోక వింధ్యభూధరచాప
లారంభఘాతియై యలరు దిట్ట
వాతాపిదానవావార్య నిద్రాపూర్ణ
మంగళకలశమై మనినదంట
యంభోజ సంభవ జంభారిముఖ నిర్జ
రస్తుత ప్రతిభచేఁ బ్రబలు జాణ.

గీ॥ యల యగస్త్యతపోనిధితిలక మతని
యాశ్రమంబున నున్నంత యటకు వచ్చి
యకట ధారాధరాఖ్యవాయసవిభుండు
నిబిడ గర్వాంధకారంబు నిండికొనఁగ 20

ఉ॥ కన దసురాభిచారచరు కాంచనకుంభమనంగఁ బొల్చు భూ
తనయకుచంబు ద్రొక్కికొనఁ బిద్దయుఁ జీరలువారఁ జేర వ
చ్చనికి సహింప కారఘునృపాలుఁడు వాని నిషీక మేసి నే
ర్పున నయనాంధుఁ జేసె రఘుపుంగవు గాండము రిత్తవోవునే. 21

వ॥ అనిన జాంబవంతుడు విస్మయాయత్తచిత్తుండై యవ్వాలిశరథ యుదు
గ, నవ్వారారోహ యిట్లనియె 22

క॥ క్రమమున సుతీక్ష్ణముఖ్యుల
యమిచంద్రులఁ గాంచి వార లనుప నగస్త్యా
నుమతిఁ రఘురాముఁడు సం
భ్రమమునఁ బంచవటి నుండె మానులుచెలగ౯. 23

మ॥ అనినఁ భల్లుకసార్వభౌముఁడు బ్రహ్మాత్యంతపూజ్యాగ్రజుం
చనుఁడై యట్లనయేని మేలగు జనస్థానోర్వి కిం బుణ్యమా
కనగంబుం దవు లేదు చేసెడి యనం గంజాక్ష నీ విప్పుడు౯
వినకున్నాఁడవె యొక్కవార్త యని యెంతే వేడ్కఁ దానిట్లను౯.

సీ॥ వినుము జనస్థానమున నుండి యొకనాడు పాపాత్మురాలైన
శూర్పణఖ యచటి
కేతెంచి రఘురాము నీక్షించి మోహిత
యై మోసవుచ్చెద ననెడు వేడ్క
వర్తింప నారఘూద్వహుఁ డుపేక్షాబుద్ధి
గనుఁగొన దాని లక్ష్మణుఁడెలింగి
ముక్కులుఁ జెవులుగమ్మాని యుఁగోసి యా
హుతులుగాఁ గ్రోధాగ్ని నొనరవేల్చె.

గీ॥ ననిన వినిజాంబవంతుఁ డత్యలఘుభీతి
బాల యిదిచాల చేటుకు మూలమింత
గాసినొందిన యనుజాత గాంచి యిప్పు
డహహ ఖరదూషణాదులే మాదురొక్కొ. 25

క॥ అనవిని యంగదనవ్వుచు
వనియెఁ రఘురాముఁ డాహావావని నిలుచే
కొని నిలిచిన ఖరదూషణ
దనుజులమూటడుగ నింకఁ దావున్నదియే. 26

మ॥ అటులైనన్ దివిజేంద్రసూనునకు సాహాయ్యంబుగా వచ్చి యు
ద్భటులై తాము విరాధుత్రోవనె చనం బాల్పడ్డవారంచు ను
త్కటహర్షంబున భల్లుకుండు నగి యక్కంజాక్షితోఁ బల్కె ని
క్కటమై రాఘవరావణాదులకుఁ జేకూడుఁ విరోధం బికన్. 27

చ॥ అనవిని యావధూటి దరహాసము మోమున నంకురింపగా
ననియె ఖరాదిదానవులయాపద దావచియింపఁ బోయి మా
ర్పణఖ మృదూక్తిలంపటుల పాలుగఁ జేయదుకార్య మంతయున్.
దనదునిరతుం రాస్యమె తుదన్ వినిపించు సురారి కెంతయున్. 28

వ॥ అనినవిని జాంబవంతుడు మందస్మితసుందరవదనారవిందుండై యతి
లఘూత్థానం బగు నీయర్థవిధానంబు మనంబునం దలంప నద్భు
తం బయ్యెడు నని మఱియు నావధూటితో నిట్లనియె. 29

మ॥ అల గాధేయమఖాదిగా నగు ససూయం బూని దేశజ్ఞులన్
బలవంతుడు ద్రిశక్తి సంయుతుడు నున్మత్తుండునై ఖ్యాతి వ
ర్తిలు లంకేశ్వరు డెట్లుసైచునొ ఖరాదిచ్ఛేదనా కర్ణనా
కులతన్ శూర్పణఖానికారమును గన్గొనైన రోషంబునన్. 30

గీ॥ మెల్లమెల్లనె కలహంబు మించివచ్చె
గాక ననహాయు డగుచు రాఘవుడు సూర్య
సూనుతో సంధిఁ జేయుంగ జూచు నింక
నవిన యాభల్లుకుని జూచి హర్ష మొనవ 30

క॥ వినుమింకఁ గార్గ్యమౌనిగా
డును మత్ప్రియశిష్యపుత్రుడు గుహాలుం డనువా
డనఁగఁ జెలి లక్ష్మనునకా
తనిచే మనకిప్పు డనుచుఁ దరుణి వచింపన్. 31

గీ॥ జాంబవంతుండు విని దానిచతురవచన
రచన కలరుచు ననియెనో రమణినీవు
వనజహితసూతిపతిపాతినివిగాన
నతని నిటకిప్పుడనుపుమా యనిన జనియే 32

వ॥ అంత జాంబవంతుడు నలుదెసలుం జూచి యీరా సుకృత పరి
పాకవర్థిత చిరాయువగు జటాయువు మత్ప్రాణబంధుండు గావున
దక్షిణాశాముఖంబున నిట కేతెంచుచున్నవాడు గృధ్రంబులు
దూరదృష్టులుగావున నౌకానౌకభంగి సీలంకాద్వీపవృత్తాంతంబుఁ
దెలియకుండం జేను నచటికిం బోయి యాయుదంతవిశేషం బశేషం
బుగాఁ దెలియదు నను నంత నతండు ప్రవేశించి పంచవటిం జేరి
నట్లు నామనంబున నిశ్చయించితి గోదావరీతీరతరంగ సేక సుకుమార
మాంసళపరిసరారణ్యభూము లగు జనస్థానసీమలం గనుంగొంటె
నని యిట్లనియె. 33

మ॥ వల నొప్పన్ మధుమత్తకోకిల వధూవ్యాధూతచూతాంకురో
జ్వలదాకీర్ణ లతాంత రేణుసితతాజాలాతి దుష్ప్రాపక
స్థలులన్ లుబ్ధజసాధ్వసంబున మృగీసంఘుంబు లంఘించి త
త్కలితాసారపరాగలు ప్తపదవిం దానుండె నిశ్శంకతన్. 34

గీ॥ అనచు బలుకుచుండ నట గొంత దవ్వు దా
నేగి రామహాత్మ యిప్పు డింత

వేగ మెచటనుండి విచ్చేసినా రన
వతనితో జటాయు వనియె నపుడు. 35

సీ॥ వింధ్యశైలమునందు విహరించు మాయన్న
సంపాతి ఖగనాథు సంభ్రమమున
దర్శించి వచ్చుచో దశకంఠుఁడివ్వని
నీచుడై నట్టి మారీచుఁ గూడి
విహరింప నియ్యది విషమకార్యంబని
ప్రాణబంధువుడైన పంక్తిరథుని
తనయున కెఱిఁగింపఁ జనుచున్న వాడనే
నటుగాన నిలిచి మాటాడఁగూడ.

గీ॥ దనఘ నామీఁదదయయుంచి యనుపు మనిన
నలరి నేఁ గోరినట్టి కార్యమె యితండు
సేయఁబూననటంచు యోజించియతడు
మమత నాతని ననిపి తా మరలి చనియె. 36

వ॥ అంతఁ గొంతదూరం బాకసంతంబు చనిచని సకలమునిజనాకీర్ణంబగు పంచవటాభ్యర్ణంబుఁ జేరి సవితర్కంబుగా నిట్లనియె. 37

చ॥ కనకమృగంబు మాడ్కి దశకంఠుని నచ్చెలి రాము దూరముం
గొనిచన లక్ష్మణుండు కడుఁగోపమునం దెనువెంట నేగ ని
ద్దనుజవిభుండు భిక్షుకవిధంబున భీతిని బర్ణశాలకుం
జని తన తొంటిరూపునను జానకిచెంగట నిల్చె గొబ్బునన్. 38

క॥ హానాథ నాథ యనుచుం
దీనతమై గురలివోలె జెగి మొఱవెట్టన్

జానకి రథమున నిడికొని
యీనీచుం డెందుబోవ నెన దలచె నొకో 39

వ॥ అని యాటోపంబున. 40

మ॥ అరె రోకోరి దశాస్య మూఢమతివై మైథిల్యకు దేవేరి కి
యదవన్నీవు కరాభిమర్శమలినత్వాపాదివై సంతసి
ల్లెదుగా యార్యుల నావుల స్త్వన్ముఖులఁ లెక్కింపవై తీద్వ్వారఁ
మది నయోధ్య యన రావణుంకు వలికెం బక్షీంద్రుఁ డాలింపఁగఁ.

క॥ భువనవిమోహన భూసం
భవయను నామిషము గొన్న మాంసాశకరముల్
చివుకున ముదిగృధ్రము గొని
దవుఁజనునో యనిన నతఁడు దనుజున కనియెన్. 42

గీ॥ ఓరియేమంటి వేమంటి వోరి దాన
వాన్వయాధమ మిథ్యాట్టహాసధామ
ధూసరిత వక్త్రివల్మీక దుష్టచరిత
యడరిపోఁబోకు నిలునిలు మనుచు మఱియు. 43

శా॥ ఓరా! యూరక బాహుసత్త్వ ముడివో నంధత్వముం జెందుచుం
బోరా! రమ్మనఁ బారిపోయెదవు నీ క్రూరక్రియల్ గాల్పనా
క్రూరోదగ్రనఖాంచలంబులను నీ యొమ్ముల్ల ద్రవ్వఁగ మహో
వీరుండైన జటాయు వంచు దివిజద్వేషిన్ వడిన్ దాకగన్. 44

వ॥ వారి కిర్వ్వురకు బెద్దప్రొద్దు ఘోరాఘోరం బోరాటంబు జరిగి
యుండ పక్షిరాజు వలన విఘటిత తురంగశతాంగుండును విదారిత

పక్షములకుంఠునునై యారావణుండాగ్రహంబున నిజచంద్రహాసం
బున నావృద్ధగృధ్రేశు పక్షమూలంబు ఛేదించి సీతంగొని వెడలి
పోయె. 45

వ॥ తదనంతరంబ సుమిత్రాసూనుం డచటి కేతెంచి దుర్వారదారుణ
క్రోధశోకలజ్జాభరంబుల దుస్తరంబగునవస్థ పొడమె నిందున
కెద్దిసేయ నుద్యోగించుటకు నుపాయంబు దొరకదని చింతింపుచు
రామునాలోకించి తనలో నిట్లనియె. 46

మ॥ అలలంకాధిపువంచనం బొడము రోషాక్రాంతి ధూమాయితా
నలతుల్యుండయి లీనవర్ణ సరణిం దార్కొన్న యర్థోక్తులం
బలుకన్ సైపని రాముస్ఫృష్టి ఖగరాట్పంచత్వ జామర్షని
ర్దళితాఘోత్కట జాడ్యుడై నిలిచె కోదండంబుపై మిక్కిలిన్. 47

వ॥ అని మఱియుఁ దదభిముఖంబుగాఁ జని యార్య! మారీచమథన
సమీపంబునకు రమ్ము రమ్ము పదమట వింధ్యవనీవీథులం గనుం
గొను మనిన రాముం డాకాశభాషణంబుగా నిట్లనియె. 48

చ॥ భుజబలవంశవిక్రమ తపోమహిమంబుల నీకునారయన్
విజనులు దీటుగా రటుల వీరుడవై తనరారి వంచనా
వృజిన విహారివాట తగవే యిదిశూరులక్రోవయాన య
క్కజముగ నెట్లునిన్నలమె గాధతమం బకటా దశాననా. 49

వ॥ అని యించుక విచారించి సఖేదస్మితంబుగా వెండియు. 50

చ॥ మనుమడ శైనసీకథలు మాటికి సిద్ధులుఁ జెల్పఁ దాలనై
తనరు పులస్త్య దొక్కరుడు దక్క నురక్షులు నవ్వుచుండగా

గనిన విధాత నాలుగు మొగంబులు నొక్కట వంపరాని ద
న్నెనసినలజ్జ న్యూనత వహింపుచు నేమగునో దశాననా. 51

క॥ అనిరాము డాత్మఁజింతిలి
జనకజ హా యనుచు ధైర్యసంపదచేతన్
మనమునఁ గలఁగగ లక్ష్మణు
డనియెన్ మిమువంటివారి కగునే యిటులన్. 52

గీ॥ దారుణాపత్పరంపర దైవవశత
జెందునప్పుడు శూరుల చిత్తవృత్తు
లతులవజ్రోపమాన ధైర్యముల పేరి
జోడు నొనగూర్చుఁ దమకు నస్తోకలీల. 53

చ॥ అనవిని రాముఁ డుస్సురని యూరసి లక్ష్మణుఁ జారుధైర్యవ
ర్తనమునఁ జెప్పినట్లు సరితంబు మొఱంగ నమర్ష శోకముల్
మనమున నిల్పినాఁడ నిక లజ్జయున న్మతి నన్ను మీఱిపో
యినయది యేమి సేతు నిక నేమని పల్కుదు నన్న నావుడున్. 54

క॥ కనుఁగొనుము జటాయువునకు
ఘనశాశ్వత వీరలోకగమనాంచితసా
ధనసిద్ధక్షేత్రంబగు
వనవాటిక నెదుట రాఘువా! యని మఱియున్. 55

క॥ ఇట రావణుచే నిదె భూ
తలమునఁ బడియున్న దార్యశాలి జటాయు
స్ఫుటవజ్రాంకురతుల్యో
ద్భట నఖచంచూవిలూనబంధన మగుచున్. 56

గీ॥ అనిన రాముఁడు కరుణ నిట్లనియె నపుడు
ఖగరాపుత్రి కక్షుధన్యత్వైన నీకు
రావణేభశిరస్సంచరన్మృగేంద్ర
మైన తనర్చు జటాయువు వరయ గలిగె. 57

చ॥ అని తన నూతఁ గాఁగొనుచు ధ్యానముసేయు రఘూద్వహుం గనుం
గొని మదిలోన లక్ష్మణుఁ డకుంఠితరోషము మానసంబు నొం
దినదయి మీాతె దుఃఖవితతిన్ మఱి కావున నన్యమందు నే
నునిచెద నీమనీషనని యూహయొనర్చుచు నన్నకిట్లనున్. 58

గీ॥ ప్రబ్బుపొదదాకు చవ్వాళ్ళ బరగి పుల్లు
రొదల విలసిల్లి ఖిక్కిలిగ జలుచున్న
కాండములచేతఁ జార్వత్రిక గుణమికను
బూను వింధ్యకుభృత్కన్యలైననదులు. 59

వ॥ అనివిని రాఘవుండు నిట్టూర్పునిగుడించి కనుఁదమ్ములు దెఱచి
యిట్లనియె 60

చ॥ కలువగముల్ విశాయగతిగాంచగ మేల్కనియుండు వజ్జముల్
బలువిడి యామికావళివిలాసమునూపగ నీనగేంద్రక
న్యలు నదు లెంతయుందనరె నా మదవారణకర్ణతాళముల్
చెలగఁగ సారగేకలిడ లీల నటించు మయూరసంతతిన్. 61

క॥ అనికొంతదూర మరుగగ
ననుజుఁడు రాఘవునిఁగోడ నపుడిట్లనియెన్
గనుగొను మనఘా ! యిదిగో
ఘనతరమగు మాల్యవన్నగంబని మఱియున్. 62

మ॥ ఎనుఁబోతుల్ గొనగొమ్ములం బొడువ నట్టిట్లైనతాల్ జాఱను
ర్లిన రోహిత్తులగర్భముల్ దటుకునన్ బ్రేలంగ గుహాశ్రేణులం
దనువర్తించు మదాచ్ఛభల్లతతిహాక్కారావ మాలించి భీ
తినిఁ జెందుంగొమ లద్రుములే విడుతు రెంతే యివ్వనాంతంబునన్.

వ॥ అంత రామచంద్రుండు సకరుణాస్వంబుగా 64

సీ॥ బర్హిపుంజాకర ప్రతిపరిసరమున
గుదిగొన్న గండు కుమ్మెదలచేత
ననుభవింపఁగబడు వతులసౌరభ్య
విభవము విభాసుర కదంబములచేత
ఘనములై కనుపట్టు కటకభాగంబులఁ
గడుమించు నీల మేఘములచేత
వర్ణింపబడు భోగివనితాళినవగర్భ
ధారణప్రియకారి వారిచేత.
వివిధశృంగారములచేత వెలయుచున్న
మాల్యవద్ధారణీధరమహిమ గనిన
నాశరీరంబు భారమై నాకుఁదోఁచె
నకట లక్ష్మణయూతి యా మ్మనుచు మఱియు. . 65

సీ॥ అలసటచేత్రాలు నవయవంబులచేత
వసివాడు నెమ్మోము రసిమిచేత
నుదవెడు వేడి నిట్టూర్పు గాడ్పులచేత
నలమినయట్టి జాడ్యంబుచేత
సంభ్రమనిరుద్ధ సమాలోకనముచేతఁ
గగిసిన కంఠగద్గదికచేత యా

వ॥ అని రామచంద్రుండు దాక్షిణ్యచాపం బవలంబనంబుగాఁ గొని లక్ష్మణాగమనంబు నిరీక్షించుచున్న సమయంబునఁ దత్సమేతుండై గుహాలయంబు ప్రవేశించి జయజయశబ్దపూర్వకంబుగా దాశరథి కిట్లనియె. 69

ఉ॥ ఆమిషభుగ్వేశ దివిజాభయదాయి జగత్త్రయాద్భుతో
ద్దామచరిత్రుఁడై పరఁగు తావకసోదరు చండసాయక
స్తోమములం గబంధుఁ డలతొల్లిఁటి రాక్షసజన్మకారణా
పామలినత్వముం దొరఁగి యుండెను నాకమునన్ సుఖస్థితిన్. 70

గీ॥ నావు డద్దశరథనృపనందనుండు
పద్మవనబాంధవోత్తర భాగపథము
లల్లవానికి శుభములై యుల్లసిల్లఁ
గావుత మటంచు దీవించి శాఖికమున. 71

సీ॥ గుహ! మింటిపై మహాకుధరంబుగతి
గానబడె నప్పు డొక్కటి కడుఁదలంప
నదిగల్కబంధప్రహారణమో తెల్పుమా
యనవాడు దుందుభియనెడు పేరు
గలదానవశ్రేష్ఠు నలవాలి మునుజంపెఁ
దత్కాయ మీసుమిత్రాతనూజ
డగజిమ్మె గావున నేది వాలికి మన
తోడ వైరము బుట్టు నేడనియను.

గీ॥ గవలి లక్ష్మణు డేమిగాఁగలదు దానఁ
బల్కు మన రాముడోవత్స! బలసముగ్ర

మతిపంతకంతకు మఱపుఁ జెందుటచేత
నల్పమై జాఱుధైర్యంబుచేత
గడువివర్ణతఁ బూను నాగాత్రమందు
సుచిరగతిఁ బక్వమగుచున్న శోకభావ
మిపుడు కరుణరసస్ఫూర్తి నొనయ దొడర
ననుచు దమ్ముని నూతగాఁగొనుచు జనుచు. 66

వ॥ మఱియు నిమీలితలోచనుండై ప్రాణేశ్వరీ! దండకారణ్య విహా
రస బ్రహ్మచారిణీ! యని నిర్లజ్జంబుగా విలపించుచుండ సుమిత్రా
నందనుం డమందశోకాక్రాంత మానసుండై తనమనంబున గట
కటా యిక్కరుణరసం బెట్టికసాంతరంబున మట్టువడునో యని
వితర్కించునెడ ననతిదూరంబున నోరిపావిష్ట కబంధహాతక యిదె
ముగిసితనిమొకు నుడువులు బడిబడి వినంబడిన రాఘవుండు నవం
భ్రమంబుగా లక్ష్మణు నాలోకించి దురంత కలుషబంధుండగుదనుక
బంధునితో సీనఖుండగు గుహుంను కలహోయమానుండై నట్లు
తోచుచున్నయది. దానవు లతికపటోపాయప్రతిష్ఠులు గావున నీవా
లసింపక చనవలయు నని తమ్మునిం బనిచి పార్శ్వభాగం బవలో
కించి సకరుణంబుగా హాదేవీవామశీల హాసీరద్వజరాజనందని! భవ
దీయ విశ్వవిస్రంభవిమర్ద వేదినియగు నిచుళ నికుంజరేఖ యిదియ
కదా యని వెండియు. 67

మ॥ తమి నేకాంతమునందు మన్మథవినోదం బీవు వారింతువే
ని యిుయిుగా నేన నఖాంకముంచుక వెసగ నీవుంచినావంచు ని
క్కము ప్రౌఢాలులతో వచింతు వనివల్కం భీతి నాచేతలో
ర్చి మనోవాంఛలు దీర్పు నీ చెలువు ధాత్రీజా! తలంతుగ మదిగ.

నపుడు మహాత్మా మీరతనివృత్తాంతం బరయుటంజేసి కుశలం
బయ్యెనన రాఘవుం డాత్మగతంబున. 75

చ॥ నను మది రావణుం డెఱిఁగి నాప్రియఁ గైకొనిపోయెఁ బోయెఁబో
మును శివపూజకై తనదు మూర్ధము లెల్లను ద్రుంచె నాక్రియన్
దునుముట కంటె నెవ్వియును దోఁచవుపాయము లింక నక్కటా
యని మొనఁ జంద్రహాసహతశాధ్వమునం జననా మదశ్రుముల్. 76

క॥ అనవిని యాగుహుఁడా రా
మనభల్లుకరాజమంత్రిమహిమం బిపుడీ
యనువున ఫలింపలేదే
యని మది నూహించి వేడ్క ననియెన్ మఱియున్. 77

క॥ దేవ! రఘూత్తమ! యిట్టిటు
రావలయు మతంగమౌనిరాజాశ్రమపుం
ద్రోవ యిది యనిన నంగదు
వేవేగము చనఁగ నతఁడు వెండియుఁ బలికెన్. 78

సీ॥ బహుళనవానూపనీపప్రహాసనసహ
చర్యానటత్కేకిచయము వలన
లలితఫలావళీపులకితజంబూని
కుంజకూజత్కీరకోటి వలన
శబరపురంధ్రికాసంతోషకరహుంకృ
తస్వనాంచితకపోతములవలన
నిజచంచుపుటదత్తనీరదకణతుష్ట
కామినీయుతచాతకములవలన

గీ. వికచజాతీసుమాసవ నికరపాన
సందదున్మత్తమధుపబృందములవలన
లోచనోత్సవకారిణులై చెలంగు
వింధ్యవనరేఖలివి రఘువీర కంటె. 79

మ. అనినన్ రాముఁడు దిక్కులన్నిఁ గని దీనాస్యుండై యిట్లనున్
ఘనపంపాలహరీవిలంఘనకళం గన్పట్టు లేగాలి వి
చ్చినహేలావళి తావి నొప్పు విపినక్షేత్రం బవిద్యాధరా
తివయాకోటుల ప్రాయునన్మతికి హాస్యంబిచ్చుఁబో యెంతయున్.

వ. అనిన సౌమిత్రి యార్య! యిటవిలోకింపుమని యిట్లనియె. 81

చ. బహులవిభూతి నేగు ప్రియుఁ బాసి కలంగు కురంగివక్త్రియున్
మహితకృపార్ద్రఁ జూచి యిక మానుమటంచును నస్ఫుటోక్తులన్
సహచరి పల్కె నోనుని సాదుమనం బపరాద్ధమయ్యె బ్రా
కృతహితశరంబు లెన్న నపరాద్ధములైనవి కావు గాంచితే. 82

ఉ. నావుడు రాఘవుండు నయనంబుల నశ్రులు గ్రమ్మ హా! ప్రియా
యావిధిఁ దాటకేయమృగయావ్యసనంబున నేను బోయినన్
రావణుఁ డేగుదెంచిన గరంబును నీ తెలిగన్ను చికురం
గీవలమానలోచనసఖిత్వమునం గనుపట్టెనో కదా 83

గీ. అనవుడు సౌమిత్రి మదిన్
ఘనతరమగునట్టి యాధి గాసిలునిత జె
యనవున ముగ మందు నోకో
యనితలఁచి వేళ మిగుల నాశ్చర్యముగన్. 84

మ. అదె వారెవ్వరు వానరుల్ దెలుపుడీ యస్మద్వ్యథాకారిణీ
మగ [illegible] చారవిహారకము [illegible] గాకుందాద్రిలీలాకళా

స్పదరత్నోద్ధవ గాత్ర మెవ్వఁడు వడిం సన్నద్ధుఁడై చిమ్మురా
యడరుండై యనుపల్కు వీనులఁబడఁ గ సౌశ్చర్యచేతస్కుఁడై. 85

వ॥ గుహుండు రామున కిట్లనియె. 86

సీ॥ కాంచన సహస్రపత్త్రై కత్యకాంతి
దుందుభికళేబరోత్క్షేప దురవగాహ
కోప రాగోదయమునఁ ద్రిగుణపిశంగి
యయివతనువ్రాని యిటు వాలి యరుగుడెంచె. 87

శా॥ క్రూరోన్మత్తసకాన్యరోధిపటుదోర్యుగ్మాంతుణోన్మీలిత
ద్వైరాజ్యంబుగ దేవపత్తనము సేవం జేయు చున్నట్టి యా
వీను న్నిచ్చలుఁ జూచు నేడ్కమహిభృద్విద్వేషి యాత్మీయదృ
గ్వారంబుం గనకాబ్జపత్త్రతతిగా గల్పించి పూనుంచెనో. 88

వ॥ అని యతని నభివర్ణించి రామున కిట్లనియె. 89

మ॥ ఇనవంశోత్తమ ఋశ్యమూకగమనం బీవీకసంవాదనో
స్థిని నొక్కించుక విఘ్న మొందునని తోఁచెం గాన నే ముంగలం
జని మీరాక యెఱుంగఁ జెప్పి సరసీజాతాప్తసూతిం ముదం
బునఁ దేలించి తగానవచ్చెదను మిమ్ముం జేరఁగా గ్రమ్మఱన్. 90

వ॥ అని యమ్మహాత్మునననుజ్ఞనడసి క్రమ్మఱ నతండు మిత్రకులవర్య! మిత్రపర్యాయాంతరితం బగు మీదాస్యంబుఁ గోరి యున్నవాఁడనని కపిమార్గసుగ్రీవుండు దెలుపుకొనిన విన్నపంబున్నదియకదా యనిన సకలగుణసముద్రుండగు రామభద్రుం డేకాంతంబుగా లక్ష్మణుం జూచి పక్షాసీనఖుండగు గుహుం డివ్విధంబునఁ బల్కుచున్నవాఁ డిదియు క్రియ క్రుంబకదా వేఱొక్కటి కాదది యొల్లుఁడని.

క॥ అనుపమమంత్రోత్సాహము
లనుశక్తులుగలిగి మెలఁగు నధికులపై నన్
అనయంబు కార్యసిద్ధులు
ఘనముగ ప్రభుశక్తిఁ గోరు గద చర్చింపన్. 92

గీ॥ కావునను వాలివధము సుగ్రీవునకు నొ
సంగి తద్వనౌకవాహినీసమితి బూర్ణ
శక్తి నటమీఁద నే నెల్ల శాత్రవులను
జెండి పగదీర్తు నన లక్ష్మణుండు నగుచు. 93

గీ॥ అనఘ యటులైన నిప్పుడే పనికివచ్చు
వాలి విడనాడి సుగ్రీవు నేలికొనుట
వక్రపథమన్న జానకీవరుఁడు నవ్వి
యన్న! నీవన్నమాట లెస్సైనదైన

మహా స్రగ్ధర॥ తలపం బాల స్త్ర్యభర్జ్యాదళనభుజబలోద్దాముఁడై సర్వకార్యం
బుల నిస్సాహాయ్యలీలం బొలిచి మనలతోఁ బొంద పేక్షించునా
యీ! బలియుం డివ్వాలి వీనిం బటుగతి నణతున్ భానుజున్
మిత్రుఁ జేతున్। బలావైరి॥ వేశికొందుం బరయువతి భవోత్పా
టన స్వల్పఖేదున్. 94

క॥ అనిన విని సుమిత్రాసుతు
డనఘా! మీబుద్ధి విమలమైనది యదిగా
క నివృత్తశాపుఁడై య
ద్దనుజుఁడు దివిజత్వమంది తా జనువేళన్. 95

గీ॥ గుహుఁడు సెప్పినగతి మీరు కోరి నడువ
నఖిలకార్యంబు లొనగూడు ననుచు మీకు
దెలుపు మని కూర్మి నాతోడ బలికె ననిన
దలఁగి నవ్వుచు నిక్ష్వాకుతిలకుఁ డనియె. 96

క॥ ఇటువత్తెనైన న్మనగుహు
నటకుం బ్రతిదూత్యమునకు నంపగ దగును
త్కటగతి నన లక్ష్మణుఁడం
తట నతనిం గని వయస్య! తపనజాతోడన్. 97

చ॥ ఇనుఁడు భవద్గురుం డగుట నెన్నఁగ మత్కులకర్తయైన య
ట్లనువను రాజు నీకగు విమాతృజుఁ డీగతి జ్ఞాతిధర్మముల్
వనచరవృత్తిఁ జూపి శిథిలంబులు సేసితి వేని నీదు వ
ర్తన కగుఁ బాట యీవిబుధరాజసుతాసవిలోలుపాత్రముల్. 98

చ॥ అనవిని నవ్వి రాముఁడు దశాననుపైఁ గలకిన్కచేత నే
మనినఁ దప్పుగాదు విను మర్భకుఁ డీతఁడు నాదు చిత్తము
జ్జనకసుతావియోగవిలసచ్ఛిఖిసాక్షిగ మిత్రపుత్రునిన్
ననగున మైత్రిఁ జేసె నన సఖ్యమునం గుహుఁ డాత్తహర్షుఁడై. 99

క॥ ఈమాడ్కిఁ దపనతనయుఁడు
ఱీమున్నవఁ గాంచి చెంగ దిక్కులియనుచున్
మోమునఁ జిఱునవ్వొలయఁగ
రామున కిట్లనియె హాస్యరసయుక్తముగన్. 100

చ॥ దినకరసూతిపై మిగులఁ దేవరచిత్తము పక్షపాతియై
మొనసిన మాకులాధిప మిట నేమి మహాత్ముఁడు భానుఁ డీతఁడున్

దనయున కాధిపత్యము మునంబునఁ గల్గుటఁజేసి మిక్కిలిన్
ఘనమగుకాంతిచే భువిఁ గన్గొన శక్యముగాని వాడగు. 101

సీ॥ అనిననవ్వుచు సౌమిత్రి యన్నతోడ
వినతసూభవ రాజ్యకల్పనకు గుహుఁడు
ప్రేమ మనలను నంగీకరింపఁ జేయు
చున్న వాడని పల్కఁ రఘూద్వహుండు. 102

చ॥ తమి నగ వంకురింపఁ దన తమ్మునిఁ గన్గొనివత్స! యేతద
ర్థము ప్రకటంబుగాఁగ శపథం బొనరింపదు నామనంబు ని
క్కము విను మన్నఁ బ్రశ్రయము గప్పుచుండ గుహుండు స్వామి! యు
త్తముల స్వభావ మిట్టిదకదా వివరింపగ నంచు వెండియున్. 103

గీ॥ చేయవలసినకార్యంబు చిత్తములనె
యుంచి యొనరింతు రెంతయుమంచివార
లర్కుఁ డెవ్వరితోఁ దెల్పి యనుదినంబు
కాంతిఘటియించుచున్నాడు కమలములకు. 104

వ॥ అని పల్కు సమయంబున. 105

ఉ॥ ఓకపులార! తెల్పుఁ డివ్వు దుగ్రత దుందుభికాయ మెవ్వఁడో
యాకన మంటఁ జిమ్మినమహాపదపూర్ణుఁడు వాడు మామకో
త్సేకితబాహుఖర్జు వెడసేయగ శక్తుఁడె యంచు వీఁకమై
నాకరణిన్ వినంబడిన యువ్వడె యాగుహు డాత్మలోపలన్. 106

మ॥ తను భల్లాకవిభుండు రేవగ మదోద్యద్రోగసంగ్రస్తదో
ర్జనితామర్షముతోడవాలి యిటకున్ సన్నద్ధుఁడై వచ్చె నే
నును వీరవ్యసనాతిరసౌఖ్యరతిఁ గందుం గొంతసే పంచు నుం
డినచో వా డరుదెంచి ముందట గనన్ రేవన్ రఘూత్తంసులన్.

వ॥ కనుఁగొని యీప్రసన్నమూర్తు లెవ్వరొకో వీరు రక్షఃకోటీ
రోత్క్షేపంబు చేసినవారు కావలయు నని కొండొక విచారించి
తలంచినాని, 108

సీ॥ తనతండ్రి వెడలింపఁ దండకాటవిఁ జేరి
కందమూలంబు లాఁకటికి దినుచు
నొక్క దార్భాగినేయుండు తమ్మునిగూడి
బాణబాణాసనపాణి యగుచు
నస్మద్విహారయోగ్యస్థలంబుల నెల్లఁ
బాటచ్చరస్థితిఁ బరగుచుండు
వానిఁ దత్సోదరు వడి నివారింపగా
వలె నీ వటంచును దొలుత నాకు

గీ॥ హితుఁడు గావున నక్తంచరేశ్వరుండు
చెప్పి పంపిన యావార్త తప్పదిప్పు
డాను వారలె వీరంచు నరయుచుండ
మిత్రకులవర్యుఁ డంత సౌమిత్రిఁ జూచి. 109

గీ॥ వినుము లక్ష్మణ! యిమ్మహావీరవర్యు
డేమి పలుకుచు నున్నవా డిప్పు డనిన
నటఁ బురోభాగమున కేగి యతఁడు వాలిఁ
గదిసి వీక్షించి యిదిగో మే మదిగో నీవు. 110

క॥ అనుటయు వాసవి రామా
యనుపమమతు లెవ్వ రిర లన నాతనితో
విను మనఘా! రాఘవులము
వనజోదరబాహుజాతవంశుల మనఘా. 111

వ|| అతండు వెండియు నోయి! దీర్ఘాయుష్మంతుండ! యాకారవిశే
షంబులు మీజాతివిశేషంబు నెఱింగించుచున్నవి కానితద్విశే
షంబు తెలియం బలుకుమనిన లక్ష్మణుండు ప్లవంగపుంగవా! రా
ఘవులమని పలుకలేదే యనుటయు నతం డసూయం బోలవెం
డియును. 112

మ|| వివరింపన్ రఘువంశసంభవులు మో పీ రంచు నాకిప్డు ద రా
ఘవశబ్దం బెఱిగించె క్షత్రియత మీగాత్రంబులే తెల్పె న
ట్లవు సాంస్కారిక నామసంగ్రహ మపత్యప్రత్యయప్రాప్తి నా
శ్రవణంబున్ వినఁగోరె వానికి విశేషం బుండివం దెల్పుమా. 113

వ|| అనిన సౌమిత్రి సధైర్యసంభ్రమంబుగా మేము శ్రీరామలక్ష్మ
ణులు మని పలికిన విని వాలితనయునంబున. 114

శా|| నాతో సీతఁడు సర్వనామపద విన్యాసక్రియం జెప్పె వి
ఖ్యాతిన్ వ్యక్తము సేసె నా సవ్వ పరే ఖండేందుభృచ్చాపభి
చ్ఛాతురీధురీణు డెవ్వఁడు మదిం జర్చింప నీయుర్వరం
దా తండే యగు రామభద్రుఁ డని తా నంగన్ బ్రకాశంబుగన్. 115

ఉ|| భీకరయుద్ధసాధనకరభీరతలున్ మృదుగాత్రవేషముం
మీ కౌశికరీతి నున్నయవి యిక్కాలి యుద్ధతిలోన క్షత్రియా
నీకవిదారణాస్త్రతవినిద్రుని భార్గవు నాహతాహవా
త్సేకునిఁ జేసినట్టి రఘుశేఖరుఁ డెవ్వఁడు చూపు మేకున్. 116

మ|| అనసౌమిత్రి వినీతిఁ బోలెను మహాత్మా! లక్ష్మణుండంద్రున
న్నన నాతం డలగాధిసంధనునిచే నస్త్రాగమప్రాప్తి నే
ర్చిన యారాముఁడె యన్న నా నవబలాక్షీణప్రవీణుండు నా
శనికిం గర్తె నటంచు వాలి ఘనహర్షానీతుండై చెప్పుగన్. 117

సీ. ఓరఘు రామ! యీయుర్విఁ ద్రైవర్ణ్యమా
త్రావళిష్టగ జేసినట్టి జామ
దగ్న్యుని నిశితాస్త్రతతిగర్భనమునుండి
క్షత్రియజాతిని గ్రమ్మఱంగఁ
దెచ్చితి వది మున్న తెలియంగవినఁబడె
మాకు మేల్కను వేళ మంచిదయ్యె
కఠోష్మజస్వేదకణముల నప్పుడే
శ్రవ్యాదవర రణఖర్జు వెల్లఁ

గీ. చాపిపీరవరశ్రద్ధఁ బరగు నాదు
బాహుదండంబు నీతోడఁ బరిచరింప
నలరుచున్నది కన్నులకరయు వేడ్క
యున్న దిచటికి రమ్ము ర మ్మన్న! యనియె. 118

చ. అనవుఁడు రాముఁ డాతని సహర్షముగాఁ బరికించి పీడశా
ఘనుఁడు ప్లవంగరాజితనికైవసమైన పురప్రదేశమం
దనవరతంబు రావణభయాతురమైన మహీలలామ నె
మ్మనమునఁ గాంచుచున్నయది మానుగ నూఱట యంచుఁ బోవఁగా

వ. అప్పుడు లక్ష్మణుండు వాలిం గన్గొని రామభద్రా!యుదగ్ర
జం కిచ్చోటికిం జేర నీవును బ్రవేశింపు మనిన నతండు రా
ము నకుఁ గొంతయుభిముఖుంబుగాఁ జనుదెంచి. 120

గీ. చూచి రాఘవ మద్భుజాగోచరుండ
వగుటఁ బ్రాణంబులు పణంబులుగ నొనర్చి

యాఁడు దివిజాసురాదులకార్యసభికుఁ
డైనరణభోజి సంతోష మందునిపుడు. 121

క॥ నావుఁడు రాఘవుఁ డనియె మ
హావీరా!యిట్టులెటుల నంటివి సంగ్రా
మావార్యపరాక్రమయో
ధావళి కగ్రేసరుండ వదియును గాకన్. 122

మ॥ విమతాకృష్టసురాంగనాచికురసంవీక్షాస్మరద్వైరభూ
సమరోడ్డామరభూరితేజుఁ డయి యీమద్భ్రూకుటీభీమరు
ట్కమరక్తాక్షిసహాసము న్నిజదృఢాంగశ్రేణివిద్ధోద్ధృతా
సమబాణవ్రణలీలఁదాల్చిన దిగీశస్వామి నిన్ గాంచెఁగా. 123

మ॥ కృతవీర్యాత్మజు చర్యఁ గన్గొనిన యారేవానదిం దక్క స
ర్వతటిన్యావలిఁ గూడి వారినిధు లబ్రం బందె వాశాజయో
న్నతబాహార్గళదుర్గముం దశముఖుం బంధించి నీ వుల్లస
న్మతి సంధ్యానియమవ్రతంబు లొనరింపం జూచి కీశాధిపా. 124

గీ॥ అనిన నవ్వాలి రామున కనియె నపుడు
దనుజసేనాంతకారణద్వంద్వయుద్ధ
కుశల!నినుఁ జూచి నీసుధాకోమలోక్తి
వినినమాత్రనె నామది తనుపు గనునె. 125

మ॥ ఘనతన్ క్షత్రియలోకవిక్రమదురాకర్షాశుగానంబు గై
కొని యంతన్ భృగుభూస్వభావయుతనృక్షుద్రేణు కామూర్తి
చ్చిన లోకత్రయహృద్వ్యథావ్రణగణచ్ఛేద్యామథ త్వత్సుమి
త్కనదోజంబును గన్గొనం దివురు మద్బాహాయుగం బెప్పుడున్. 126

మ॥ అనినన్ రాముఁడు లేఁత నవ్వెసఁగ నాహా! యుద్ధసర్వస్వదా
యినియై దానవసంపదాహరణమై యొక్కూ్కన్నగాఁ బడ్డదై
కనుపట్టెన్ వినుమద్ధనుర్లత సదా గాఁగన్ మహావీర! సా
ధన మీవున్ గ్రహియింపు మన్నఁ గపియూథస్వామి దా నిట్లనున్.

వ॥ భళిభళి! యో రాఘవ! ధర్మపథంబు దప్పకుండఁ బలికితి వైన
ను వేయొక్కటి గల దది యెట్లం టేని. 128

మ॥ గురుదోశ్శాలుర కాత్మజాత్యనుగుణక్రూరాయుధశ్రేణి సం
గరయోగ్యంబగు నైన వానరులకుం గాలాయసాస్త్రావళిన్
ధరియింపం బనియేమి ఘోరరిపురాడ్దర్పచ్ఛిదాకేళికై
యఁటచేతుల్ పిడికిళ్లు గోళ్లు నివి గావా! సాధనవ్రాతముల్. 129

మ॥ అనినన్ లక్ష్మణుఁ డన్నతోడ నపుడో యార్యా! మహాభాగుఁ డీ
ప్రణుతప్రాభవశాలి వాలి కడుఁ దిర్యగ్జంతువుల్ సంతతం
బునిజాంగాస్త్రము లంచుఁ బల్కినది యొప్పంగా యనన్ రాఘవుం
డనుఁ గోదండగుణధ్వనిన్ నెరపి కీశాధీశుతో నయ్యెడన్. 130

శా॥ అవు రా! గౌతమశాపసంశమితబాహాపౌరుషుండైన య
ద్దివిజాధీశుని మేఘనాథుఁ డపకీర్తి న్ముంచె మున్నాపరా
భవముల్ గతమహాంధుకర్కటముగాఁ బౌలస్త్యు బంధించి పా
పవె వీరోత్తమ తాతదుఃఖహరణప్రావీణ్యమున్ బ్రాఁగన్. 131

క॥ దైవవశంబున నేఁ డా
నీవే లక్ష్యంబ వగుచు నిలిచితివి భళీ!
నావిశిఖంబున కనినం
దేవాధిపసుతుఁడు రోషదీప్తుం బలికెన్. 132

మ-స్ర॥ ఘనమద్దోస్స్మాలకూలంకషవిషమఘనగ్రంథిభంగప్రసంగా
వనతక్రోశత్సురద్విడ్ద్వరనిహితజగద్వారదైత్రాంకసర్వ
స్వనివేశచ్ఛార్యమూంచుఁ సలకఖలచరిత్రసాధారణత్వ
మ్మును మందంబై కుఠారిఁ బొనఁజెటిచిన నిఁ బొక్కపోఁజేయకున్నఁ

మ॥ కినుకం జంక బిగింపఁ బిక్కటిలి కైకే ఘ్లాసి కూవెట్టుచుఁ
దనుజేంద్రుం డిడఁగా జగత్త్రయజయోద్యల్లక్ష్యాతిసర్వస్వ ముం
దిన నాశౌర్యము కార్తవీర్యనృపదోస్తేజోనిభం బాటచే
తనవే యూన్చుచు నన్ను భార్గవుడ ధ్వంసిఁ నినుం గల్వఁగఁ. 184

వ॥ కావున విమర్దార్హం బగు మహీభాగంబున కవతరింప వలయు
నని వాలి యసమసమరసముత్సాహవిజృంభమాణుం డై రా
ముం గూడి యేగునెడ గుహుం డాత్మగతంబున నేఁడు దైవవ
శంబున నామనోరథపరంపరలు ఫలించె నని విచారించుచుండ
సుమిత్రాతనయుండు దక్షిణాభిముఖంబుగా నిరీక్షించి ససం
భ్రముండై నిషాదనాయకున కిట్లనియె. 185

చ॥ వనచరు లిద్ద జెప్పు దనివార్యపరాక్రముఁడైన యార్యునిఁ
గనుఁగొనుచున్న వా రిదిగొ వేగమె వింటికి నారిఁగూర్తు నే
ననిన గుహుండు నిల్వు మహిజాధిపుపై వసురక్తి నింద్రసం
దనుపయిఁ గివ్క నర్కజుఁడు దార్కొనెమూఁడవ శక్తి రెట్టిగఁ. 186

సీ॥ అనిన సౌమిత్రి యాయర్కజుం డితండ
కాని యారెండవ వానరేంద్రుఁ
డెవ్వఁడో యన గుహుం డెలమి నాతనితోడ
నితఁడు కిష్కింధాధిపతిదైక

వీరుండు వాయుభట్టారకునకుం బర
మానినీజారకుమారకుండు
పరమసూర్యాచార్య భక్తుండు హనుమంతుఁ
డనిన నీయనఘుఁ డాహా భళా ర

గీ॥ యనుపమబ్రహ్మలోకపట్టాభిషేక
శాశ్వతైశ్వర్యమును మానసంబునందు
నాసపడినవాఁ డీయనయా! యటంచు
మాటిమాటికి నుతియించి మెచ్చియు ననియె. 137

గీ॥ ఇతఁడె కద! భూమిసురశాపవ్రతనిజప్ర
తాపవిజ్ఞానబద్ధుఁడై ధరణి నితర
వీరులు రహింపఁ జూచుచు నూరకుండె
నటులఁ గాకున్న భువి నసాధ్యంబు గలదె 138

క॥ ఇతఁ డస్మదీయహృదయ
స్థితశల్యము వేగఁ దొలఁగఁ జే యునటంచున్
మతి నిశ్చయించి సంగర
కుతుకాన్వితు నన్నుఁ జూచి గుహునకు ననియెన్. 139

వ॥ ఇత్తెఱఁగు బరస్పరగౌరవలాఘవజ్ఞాపకం బైన ద్వంద్వయుద్ధంబు మనయాయ్యనకు వాలికిం బ్రవర్తిల్లినయది యేతద్విజయలక్ష్మీ పరిగ్రహాయాతకం బైన కీర్తికి నేను నీవు రవిసుతుండును గొదలుగా నెవ్వరము భాగాధికారులము గామైతి మని పలుకునెడ గుహుండు ససంభ్రమంబుగా నిట్లనియె. 140

క. కనుఁగొనఁ రాఘవుఁ డేసిన
పెనుదూ పిడె వాలి మున్ను పెకలించిన యా
ఘనసప్తసాలసంతతిఁ
దునిమి యతని దూరి మగుడి తూణముఁ జొచ్చెన్. 141

మ. హరిదుద్ఘుష్టరణకీర్తిసింధుగిరియా నవ్వాలిప్రాణాలితో
వరయుగ్గాంచనపద్మదామకముచే నాతిథ్యముం జానకీ
తరుణీభర్తకుఁ జేసి వీరశయనద్రాఘిష్ఠనిద్రానమూ
దరుఁడై యుండె నటన్న లక్ష్మణుఁడు ఖేదం బంది తా నిట్లనున్. 142

క. హా! వాసవ! యిటువంటి మ
హావీరశ్రేష్ఠుఁడైన యాత్మజు నయ్యో
నీ వింక నెందు జూచెద
వో వేఁగన్నులకుఁ బండువుగ నని పలుకన్. 143

వ. ఆసమయంబున గుహాంతము తదభిముఖంబుగా నిరీక్షించి సమం
చితానందకందళిత హృదయారవిందుండై సుమిత్రానందనున
కిట్లనియె 144

సీ. మంథానకుధరనిర్మథితాబ్ధిఘుమఘుమ
స్వననిభదుందుభిధ్వనులు మ్రోయ
నానాజనాఘకర్ణరసాయనప్రాయ
మాంగల్యసంగీతమహిమ చెలఁగ
నిగ్రహానుగ్రహోదగ్రవిప్రవ్రాత
కృతమహాశీర్వచోరీతి దనర

నిర్భరానందసందర్భగర్భితకీశ
భటకోటి జయజయార్భటులు నిగుడ

గీ॥ నీలుఁ డాచార్యభల్లూకనేతృమంత్రి
తోరుహాటకమయకుంభవారిచేత
రవిజు నభిషిక్తుఁ గావింప రాఘవుండు
తద్గళంబున పొందమ్మిదండ వైచె. 145

వ॥ అనుటయు నాలక్ష్మణుండు వయస్యా! యీయర్థంబు మాకుఁ
బ్రియం బని యభినందించుసమయంబున. 146

సీ॥ వినరోయి భల్లూకవీర ప్లవంగగో
లాంగూలయూధపులార మిమ్ము
నేఁడు సుగ్రీవుండు నియమించుచున్నాఁడు
యౌవరాజ్యంబున కెవ్విఁడగునొ
యావస్తువులు గూర్పుఁ డవనిజ నరయంగ
నేను నమ్మారుతసూనుఁ బంపి
యూర్ధ్వమాహూర్తికహోరిలగ్నంబున
నంగదు నభిషేక మలరఁ జేతు

గీ॥ నిఖలదివిజపరంపరా నిరుపమాన
మకుటమాణిక్య కాంతికుంభత్పదార
విందుఁడైన మహేంద్రుండు వేడ్క సెంద
వనిన నమ్మాట విని సుమిత్రాత్మజుండు. 147

గీ॥ ఉలమునఁ బొంగి మాకు నీయుత్సవంబు
నిబిడసంతోషకారిమై నెగడె నన

వాలినాశంబు నిర్జరేశ్వరునిచిత్త
మెంతయుడలించునో యను నంతలోన. 148

వ. అంతరిక్షంబునం దమందమిళన్మిళిందబృందానందసందోహసం
ధాయిమకరందబిందునిష్యందిమందార కుసుమవిసర వృష్టి గురిసె
ననంతరంబ జయజయ ! రామభద్ర ! జగత్పతి ! యని మఱియును.

శా. వాలిప్రాణవినాశనప్రశమితద్వైరాజ్యవై రాగ్యల
క్ష్మీలీలాప్తి దినేశజుం డెసఁగెఁ గిష్కింధాలయైకక్రమా
ఖేలద్దైవతమై సహస్రనయనీఖేదాశ్రుముక్తామణీ
జాలుండై హరి వొల్చె నప్తృయువరాజ ఖ్యాతిచే మించఁగన్. 150

గీ. అనుచు వినసైన లక్ష్మణుఁడత్యభీష్ట
కరము మనకిది కావునఁ గరలిపోఁడ
మేతదుత్సవ భాగమింపెసయ నిప్పు
గాంచుఁగాక యని గుహుతోడఁ గదలెనంత. 151

వ. అక్కడ లంకాపురంబునందు. 152

మ. అలుకన్ వాయుతనూభవుండు నిజవాలాగ్రం బుదగ్రంబుగాఁ
జలియింపంగ నతక్షణంబున శిఖిజ్వాలాచ్ఛటాయోగ సం
కలనన్ బంగరు మేడలన్నియు నుదగ్రప్రక్రియం గాలి పూ
దెలచందంబున నిల్చె రావణుపురోదేశంబు నందెల్లడన్. 153

చ. కొలఁదికి మీఱు నాత్మరుచి గుంటయు మిట్టయు రూపుఁ గర్వముల్
దెలియఁగ రాక యొప్పు మణి నిర్మిత దివ్యగృహంబులందు వ
ర్తిలఁగ హాటకాశ నామిత పరీత శిఖాళి నెఱుంగ లేరు మే
నులు చుఱుకన్న దాకసు జనుల్ మదినెంతయు నూహచేసినన్. 154

శా॥ శ్రీమద్బాహువశంవద త్రిభువనశ్రీగర్వసర్వంకష
స్థేముం డప్రతిమప్రతాపుఁడు దిశాధీశానుజుం డద్రిజా
రామత్క్ష్మాధరభేది యుండ సురదుర్వారాధ్యయా లంకకే
మేమో దుర్దశ కోటిసేయుటివి సుమ్మీ దైవికావశ్యముల్. 155

క॥ ఇదియెంత రావణునిదు
ర్మానవృత్తికి నంచు నన్న మానసుఁడగు మా
జవలం బొమ్ముల నిడి దశ
వదనుని భావించి మాల్యవంతుఁడు వల్కెన్. 156

చ॥ అల పదునాల్గువిద్యలు నిజాస్యచతుష్టయినుండఁ జోటులే
కలజడినొందఁ గన్గొనుచు నంబుజసూతి ప్రణష్టమైన నీ
వలనని యుండుఁగాక యని వక్త్రములం బది నీకొనర్చె నాఁ
డెలమినిట్లు నీవు జడవృత్తి వహించుట యెట్లు రావణా. 157

గీ॥ అని ముహూర్తంబు నిలిచి యాతఁడు మదీయ
వంశ మీగతి నష్టమైవచ్చె ననుచు
మాల్యవంతుండు దుఃఖాబ్ధిమగ్నుఁ డగుచుఁ
దద్విధంబెల్ల మదిలోనఁ దా గణించె. 158

క॥ రాముఁడు ఖరాదియోధుల
నామంబడఁగించె సంజనాసుతుఁ డక్షున్
భూమికిఁ బలియిడె రక్షో
గ్రామణి తా వెడలఁద్రోచె ఘను ననుజన్మున్. 159

క॥ గతమగు దుష్కార్యమునకు
వెతఁబడఁ బనిలేదు రామవిభుఁ డుత్తరసిం

ధుతటినిఁ బాలెము డిగి యే
స్థితిచే నున్నాఁడొ మనకుఁ దెలియఁబడదుగా. 160

వ॥ అని వితర్కించుచుఁ బురోభాగంబు నిరీక్షించి యారా మున్న
రాఘవచరిత్రం బశేషంబుగాఁ దెలియ ననుపంబడిన శుకసార
ణులలో సారణుం డరుగుదెంచుచున్నవాఁ డిట కనునంత నతండ
రుగుదెంచి ప్రణమిల్లిన. 161

చ॥ ఘనుఁడగు మాల్యవంతుఁ డతికౌతుక మావహిలంగ సారణుం
గనుఁగొని వానరేంద్రుకటకంబుననుండియె వచ్చు టెంచుఁ బ
ల్కిన నతఁ డట్లయౌ నని లేశము దాచక కార్యభాగ మె
య్యది వివరింపు మన్న వినయాన్వితుఁడై పలికెఁ గ్రమంబునన్.

సీ॥ విను తాత నాచేత వనచరానీకంబు
పేరులు సంఖ్యయుఁ బెక్కుమార్లు
తెలిసినాఁడవ యింకఁ దెలుపంగఁబట్టదు
వినుపింతు నిక నొక్కవింతసుద్ది
సేతువుగట్టంగ సేనలెల్లనుగూడ
నందు వానరవేష మమరఁ దాల్చి
ప్రజలలో నేఁ జరింపఁగ "మహారాజవి
భీషణుఁ"డని యంత భీతినొంద

గీ॥ మాల్యవంతుండు సాకూతమతి చెలంగ
"వలవిభీషణుఁడభిషిక్తుఁడయ్యెనే య
టంచు నడుగంగ నతఁ డందు కనుమతింప
బ్రమానుపడి ముందువెనుకయుఁ గానకుండె. 162

గీ॥ ఒయ్యనొయ్యన తెలివొంది యున్నరనుచు
వత్స భయమేల యచ్చటివార్తలెల్ల
తెలుపఁడఁ బల్కుమనిన యమ్మాటకలరి
సారణుఁడుఁ బల్కె మాధురీసాధురీతి 164

క॥ ఘనుఁడు కుమారవిభీషణుఁ
డసఘరాన న్నెఱిఁగి పాశయంత్రితునింగా
ననువుపడఁ జేసి రఘురా
మునియెదుటన్ నిలుప నతఁడు ముదమలరంగన్ 165

గీ॥ తనప్రధానులకన్నను ఘనముగాఁగ
నాకు బహుమానము నొనరించి నాదువలని
నేరముల నాత్మఁదలపక గారవమునఁ
బోయిరమ్మని యనిచె నోపుణ్యచరిత 166

గీ॥ అనిన సంతోషమంది యాయనఘుఁ డనియె
నోయిసారణ విశేషములు యుదాత్త
తాగుణంబులు ప్రియవక్త్ర మొందాకనిలుచు
నంగనడ వుండు నందులో ననఘుఁడితఁడు 1:7

చ॥ క్షమను సుభూతిశీలఁ దనకుచ్చి గతంబుగ భృంగ పంక్తులన్
విమతములై ఏ పద్మములు వీడొకని నచ్చు శిలీముఖావళిన్
సమముగఁ జూచు వైఖరిని సజ్జనుఁడున్ దనవారి నన్యులన్
బ్రమదముఁనొందఁజేయు నిరుపాధికసౌహృదవృత్తి నెంతయున్ 168

గీ॥ అనుచు వచియించి శుకునిమాటనుగ నతఁడు
వానరులలోన వాని నేఁ గానననుచు

సారణుఁడుఁ బల్కె మిగుల నాశ్చర్యమొంది
మాల్యవంతుండు వానితో మగుడ ననియె 169

క॥ విను వత్స మనవిభీషణుఁ
డినకులపతిఁ జేరినపుడె యిఁక మనవంశం
బున కెల్లనిధుల హానియె
యని నామదిఁ దోఁచుచున్నయది యేవేళన్. 170

సీ॥ అనిపల్కె సారణుఁ డనియె నోయిమహాత్మ
సత్కులప్రభవుండు శాంతహృదయుఁ
డనుపమధర్మవర్తనుఁడు బాలుఁడు విభీ
షణుఁ డెట్లు తనయగ్రజన్ము విడిచెఁ
బ్రతిపక్షుఁడగు రాముపజ్జ కేఁగ నటన్న
నుమ్మలికంబున నుస్సు రనుచు
నోవత్స సారణ రావణు నడుగు నీ
వటుగానిచో విధినైన నడుగు

గీ॥ మనుచుఁ జింతాభరక్లాంతి నభినయించు
మాల్యవంతుని నొకకొంత మట్టుపఱచి
యింతదాచఁగ నీకు నే వింతవాఁడ
నైతినే యన వాఁడితో ననియె నిట్లు. 171

చ॥ పవనసుతుం డశోకవనపాళి సమస్తము గొట్టఁ గైకశీ
భవుఁ డొకనాఁడు చూచి మఱి పాయక కింకరవుల్ గొనంగఁ దా
నవరజుఁ గాంచిపల్కె నహహా మనుజార్భకులిర్వురాతఁగా
శివమున.గోతిపుచ్ఛ తనచేటుదలంపక త్రుళ్లెఁ జూచితే. 172

వ॥ అనిన నతం డిట్లనియె. 173

ఉ॥ రావణ మర్త్యజాతి నవరంబనిచూడకు కార్తవీర్యునిన్
భావమునందలంచి కపినాథులశౌర్యము వాలి దెల్పెఁడే
నీవు మహాగ్నిహోత్రివి వినీతుఁడవై యికనైన జానకీ
దేవిని నప్పగించి యలదేవతలన్ కెలివాపు మింతయున్. 174

వ॥ అని తద్వృత్తాంతంబు మాతామహుం డానతిచ్చునవసరంబున సారణుండు మహాత్మా మీరు ప్రసంగవశంబున వాలి నుగ్గడించుట నొక్కవిశేషంబు నామనంబునకుఁ దోచుచున్నయది వినుమదియిట్లనియె. 175

చ॥ సురగిరితోడి మత్సరముసొంపున వింధ్యధరాధరంబు ని
ర్భరమ్ముదుతం బెరుంగుశిఖరంబుల సైపగఁజాల దేకవీ
శ్వరపటలంబు వారలభుజాబల మెన్నఁదరంబె సేతుభూ
ధరశిఖరశృంగఘట్టనలఁ దాల్చెఁ గిణాళిఁ బ్రకోష్ఠపాళికల్. 176

క॥ సారణుఁ డీగతి వానర
వీరులఁ గొనియాడి మీయదివృత్తాంతం బే
తీరున నడిచెనొ యన నని
వారితమతి శాలి మాల్యవంతుఁడు వలికెన్. 177

గీ॥ అనినఁ దమ్మునిమాటల నాదరమున
వినుచు కోపాంధమానసవిహ్వలుఁడయి
యాడరానట్టి దుర్భాషలాడి యతని
వెడలఁద్రోయించె ఘనమదోద్వృత్తుఁడగుచు. 178

వ॥ అనిన సారణుం డాకాశంబునఁజూడ్కులిడి హా పౌలస్త్యనందన నీవనియెడు వైపర్త్యదృష్టాంతంబుచే ననుమానంబువలన

మూలచ్ఛేదనిమిత్తంబులయందు మనుష్యజాతంబు భీతంబయ్యె
డుఁగదా యని కొండొకవిచారించి మాల్యవంతునితో నిట్లనియె.

క॥ అరిషట్కమె తన కాలగు
చరణములుగ భ్రమరి యైన సంపత్కాంతన్
బఱఁగఁగ సందుల నొకటిది
తెలుపుచు నీకుఁ గుంటిదానిఁ జేయుము తండ్రీ. 180

గీ॥ వినుము తాత రావణునిచేత నా సీత
యెప్పుడు పట్టువడియె నపుడె యింక
నలవిభీషణుండ యస్మదీయాన్వయ
తంతు వనుచు మదిఁ దలంతు నెపుడు. 181

చ॥ అన విని మాల్యవంతుఁడు హృదబ్జము జల్లుమనంగ సారణుం
గనుఁగొని యిట్లు రెండుకటకంబుల తత్త్వము నీవెఱుంగుచో
పృథుఁ దెలియంగ నెవ్వరికిఁబోలద యిందుల కింత కార్య మే
యనువునఁ జక్క నౌ సనిన నాత్మఁ దెలంగి మృదూక్తి నిట్లనున్.

సీ॥ వినుము ప్రామదికిఁ దోఁచినదారి వినుపింతు
ననువుగా నొకకార్య మనఘచరిత
యంగదుం డర్భకుం డామపాత్రమురీతి
నెటులఁ జెప్పిన నట్ల యొలయఁ జేయుఁ
గావునఁ బితృవైరులై విలసిల్లెడు
రామసుగ్రీవులనామ మడఁచి
పఱఁగఁ గిష్కంధకుఁ బట్టంబు నిను గట్టి
వాలి మాఱొనరించు మేలునకును

గీ॥ ఋణము దీర్పంగఁ దలఁచినా మిప్పు డనుచుఁ
ప్రణిధిముఖమున రావణప్రభుని దేశ
మచటఁ బలికింప నిజముని యక్కపీంద్రుఁ
డానవడి యుండు సుగ్రీవుఁ బాసి వచ్చు. 183

గీ॥ వాఁ డొకఁడు చీలినంతనె వానరేంద్రుఁ
డాత్మగృహ మింక నహిభయావాప్త మౌ న
టంచు రాఘవుపొందు చాలించఁ దలఁచు
ననుచుఁ గడుసూక్ష్మదృష్టి వాఁ డతని కనిన. 184

చ॥ పలికెను మాల్యవంతుఁ డు కృపామధురంబగుచూడ్కి వానిపై
నెలకొన నీవుచెప్పినదినిక్కము యా నటులైన బాల్యచా
పలమున యౌవరాజ్యపరిపాలనభోగము లందుచుండి యిం
దుల కిఁక నమ్మతింపఁ డని తోఁచుచునున్నది నామనంబునన్. 185

చ॥ అది యటులుండె వాలిసుతు నాప్తజనుల్ మఱిసూర్యసూతికిన్
మొదలనె యాప్తు లట్లగుట ముందఱగానక హైన్యవృత్తి నం
గదుఁ డిది సమ్మతించినను గాదనిత్రిప్పుదు రింతెకాని దు
ర్మదులయి యిట్టికార్యములమాటకు సమ్మతిసేయ రెంతయున్.

వ॥ అనిన విని సారణుం డిట్లనియె. 187

గీ॥ ఎద్ది సమ్మతి మదిసేయుఁ డిపుడు మీరు
దినము లున్నవి దండనీతిప్రయోగ
మునకుఁ జెచ్చినవేళ నెవ్వనితరంబు
బావిద్రవ్యంగ నని పల్కి వాఁడు మఱియు. 188

చ॥ చెలఁగుచు వానరాగ్రణులు సేతువుఁ గట్టఁగ నెవ్వఁడాత్మలోఁ
దలఁచిరొ యప్పుడే రఘునిధానము వారిధిఁ దాటివచ్చి వి
చ్చలవిడి నీసు వేలధరచంచదుపత్యకలందుఁ బాళిముల్
నిలిపినవాఁడ కా తెలియు నెమ్మది నీ వన విస్మితాత్ముఁడై. 189

గీ॥ వినుము సారణ నీవు పల్కిన తెఱంగు
నన మనుష్యుండొకండె యర్ణవము దాఁటె
నేని దశకంఠువిక్రమం బెలమిభువన
పటలిచే నింక దాటంగఁబడు నిజంబు. 190

మ॥ అలలంకాధిపుపాదపద్మయుగళం బాదిత్యదైత్యేంద్రమా
ళుల నిర్మాల్యము సేయు నారఘునృపాలుం డబ్ధికిం సేతువు
జ్జ్వలవృత్తిం ఘటియింప భానుఁడు సరోజంబుల్ సమున్నిద్రుఁడై
చెలఁగించుం రుచిచే సురాళి భుజియించుం సాంద్రచంద్రద్యుతిన్.

సీ॥ అని పల్కి మఱియు నయ్యనఘాత్ముఁ డతని కే
ర్పడ వాలివధశుద్ధపార్ష్ణియును న
నేకవానరబలానీకనాయకుఁ డుప
కృతుఁడు హితుఁడును నహీనచరితుఁ
డగు భానుపుత్రుచే నమితపక్షుండయి
పవనసుతవ్యక్తభావితాత్మ
దీయచరిత్రుండు దీపితసకలాబ్ధి
యానయత్నప్రయోజనుం డైన రఘునృ
గీ॥ పాగ్రణికి నెన్నిభంగుల వరసిచూడ
నిదియె యఖిలయోగసముచితమై మదికి నాకు

దోఁచుచున్నది యనినఁ దుందుడుకుచెంది
యతని గన్గొని సారణుం డనియెనిట్లు. 192

గీ॥ ఆర్య యీ రావణిచ్చినయర్థ మెల్ల
తలప నిక్కము విను మాత్మధనబలిష్ఠు
లైన విజిగీషువులు కీర్తి కాకరంబు
లగుట కిదాశరథి యుదాహరణమ రయ. 193

వ॥ అనిన మాల్యవంతుండు నిశ్చేష్టితుండై కొండొక విచారించి
యిట్లనియె. 194

మ॥ అని నవ్వాలి యడంగ మాబలము నశ్యత్ప్రవృత్తిం జే నున్నదా
తనితో వారము యందు కేమి భుజసత్వస్థేమ కెన్నం గణిం
ప నశేయంబగుదుర్గమైన జయశుంభద్ధామముం డా రాముం డీ
వనధిం దాటును నూఱుయోజనములం బాటిల్లు నింకేకదా. 195

వ॥ అని వెచ్చనూర్చి తనకూతుం దలంచి. 196

మ॥ పెదవుల్ మాటికి నాల్కలుం దడుపుచుం బిట్టార్తిమైఁ గూయ న
న్నిది రెంటం జనుద్రావు నాదశముఖం దీపించు శాస్త్రజ్ఞుఁ గా
న్పదుఁడా పట్టికి నిట్టిచెట్ట యిక సంప్రాప్తించి బాధింపఁ జూ
చెనవో కైకసి విశ్వవీరజననీసీమంతముక్తామణీ. 197

గీ॥ అనుచు దుఃఖాబ్ధిమగ్నుఁడౌ నతనిఁ జూచి
సారణుం డిట్టిపాపంబు శాంతినొందుఁ
గాత బంధుజనంబు లీకరణి మది న
నర్థశంకల నూహింతు రనుచు మఱియు. 198

చ॥ పనుపడ నింక నే నొకటిఁ బల్కెద బాహువిహంగికావలం
బనము ఘటిల్లఁగా గుణసమాజనిబంధనమూన్చి రాజ్య విశా

యనువునఁ దాన పంక్తిముఖునంతటివాఁడు ధరింప జారిపో
యిన నది దానిశీల మనుటెంతియు కాక తలంప నేటికిన్. 199

చ॥ అనవిని మాల్యవంతుఁడు ఘనాశ్రుజలంబులు కంఠభాగముం
దనువుగ నిల్పి మే మిపు డపాగతభాగ్యులమౌట నిక్కమై
వను మది నట్లుగాఁ దలపన్యాయముగా దలవిశ్రవస్సుపో
ధనమహిమన్ మదీయకులతంతు వొకం డటు నిల్చియుండినన్.

క॥ అనునంతలోన సంభ్రమ
మున శుకుఁ డేతెంచి వినయమునఁ దాళఁగనుం
గొని మ్రొక్కి నిలిచి యిట్లని
వినిపింపఁ దొడంగె నచటివృత్తాంతంబున్. 201

చ॥ అరిబలజైత్రులైతగు ప్రహస్తమహోదరధూమ్రనేత్రులన్
పరమతులం జమూపతులఁ బట్టివధించి నిశాచరాధిరా
ట్పురి నటు చుట్టుముట్టి రఘుపుంగవుఁ డిప్పుడు వానరైకబం
ధురజలరాశిఁ జేయుచు మనోహరవృత్తి నటించుచుండెనున్. 203

క॥ అన నన్యదేశకాలము
లను కెందుప్రమేయచయములం గన నద్దం
బనఁ దవరు వృద్ధమతి గా
వున నర్థంబెల్ల మున్న పొడమదె బుద్ధిన్. 108

గీ॥ అనుచు మాల్యవంతుఁ డంబర వీక్షించి
మేలు రామభద్ర మేలు మేలు
ధర జయింబుగోరు ధన్యుల కతిశీఘ్ర
కారితమె యవశ్యకార్యసిద్ధి. 204

చ॥ అనునెడ సారణుండు తనయాప్తసఖుం శుకుఁ జూచి యిప్పుడా
దనుజవరేణ్యుఁ డెట్టిది విధానము పూనినవాఁడొ చెప్పుమా
యని యడుగంగ నాతనికి వత్తఱిఁ దెల్పఁ దొడంగె నద్దశా
ననచరితంబు లచ్చటిజనంబు వినం వివిధోక్తిచాతురిం.　　205

మ॥ అల రాముండు సువేలశైల వను మాటాలించియుం గొన్నిచే
తుల దేవారి ధనుర్గుణధ్వని దిశల్ దూలించుఁ గొన్నింటిచే
జళిపించుం గరవాలముల్ పటమునం సాధించు సీతాకుచాం
చలకాశ్మీరమనోజ్ఞచిత్రరచనాచాతుర్యముం గొన్నిటం.　　206

గీ॥ అనిన సారణ కలెను దశాస్యువ్యాసయ
చంచలత యిపుడేనియు నడల దనుచు
నంత శుకుఁజూచి యమ్మాల్యవంతుఁ డనియె
నెగుఖు దిగులును మదిలోనఁ బుగులుకొనఁగ.　　207

ఉ॥ గోపురశౌల్కి కాధిపుఁ డకుంఠితవిక్రముఁడా నరాంతకుం
డేపరిపాటినుండె వన నెప్పుకు పాయక ద్వారభూమియం
దేపున నుండె నైన నికనేమన వంగదు చేతఁ నంచువాఁ
డాపయిమాటఁబల్కు టకునై మనసాగక యూరకుండినం.　　208

గీ॥ మాల్యవంతుఁ డంత మది గుభల్లుమనంగ
హాన శాస్యపుత్ర హాకుమార
యిట్టిపాటుఁజూడ నెట్టు మాకుఁ జరాయు
వఁకఁ డొనర్చెననుచు నడలుచుండ.　　209

వ॥ అనమయంబున నోమహాపార్శ్వాదిదానవవీరులారా యూరక
వానరకటకనమాలోకితరథయూంగు లగుచ, నెంచి పఱచెద
రేలంచు మరియును.　　210

చ॥ తెరలక నిల్వఁ డస్త్రచయదేవియుపాస్తియొనర్చి యుద్ధతిన్
మెఱయుచు మేఘనాదుఁడు సుమిత్రసుతుం బరిమార్త నెంచుఁ దాఁ
గరమునఁ గట్టెఁ గంకణము ఖడ్గముఁగైకొనెఁ గుంభకర్ణుఁడున్
వెఱవకుఁ డేమిశంక రఘువీరునిచే ననుచున్ వినంబడన్. 211

ఉ॥ అందుకు సారణుండు మది హర్షమునొందుచు సావలంబమ
య్యెం దగఁ గార్య మిప్పుడు సమిద్ధభుజుం డలకుంభకర్ణుఁడుం
తం దనవిద్రఁ దేలి రణధాత్రికి వేగమె చేరవచ్చి సం
క్రందనశత్రుఁ గూడుకొని గాఢపరాక్రమ మేపుఁ జూపఁగన్. 212

గీ॥ అనిన నమ్మాల్యవంతుఁ డిట్లనియె నపుడు
రామలక్ష్మణు లనురాగరసముఁ బొదలఁ
గలఁగఁ గూల్తురు మనకుంభకర్ణ మేఘ
నాదు లనుమాన మింక నేల నయచరిత్ర. 213

వ॥ అని యిట్లు మాల్యవంతుండు వలుక సవిషాదమనస్కుండై శుకుం
డాత్మగతంబున నక్కటకటా యవిశిష్టకర్తృకర్మభావంబుగా
ముది మదిదప్పి పలికె నిమ్ముదుసలి నేమి యున విధివిపాకం బప
రిహార్యంబనునంత నతండు. 214

గీ॥ శిశువులార వినుఁడు చెప్పెద నొకవార్త
రాక్షసాధిరాజ రాజ్యలక్ష్మి
యెన్ని విధులనైన నికుంభకర్ణుని
వలన నున్న దనుచుఁ బలికె మఱియు. 215

కం॥ అన్నయగు రావణునికో
పిన్నయగు విభీషణునకుఁ బ్రియములరగఁ దా

నున్నను జన్నను రాజ్యము
మన్నించు నెఱుంగలేము మదినూహింపన్. 216

వ. అనునాసమయంబున, 217

సీ. దిగులొందనేల పన్నగకూర్మపతులార
యరయ విశిష్టభూభర మొకింత
యిపుడు లేదని పక్షికులపనుఁ డాజ్ఞాపించు
చున్నవాఁ డురుకృపాయుతమనీష
వసువంతలో శుకుం డలరుచు మనవార
లెక్కుడుగరిమచే నుక్కుమీఱి
రన మాల్యవంతుఁ డత్యవధానమతి విను
చుండ నచ్చో మఱియొక్కవార్త

గీ. వినఁబడియె బావలుగుఱు వేర్వేఱ నఱికి
తల మొగురఁగొట్టినట్టి యాశరథాత్మ
భవునిచేఁ జిల్కనయి మహాహవధరిత్రి
వ్రాలె ఘనకుంభకర్ణకబంధ మిదిగొ. 218

చ. అన విని మూర్ఛనొందిపడి హా శిశురత్నమ కుంభకర్ణ యే
యనువున నేలఁగూలితి వటన్న శుకుంసును సారణుండు నా
య్యన దనుచూరడింప నయనాంబుకణంబులురాల వారలం
గనుఁగొని మాల్యవంతుఁ డటఁ గ్రమ్మఱఁబల్కె విషాద మేర్పడన్.

మ. భువనైకాద్భుతధైర్యసంపదలచేఁ బొల్పొందు నిక్ష్వాకుభూ
ధవునిన్ వంచనఁ జేసి సీతఁగొని రా దా నెందితిన్ మున్నుగా
వివిధోపాయములన్ వివేకమున నే వేతే మఱింకేటికిన్
నవదుఃఖోదయ శాంతు లన్న శుకుఁడంతన్ దుఃఖ మేపారఁగన్.

చ॥ కటకట యిట్టివార్త దశకంఠుఁడు దాఁ బ్రకటింపనేల ను
త్కటముగ నన్నుఁ దాత ఫిని దానవనాయకువాజ్ఞ పొగ ది
వ్వటికిఁ గపీంద్రులొండొరులు పక్త్రముఖుం గదు గెలిసేయుచుం
దిటముగఁ బల్కినా రనుచుఁ దేటపడఁ వినిపింప నాతఁడున్. 221

గీ॥ ఎంతలే యిట్టిపోతులగంతులకును
శౌర్య ముండిన విజయమే చాలుఁ దెలుప
నింద్రజిత్తునిఁ గెలువ కే యిప్పుడు తాము
గెలిచియొనరించి వెలిపించుకోలి యేమి. 222

వ॥ అని పలుకు నవసరంబున. 223

సీ॥ వినుఁ డహో వానరవీరపుంగవులార
త్రుంపుఁడీ పట్టణతోరణములు
హరిచాపయుతదేవశరవృష్టి కేయవ
గ్రహ మంత రాయమై కడలుకొనియె
నన మాల్యవంతుఁ డత్యంతశోకోద్రేక
మున నెట్టిమాటలు వినఁగబడునొ
యని కర్ణములు మూసికొనియున్న నంతలోఁ
జెనువార్త వచ్చె నాఖిలవృత్తి

గీ॥ సారశస్త్రాస్త్రిఁదయ్యును వీరయజ్వ
యును నగుచునిష్ఠియొకటి చేసిన సుమిత్ర
పట్టిచే రణశాల నాపక్త్రకంఠు
నాత్మజుం డిష్టశమితుఁడై యరిగెననుచు. 224

గీ॥ అట్టిదుర్వార్త వీనులనంట నతఁడు
దుఃఖపరిపూర్ణుఁ డెందు నిర్దుఃఖుఁడగును
గాని యీచెట్ట యామూలఘాతియగుచుఁ
గదియ నియ్యెడ నే నెట్లు గాంతు సుఖము. 225

వ॥ అనిన శుకుం డూర్ధ్వభాగంబునాలోకించి యిట్లనియె. 226

మ॥ దివిజాధీశవిమానపఙ్క్తు లదిగో దిఙ్మండలిన్ మొంకుగా
గవిసెం గానఁ దలంతు దారుణరసక్రాంతవ్రణావజ్వల
న్నవవారింధనవీయమానసహసానశ్యశ్వ్యథావాహినీ
ధవుఁడై పఙ్క్తిముఖుంతు రామజయసంధానేచ్ఛ సంధిల్లుటన్.

వ॥ రణరంగంబునకు వచ్చెంగావలయు ననిపలికిన, మాల్యవంతుండు
జరాపిశాచీసంపర్కదూషితం బగు మద్దేహంబు రామభద్రని
ర్భిద్రశరాసారతీర్థసేకంబునఁ బరిశుద్ధిగావింతుఁ నని లేచి వార
లతోఁ గదలె నవంతరంబ గగనంబున విమానారూఢులైవచ్చు
గధర్వకుమారులగోరత్నచూళుండనువాఁడు హేమాంగదాభి
ధానున కిట్లనియె. 228

క॥ చెలి హేమాంగద నేఁడీ
జలధరమార్గమున మనకుఁ జరింపంగాఁ
గలిగె విమానముల నిర
ర్గళగతి నని క్రిందిభువను గనియిట్లనియె. 229

మ॥ సురనాథోపనివేద్యనందనవనీసూనావళీతోరణ
స్ఫురితక్రవ్యభుగీశవిక్రమసఖీప్రాగ్భాసిలంకాపురీ

వరరథ్యాళి సమిద్ధలోకనముదావాప్తాప్సరోజాలకే
శిరఘాచ్ఛాదిత యాట నయ్యెఁ జదలన్ లేఖావకాశచ్యుతుల్. 280

మ॥ అనఘా కంటె సురాధినాయకసహస్రాక్షిస్రవద్వారిపూ
రనదీమాతృక కేళికావనులచే రంజిల్లు నీవీట మున్
మనుజాతిప్రతిజాతిదూషణకథామందస్ఫురద్డింభకుల్
గినుకం దేవచమూజయానుకృతిచేఁ గ్రీడింతు రత్యున్నతిన్. 281

వ॥ అనిన రత్నచూడునకు హేమాంగదుం డిట్లనియె. 282

క॥ నరదేవాసురభీకర
కరరాజన్మండలాగ్రఖండితరిపు రా
ట్కరివరుఁడై దశకంధరుఁ
డిరవందెను వానిమహిమ మేమనవచ్చున్. 283

మ॥ తతదోశ్శక్తికథాప్రశస్తిరచనోద్దామాతురాకారదృ
క్తతిసంశోభితగోత్రభిన్మయజయస్తంభాంకపూర్ద్వారుఁ డీ
దితిజాధీశుఁడు ఏని జోడగు మహాధీరుండు లేఁ డీజగ
త్త్రితయావత్కరవిక్రమక్రమపరక్రీడాప్రభావోన్నతిన్. 284

క॥ అన రత్నచూడుఁ డనియెన్
విను హేమాంగద దశాస్యువీటను దనుజుల్
ఘనతరనినదము లెసఁగఁగ
మునుకొని పటహములు వెడిసముగ మ్రోగింపన్. 285

సీ॥ ధారాళగద్గంతిసంతమూర్తికమయ
ద్వారతోరణదామహారి యైన
హరిపదఘుటితభీకరశృంఖలోన్మృష్ట
పరబంది కాశోక భారమైన

శైశవోపార్జితశౌర్యలక్ష్మీసహా
పాంసుకేళీసుహృత్ప్రాయమైన
పంక్తికంధరవధూబంధుతాశౌండీర
దానవీగణసముద్భాసితమైన

గీ॥ యనఘ సురతరువికసిత కుసుమవిసర
సరసపరిమళసురభిళాశయనశయిత
సమదదితిసుతపరిచరదమరయువతి
యయిన గృహసంఘ మీయెడ నడఁచుచుండె. 236

వ॥ అనిన విని నగుచు హేమాంగదుం డిట్లనియె. 237

చ॥ దనుజవనీదవానలుని దాశరథిన్ మిథిలేశనందినీ
జనితమహానురాగుని నిజప్రియునిం బరికించి యెంతయున్
మనమున నాత్మపక్షజయవాళము లిత్తఱిఁ గోరుచున్ రయం
బున నిటు లంతరాళమునఁ బొక్కెడు నప్సరయుప్పురిం జూచితే.

చ॥ అన విని రత్నశేఖరుఁ డుదంచితహాసదయాననంబు గా
ననియె నసత్యనాయకజయక్రమవిక్రమహృష్టచిత్తజీ
వనరుహసంభవారదితివాసవశిద్ధ్యవనామశేషసం
దన బహుశోకమగ్న నరినాయిక నీగతిఁ బల్కఁ జెల్లునే. 239

వ॥ అని వెండియు. 240

క॥ మూఁడటఁ గనుఁగొని దక్షిణ
మందుం గనుఁగొంటె యిమ్మహాజన మదె రెం
డందమ్ము లయ్యె నంచును
గొందిన భయకౌతుకములఁ జెలి కిట్లనియెన్. 241

మ॥ సమదక్రూరవిలోకవహ్లికకృతాశాతోరణ్యసబ్రహ్మఖ
క్రముఁడై ఖడ్గవరైకమానసవివల్గద్వ్యాగవద్యోత్సుకా
సమదోన్సంవృతరోదసీకుఁ డయి విస్ఫారాంఘ్రిఘారావతో
న్నమదుర్వీస్థలుఁడై దశాస్యుఁ డరిసేనం దాఁక నేతెంచెఁడీ. 242

క॥ నావుఁడు ముని గన్గొన్నదె
రావణసంగ్రామభీమరథనం బైనన్
భావములోఁ దలఁచిన నా
కీవేళది వోలె భీతిహేతుక మయ్యెన్. 243

మ॥ శతమన్యుప్రరుఘట్టనపటుణాకృతశ్వల్పాకవక్షస్సమా
హృతధారాధగమార్గుఁడై నమరభూహేలాభిభూతామర
చ్యుతలక్ష్మీకరిణీవిహారవదబాహాద్దామకాంతాఖ్యుఁడై
ప్రతిభన్ మించిన యద్దశాస్యుఁడిపు డేపాటో యని నూహింపుమా.

గీ॥ అనిన విని రత్నశేఖరుం డనియె నహహ
యేమియనవచ్చు భీమసంగ్రామవిక్ర
మాఢ్యులగువారిలోన పేర్మైనవాని
ప్రణుతవిధినాధసఖుని నీ పఙ్క్తిముఖుని. 245

మ॥ అమరాధీశుఁడు సంతతం బనుకరవ్యాజామరత్వాజని
స్వమభూపావలిచే దశాననునిఁ బూజల్ సేయు స్కందోపనే
యమునల్ దుర్భరదర్పదసీతి నిశి యాయంభోధియున్ దన్నిమి
త్తము యన్వేషముఁ వచ్చు శూన్యభునుఁ బద్మోభవం బేమనన్.

వ॥ అని పల్కునెడ ననమనమరపరమసంతోషభీషణహేమమా
ణపణవనాయుతవాశిరాశిసంపాదితనముద్దంద దండధరచండస్సై

రిభకర్ణజ్వరభరవహత్తుంగం బగు రయవచ్ఛతాంగంబు నెక్కి
దుర్ధర్షామర్షబంధురుండగు పంక్తికంధరుం డటుగు దెంచినం గాం
చి సభయాద్భుతంబుగా మఱియు నిట్లనియె. 247

మ। ప్రళయార్కప్రభసన్నిభాస్యుఁడయి మర్త్యద్వంద్వయుద్ధక్షణో
జ్జ్వలకండూతిభుజార్గళేక్షణధవద్వ్యాలక్ష్యలక్ష్యాత్ముఁడై
యలఘిష్ఠామరగోష్ఠిగర్వనికషుండై కనేయుంచు భూ
స్థలి తాత్కారిబలాస్త్రసంతతిఁ దిరోధానంబుఁ గల్పించెడిన్. 248

క। అనిన విని హేమాంగదుఁ
డనియెం గౌతుకముతోడ నదె కనుఁగొంటే
యనుగుం జెలి దక్షిణమునఁ
దనరెడి కపిసైనికులను దనుజాధిపులన్. 249

మ। ఘనశాఖామృగసేన శీర్షపరిఘాఖ్యాజ్ఞాతపాంసుత్రయద
ర్శనకాంక్షాగతలై వెలింగ బలచె నారా కుంభసంభూతశా
సనసన్యస్తఘటోద్భవాఘటితవైషమ్యంబు సేతుప్రబం
ధనకీర్త్యుజ్ఝితవింధ్యశృంగచయముల్ ధాత్రింబడన్ వైచుచున్.
వ। అనిపల్కిన సహాసంబుగా రత్నచూడుండిట్లనియె. 251

చ। హరివరయూథకస్త్రీశిఖవాపగదున్నతచందనద్రుమో
త్కరముల వేడ్కఁజే నెదురుగాఁజని గైకొను దానవాళికిన్
గురుతరతన్నివాసఫణికోటి ఘటించు ముహూర్తమాత్ర మే 252
ర్పడఁబడు నంగరంబులకుఁ బాశనిబంధనదుఃఖవేగమున్.

చ। అనవుఁడు హాటకాంగదుఁడు హా చెలి నీ వదె చూడు వేడ్కతో
డను దితిజన్వయాంబరవిశంబవ రాజ్యముఖ దేవసుందరీ

జనసుమవృష్టి లేకయె విశంకటవానరశస్త్రీకద్రుమ
ట్టన దనుజాంబు గూలె నిచటన్ మొయిఁ దత్కుసుమాళి నిండగన్.

వ॥ అనిన రత్నచూడుండు గొండొకవిచారించి హేమాంగదున
కిట్లనియె. 254

గీ॥ ఎఱుపుమైంచాయచేఁ బగ తెక్కుడైన
రీతిఁ గనవచ్చు దివినెవ్వరితనువు లధి
కతిమిరము బెంచుఁ దక్కపికతనవహ్ని
కడను దగ్దదైత్యులను ధూమ మడరెనిపుడు. 255

వ॥ అనిన హేమాంగదుండిట్లనియె. 256

చ॥ పరిపతదామిషాళిపరపక్షివియుక్తనభోంతరస్థలీ
భరణికలందుఁ గ్రిక్కిఱియఁ బక్షికిరోధియుకంబు లేక్రియన్
వఱలుచు దిక్తటాళిపలవన్ ఘనపాదపశస్త్రపాణులై
యరుదుగఁ జేసి రాక్రియ వనాటులు నిక్క మవాచ్యకర్మముల్.

క॥ అనిన విని రత్నచూడుం
డనియె ససంభ్రమముగాఁగ ననుగుంజెలి క
న్గొను మిదె దారుణకర్మము
వనిపడి యిచ్చోట నిపు డుపస్థితమయ్యెన్. 257

మ॥ గురుదైత్యాధిపనీరదంబు వికటక్రోధాట్టహాసాగ్నిబం
ధురవిద్యుత్తతియై నిశాచరచమూస్త్రోమాళిసంఘృష్టవా
వరముక్తాచలచూర్ణపూరితనిజాంతర్భాగధారాపత
చ్ఛరవర్షంబులచే నొనర్చె నహహా సాంద్రాంధకారంబిలన్. 258

గీ॥ అనిన విని హాటకాంగదుఁ డసురవిభుని
తేజము వర్ణించి యిట్లను సఖునితో న
నేకులైనట్టి క్షుద్రుల కేని యొక్క
ఘనుని వెతఁ బెట్టు టది దొడ్డగాదు వినుము. 260

మ॥ హరిదీశోన్మదనాగదానజలవర్షావగ్రహాక్రూరదృ
క్ఛరతారాంకునిఁ బఙ్క్తికంధరుని నుత్కంఠాన్వితుం జేయ వా
నరవీరుల్ పరిబద్ధసేత్వధికసంత్యక్తాద్రికూటాఘని
ర్భరశస్త్రంబులు పూనినిండిరి యమర్షస్ఫూర్తిచే నిష్ఠురిన్. 261

వ॥ అనిన విని రత్నశేఖరుండు సవిషాదంబుగా సఖున కిట్లను న
క్కటా మిక్కుటంబైన విషమంబు సంప్రాప్తంబైన తెఱంగునఁ
గానవచ్చుచున్నయది దయారహితప్రచండతరమండలాగ్రఖండి
తారిమండలాఖండవక్షఃకవాటవితతకంటకనిర్భగ్నకపోలభిత్తు ల
గు మత్తదైత్యులొక్కమొత్తంబుగా నిరంతరగళనికరరుధిరధా
రాప్రకల్పితానల్పవీరపానగోష్ఠీవినోదంబుల మిక్కిలి యుక్కు
మిగిలి ప్లవంగపుంగవుల నటిమి తెటిమిగొనిచని రనిన విని హే
మాంగదుండు వయస్యా విచారంబేల వినుమని యిట్లనియె. 262

ఉ॥ రావణుఁ డేయు నిష్ఠురశరంబుల కోర్వఁగలేక విచ్చి మొ
గ్గై వెలిఁ దోఁక త్రొక్కిన రయంబునఁ బాఱెడు వానరాళి సు
గ్రీవుఁడు పోకు పోకుఁడని క్రేవ మరల్పఁ దురంబొనర్పఁగా
నావుఁడుఁ దత్సఖుండును ఘనంబగు నద్భుతతేజయుక్తుఁడై. 263

మ॥ అవురా! మున్ను నిగుడ్చు భూమిరుహశస్త్రానీకముల్ కైకసీ
భవవక్షస్థలఘట్టనానలముచే భస్మంబులై పోవఁ, గీ

శవిభుం డంత గిరీంద్రశృంగముల ముంచం దత్కరశ్రేణిచే
నవియుం బిష్టములై స్వకుంజరఘురనీరాప్తిఁ గనెం బంకతన్. 264

వ॥ నావుఁడు హేమాంగదుండు బలధురంధరుండగు నిప్పక్షికంధ
రున కిది యెంతయబ్బురం బది యెట్లంటివేని. 265

శా॥ ధాత్రీపీఠమతటాన ముక్కోదలుమట్టన్ భూమియుం టూడఁగా
నాకైలాసము నెత్తఁగాన శిథిలంబై నేఁటికిన్ భగ్నసం
ధ్యాకాలోద్ధతనృత్యయోగమునఁ దాంతంబై చలించున్ వయ
స్యా! కల్యాణధరాధరప్రముఖగోత్రాధీశసంఘంబులోన్. 266

చ॥ హరిబలనాథ శస్త్రీతమహాతరురాజము దైత్యనాథు పే
రురమునఁ గోమలాంబుజబిసోపమమై పడఁ దత్సుమంబులన్
సరసిజసాయకుం డిపుడు తన్మతనయాఘనమోహపీడితాం
తరుఁడగు వీనిదేహమున నాటఁగనేసె నటంచు దోఁచెడున్. 267

గీ॥ అనుఁడు విని చిత్రశేఖరుం డరసి నవ్వి
యేమనఁగవచ్చు నోచెలి! యీనిశాట
పట్టభద్రుండు సత్వసంపన్నులందు
నెన్న మొనలింటివాఁడి దియెట్టులనిన. 268

మ॥ త్వరగా మూర్ధము లుత్తరించి శిఖ వేల్వన్ ఫాలముల్ పెట్లున
త్తఱిఁ బైటంబడ దేవతాలిపులు సీతాభర్త చేనావధిన్
బరిసీలించి యచంచలాత్మధృతిచే బ్రహ్మన్ భజించెన్ గడుం
దర మే మానధనాఢ్యుఁ డీతనివిరోధం బోర్వ నెవ్వారికిన్. 269

వ॥ నావుఁడు హేమాంగదుం డిట్లనియె 270

మ॥ ఖరనారాచపరంపరాశకలితగ్రావోపలస్తోమములై
తరుచూర్ణీకృతశక్తితోమరగదాదండాళుగవ్రాతములై

హరిదైత్యేంద్రు లటం దలాతలి రణాహంకారసాంకర్యవి
స్ఫురణం బెంచి భయానకాద్భుతగతిం జూపట్టె కీర్తించితే. 271.

చ॥ ఉరుగనియూర్పుచా ల్నిలుప నబ్బురగళంబున హారముల్ దెగం
బడి మణికోటిభారఫణభంగభయం బొనరింప శేషుఁడి
ప్పుడు కపిరూఢశౌర్యభరభగ్నతనుం డయి పీను లుండమిం
గనుఁ దల లొక్కటం గదియఁగా ధర ప్రోచుచునుండఁగావలెన్.

చ॥ అని మఱియుం విషాదమున నాతనితో నకటా! దశాననుం
డినసుతునిం భుజంబుల నహీనధృతింబిగియించి సంగరో
ర్విని కని యుద్ధలాఘవపరిశ్రమ "కేళి మదీయదోర్వనం
బవియొనుఁజోల నూగుచు ఫలాప్తి గ్రహించి సుఖింపరా" యనెన్. 272

గీ॥ అనిన విని రత్నచూడుఁ డనఘునఘుని
తోడ నిట్లను భానుసుతుండు హస్త
కౌశలంబున విడిపించుక నిశ్శంకతఁ
డనినదుర్వచనంబుల కలిగి పలికె. 273

సీ॥ ఓరోరి దశకంఠ! యొకమాటె యాకర్ణ
ణచ్ఛేదములఁ బ్రవీణతఁ దనర్పు
వింశతిబాహాలు పెన దశమశిరంబు
ద్రెంపక పలికి తత్క్రకచమున
ము స్నావ్వి నీచేత భిన్నంబులయ్యెనో
ప్రార్థితభూతాధిపంబులైన
తన్మస్తకంబులఁ దక్కినదాని నా
పదిగోళ్ల ద్రుంచి కుంభత్సుఖాప్తి

గీ॥ నలువు వహియించి త్వద్వ్యథనాట్యసూత్ర
ధారుడఁగు రాఘవునితోడి పారిపార్శ్వ
వృత్తిచేఁ బ్రకరణఫలబీజభావు
కులనుధాంధుల నేఁబ్రహ్మాష్టుల నొనర్తు. 374

వ॥ అని యిట్లుపల్కి సుగ్రీవుంకు కుప్పించి యప్పరంబెగసి పక్షి-
శిరోధిం గప్పున వడచిన నతం డానొప్పిన జతదప్పి దర్పితవి
రోధిరాజముండల కేతువగు కేతుదండం బవలంబనంబుగా నొ
ఱిగి యెట్టకేలకుఁదెప్పితిలెనని యంతదిగంతంబులఁ బరికించి
సాస్రంబుగా వయస్యాచూడుమనియిట్లనియె. 375

మ॥ నరు లేఘాళికిఁ గట్ట రాలివడు నానంతానకంబుల్ సురే
శ్వరకేశాంతరదామ మయ్యెఁ దలవఁ స్వర్మాల్యకృత్సృష్టిఁ ద
న్నరభుజాన్నధళికోనవవ్యథను నంపశించి యీవేళ బ్రహ్మా
సిరి వైమానికు లాత్తహర్షభరవిచ్ఛిన్నాతిథిగస్థితిఁ. 376

చ॥ అనుటయు హాటకాంగదుఁడు హా యనిఖేదమునొంది యూఱటఁ
గనిన దశాస్యముష్టిహతి గాసిలి పడ్డ దినేశసూనునిఁ
మన మడలంగ నీలహనుమంతులు డగ్గరి సేవ దేఁర్చుచుఁ
గొని కడ కేఁగి రంచుఁ దనకూర్మివయస్యునితోడఁబల్కెనఁ. 377

చ॥ అవు డలరత్నచూడుఁడువయస్యున కిట్లను నంగరాదియుం
దపరిమితప్రతాపులకు నాఁగద యోటమి గెల్పుఁ బెక్కుమా
ర్లిపుడు విషాదమొంతఁ బనియేమి యనం గవకాంగదుంకుతో
రవుముదవాప్తిఁ బాంగదవు ప్రాణసఖా యటువంటఁ జూడుమా.

సీ॥ శాశికదత్తదివ్యాశుగాగమవేది
భార్గవాహంకారభంజనుండు

వీరసంగరసీమ భూరిదోర్బలశాలి
జనజాతబాంధవవంశకేతు
వంగీకృతజుదాభిజూతిశకర్మవిహారి
వనరాశిసేతుబంధనచణుండు
లంకానిరోధనిశ్శంకసైన్యవినోది
దానవీవైధవ్యదాయకుండు

గీ॥ రాముఁ డుద్దండమౌర్వీరావభిన్న
గగనదిక్కాండకోదండకలితుఁడగుచు
పక్షికంధరవారణసంభ్రమభరాతి
కుటిలదృక్కాంతివెలుఁగంగ నిటకు వచ్చె. 279

క॥ అని పలుక రత్నచూడుఁడు
విని హర్షముతోడ రామువీక్షించి దశా
నను సితఁ డేమో పలికెను
గనలుచు ముని మెనయ నన్నుఁ గడు నిల్లనియెన్. 280

శా॥ ఓరీ రావణ శంభుచాపహతిజాతోత్సేకుఁడై బాహుశౌ
ర్యారూఢోష్మఁ జెఱుప్ఁ జేయుచును బాల్యంబందె యాత్రేసం
హారిన్ భార్గవుఁ జక్కఁజేసిన మహీజాధ్యక్షుచే నీ కగున్
దారాభర్తృసమానకర్తృకవధోత్కృష్టాత్తధన్యత్వమున్. 281

వ॥ అనిపల్కి సనుసమయంబున హేమాంగదుండు వయస్యా వ
ద్దునేయక నితంనిల రావణుం డేమెయో యనుచున్నవాఁడు
వినదముని పదిరొగ్గి వినుసదుఁ బౌలస్త్యుండు కాకుత్స్థవల్లభున
కిట్లనియె. 282

మ॥ ధరణీరాట్పుత్రియఁడింత రావణగిరినుత్పాటించి వేనాటి వ
ర్తిలునాబాహావిలాస మద్ధరణిపుత్రిం గోరి యీకావచా
పలతన్ ద్రుంపక మాన కాక సురరాడ్వ్యాదేభదానాంబుని
ర్ఘలదార్జవ్యభిదుగ్రజాగరమదప్రాక్షేణి నిర్నొర్చునే. 283

వ॥ అనిపలికిన. 284

మ॥ విని హేమాంగదుఁ డంత విస్మయముతో వీక్షించి యాదానవేం
ద్రుని హుంకారము పేరిగ్రఁధి యిపుడుర్ దుర్వారమై ముజ్జగం
బును నిస్సారముఁ జేయుచున్న దన నావ్రుం జోచెలీ యిందుకిం
తని యాశ్చర్యముఁ బొందెదీవు మది నీ కారీతి నేఁ డెల్పెదః. 285

శా॥ మానాథ్యాత్ముఁడు రావణుండు నిజకుంభన్యార్ధముల్ ద్రెంచి శై
ర్యానూనస్థితి నేకమస్తకముతో వధాంగమాదుండు నా
చావన్ వంచనఁ జేసి ద్రొక్కె ముద మొచ్చన్ శంకరైకాంఘ్రికిన్
వానిం బోలిన వీరుఁ జేసి జగతిన్ వర్ణింపఁగా నచ్చలీ. 286

గీ॥ అనుచు గగనంబుఁ గని కొంతయభినుతించి
నవ్వి యోచెలి యిదె పురందరునిరథము
పోలె నొక్కటి దశరథపుత్రు చెంత
కరుగుచున్నది యనిన హేమాంగదుండు. 287

ఉ॥ అవ్వొఖు వార్షముప్పతిలె నాగ్మనఖుంగని పల్కె వీఁడుగో
తప్పక చూడు నీతతులితంబులు చంద్రకసన్నిభంబులై
యొప్పు సహస్రరంధ్రములయుక్తి నసంగకు జోడు దోవ నీ
చొప్పున వచ్చె నింద్రరథచోదకుఁ డంచును బింది నవ్వుచున్. 288

మ॥ హరి నానావిధరత్నదీధితిసమూహప్రస్ఫుటాకారితా
మరకోదండసహస్రయుక్తరథసీమన్ నిల్పి చాపంబునం
గరతంగస్థలి గంటివంచుఁ జెవియొగ్గం బల్కెనవ్వేళ వి
స్ఫురణన్ మాతలితోడ దైత్యకుల రాట్సూతుండు కోపోద్ధతిన్.

శా॥ కాలాభీలను రాసు రాధిపభుజాకాండోరుకండూతిమ
జ్వాలాజాంగలికుండు రావణుఁడు నీగర్వంబువారింపఁడే
యాలే యీరఘుడింభుఁ జేర్చితగదా యాయింద్రుమైమర్వఁ దే
కేలా గాతని కీర్తనంబెయిది యెంతేవింతలై తూలినన్. 290

క॥ అనునంత రత్నచూడుఁడు
గని నెచ్చెలి రాముఁడే మొఘనముగఁ బలికెన్
వినుమును నెడ నిట్లనియెను
జనకజవిభుఁ డసురవరుని సారథితోడన్. 291

గీ॥ అవుర నీ వనుపల్కు సత్యంబు లోక
మందు నేలిక యెట్టివాఁ డట్టివార
లై నిజస్వామిఁ జెడ దుర్ణయంబుచేత
నాత్మ నతిసేసి పొంగుదు రల్పమతులు. 292

క॥ అని పల్కునవసరంబునఁ
గనకాంగదుఁ డాత్మసఖునిఁ గనుఁగొని యేమీ
దనుజవిభుఁ డాడుచున్నాఁ
డనునెడ వాఁ డనియె రఘుకులాంబుధిశశికిన్. 293

మ॥ తతకోపామితసంజ్వలన్మఘువనేత్రశ్రేణి తద్దైన్యథా
మృతరంగంబులచేత వెంటన వడింజల్లార్చు వన్మజ్జగ

త్రితయానేకజయాంకవిస్ఫుటభుజాబృందంబు లాజిఁ నను
ద్ధత నొప్పంగద నిత్యనీతివిధినిర్వాహంబునం దశ్లాఘా 294

క। అనుమంత రత్నశేఖరుఁ
డనఘుఁడు దాశరథి యేమియనుచున్నాఁడో
వినిరమ్మని యాలింపఁగ
దనుజాగ్రణితోడ నతఁడు దగ నిట్లనియెన్. 295

ఉ। తొమ్మిదిమస్తకంబు లలధూర్జటిపూజకు ద్రుంచి యేని నీ
విమ్మునియుంటి వాతని నహీనభుజార్గళపాళికిం ద్రిలో
కమ్ములగెల్పు నైజము జగంబున నెంచు విధాత కెన్నఁగా
ముమ్మనుమండవౌట హతమూర్ఖ పునస్స్థితినీకుఁజత్రము. 296

వ। కావున నీవు వివేకహీనుండ వింతియకాక మాటిమాటికిఁ జొప్ప
టనీభుజాపాటవంబు పాటించెదు నేటికది కేటపడియెను ని
ట్లాడనేలయన విని హాటకాంగదుం డందుకుని శాటపతి యేమి
యుత్తరంబిచ్చునోయని యాకర్ణింప నిలింపాహితవల్లభుండు ర
ఘుతల్లజున కిట్లనియె. 297

గీ। ఓరి రాజన్యడింభ నాయూరుభుజప్ర
తాపము భవత్ప్రపితామహుఁ డన
రణ్యుఁడు నెఱుంగు నింతయు రమ్మనేఁడు
నీవు తెలిసెదవంచు దానిలిచిపలుక. 298

క। విని రత్నచూళుఁ డిపు డిం
దున శేముషినొప్పు దశరథునిపుత్రకుఁ డం

చునఁ జెవియొగ్గిన నత్తఱి
నినకులవల్లభుఁడు దానవేంద్రునకనియెన్. 299

మ. వినరా రావణ రాక్షసేశ్వర భవద్విధ్వంసితుండైన మా
యనరణ్యాఖ్యున కేఁ దపింప నని శౌర్యాఢ్యుల్ జయంబున్ ధృతిం
గనుటల్ నైజము యార్త్తి హైహయునివశ్యాగ్రణించి బంధీకృతున్
నిను ఖ్యాతంబుగ నవ్వులస్త్ర్యాఁ దతిగన్ నే నందునైకుందదన్. 300

క. అనినన్ విని హేమాంగదుఁ
డనియెన్ దశకంఠు గిందునై రోమనుఁడో
యనునవసరమున వాఁ డా
యినకులశేఖరునితోడ నిట్లనిపలికెన్. 301

గీ. భళిర జోగోరి క్షత్రియబ్రహ్మచారి
భూరివాచాట నేఁడీ వపూర్వశిల్పి
వలె దశాననసత్కీర్తివారిజారి
యెడ కళంకంబు వ్రాసెన వాఁడలుమఱచి. 302

వ. కావున నీ విక లేవనిశంచుకొమ్మనిన విని హేమాంగదుం
డు ససంభ్రమంబుగా సఖునకిట్లనియె. 303

మ. మహిళాస్త్రప్రకరంబుచేత నిదుగో మందోదరీభర్త యి
మ్మహి దార్ద్రివ్యముఁ బొందఁ జేసెవన నమ్మాణిక్యచూళుండు ని
మ్మహిజానాథుఁడు నట్లనేరయునరిచా [illegible] విలోకింప దు
స్సహమైయున్నది యంచు నవ్వి మఱి వాచాపాటిచే నిట్లనెన్.

గీ. రాఘవవిఖండితాసురరాట్చిరాళి
ఫలపమన్వితపూర్వార్ధములనుచిత్ర!

సమగయప్రోతపశ్చిమార్థములు నవనిఁ
బఱచు నున్నవి గురులఘుభావములను. 305

క॥ అతుధ్వజదండయుగం
గతుత్రలచుట్టుఁబారి క్రవ్యాశికులా
ధ్యతునిరథమున క్రీడా
గతుల రఘురాముబాణతతులు మెఱంగెన్. 306

వ॥ నాప్పుడు కనకాంగదుండు కటకట బడుచు తడవుగనుంగొని వి
స్మయంబుగా రత్నశేఖరు నాలోకింపుమని యిట్లనియె. 307

కం॥ ధ్వాంతార్త్రతాత్ర యుడుఁ దు
ర్దాంతాశుగవృష్టిచేత గాఢాబాధా
త్యంతారిభయంకరజం
భాంతకరథ మలమె దానవాధిపుఁడింకన్. 308

క॥ నానావిధశస్త్రంబుల
నానావిధశస్త్రఖండనం బొనరిచి యా
దానవరాఘవపుంగవు
లానిరి యొండొరులు సమత నతిభీకరులై. 309

వ॥ అన మణిశేఖరుండు కనకాంగద నీవలుకెల్ల సత్యమే
మన బహుబాహుల్ దితిసుతాధిపుఁడేసిన బాణకోటి వి
చ్ఛినవిశి రాఘవుండు రెండు భుజద్వయిఁద్రుంచె బలంబు తుల్యమై
వను నంపీర చాతురి ఘనంబుఁ గుఱో పదిసాళ్ల వాసికిన్. 310

గీ॥ అనిన హేమాంగదుఁడు నవ్వి యసురవిభుఁడు
బాహువింశతిచేత ద్విబాహు వాఁడ

దాకనేని యనిందితద్వంద్వయుద్ధ
మూనఁడే యని కడుఖిన్నమానసమున. 311

క. వెండియు నను రావణుఁడా
ఖండలరథశత్రుభయదగాఢపతాకా
దండాంకితశిఖిపింఛము
ఖండించెఁ బ్రచండకాండకాండముచేతన్. 312

వ. అనిపల్కి రత్నశేఖరుండు వెండియు నిట్లనియె వయస్య రఘు
పుంగవుండు మఘవత్కృతనావమానఘటితలజ్జాభరదుర్ధర్షా
మర్షకషాయితాత్ముండై యిపుడు. 313

మ. అతులాశద్విపదానగంధిలసమీరాస్వీతపత్త్రాళిసూ
చితదైత్యప్రళయంబులై మఘవదోషిన్నేత్రబాష్పంబువ
ర్షితశాపగ్రహకోటులై యెసఁగునస్త్రవ్రాతముల్ గొన్ని యా
దితిజాధీశునిమౌళులన్ బఱపి నుదస్ఫూర్తిన్ నిరీక్షించితే. 314

గీ. అనవుఁ డిట్లను సఖునితో నసురవిభుఁడు
మకుటపరిభవసంభవామర్షమునను
జగము బాణాకర్షోద్వేగముగ నొనర్చి
యతిభయంకరస్ఫూర్తిచే నంత మఱియు. 315

క. క్షితితనయాపత్యోరుహ
పతితశతినభావసాక్షి జన్మాంతరసం
గతమాకాన్తుఁడ మగు రఘు
పతిపట్టము డాక నొక్కబాణము నేసెన్. 316

వ. అనిన సవిశేషంబుగా రాఘవునింగనుంగొని కనకాంగదుండు
వెండియు సుహృద్వరున కిట్లనియె. 317

మ॥ భువనాపూర్వభిషగ్వరుండు ధరణీపుత్రీప్రియుం డుజ్జ్వల
త్కవచోద్భేదనరావణాశుగము వక్షఃపీఠిపై నాట దృ
గ్జ్వరరాశిస్రవదస్రఘూత్కరణయుగ్వక్త్రారివర్గంబు చే
నవురా తెల్వెడుఁబో వ్రణంబు లొకవే యంచుం జెలీ కంటివే. 318

క॥ అనవుఁడు మునిశేఖరుఁ డప్పు
డొనసినహర్షంబుతోఁ ద నిట్లనిపలికెన్
దనకూర్మినయనుస్యూనితో
ఘనతరవాచానిరూఢి గడలుకొనంగన్. 319

చ॥ క్షితిదనయాకుచస్త్రబకచిత్రితకుంకుమపత్రలోపదు
ర్గతిజనితాఘుయుక్తమగు రావణవక్షము గాఢ నేసె ను
ద్ధతి రఘువీరుఁ డొక్కనిశితప్రదరంబున నైంద్రవారణా
యతదశనాహతిక్షతసమగ్రచతుర్వ్రణమధ్యవర్తిగన్ 320

చ॥ అనినను విస్మయంబు మది నావహిలం గనకాంగదుండు వ
ల్కెను జెలి రావణుం డడను కేలనువాటిన యమ్ముఁ దీకుచున్
గినుక నదేమొ పల్కెఁ జుమి నీవు వినంగదు నాఁగ నంత న
ద్దనుజవరేణ్యుఁ డిట్లనియె దాశరథింగని యాగ్రహంబునన్. 321

మ॥ భళిరా! మానుషసింహ దానవచమూప్రాణాళివిద్యాసమా
ప్తిలిపీభూతమురారిచక్రమిటమక్షీమోనువక్షంబునన్
దళితారవ్రజకాంతిలేశరణితోద్యద్భూషణం బయ్యె నా
కలితోరస్థలి నెట్టనేసితివి వక్కాణింతు నీనత్వమున్. 322

వ॥ అనిన నాకర్ణించి రత్నచూడుండు సువర్ణాంగదున కిట్లనియె. 323

చ॥ గురుమునశాస్త్రవాక్త్రభవకోపసమన్వితరాఘవాశుగో
త్కరము రయంబునన్ బసిమె గంటివె రాచెలి వ్యగ్రయుక్తను

స్థిరతరచంద్రహాసనియతివ్రణజాతకిణాళి లెక్కఁగాఁ
బరివిహితాచ్ఛహారచయపఙ్క్తిశిరోధిశిరోధిపీఠికన్. 324

మ॥ సమదారాతికఠోరవాక్పరుషకోపప్రజ్వలద్భూమిజా
రమణాస్త్రప్రకరంబు స్వప్రహితజాగ్రచ్చంద్రహాసప్రణ
క్రమసంజ్ఞాతకిణచ్ఛటావలయరేఖాధిక్యక్లృప్తైకావళీ
రమణీయం బగుఁ పఙ్క్తికంధరగళవ్రాతంబునన్ బ్రాలెడిన్. 325

సీ॥ అన హాటకాంగదుం డాప్తునిఁగనుఁగొని
కడుఁ జమత్కారంబుగాఁగ ననియె
ననుయూపవీరమహాహవసంతోష
పాటవద్విగుణితబాహాగర్వ
మంథానవిర్మథ్యమానలోకత్రయ
జలరాశి యగు నిశాచరవిభుండు
కుండలితాత్మకోదండచండోన్ముక్త
కాండపంజరమధ్యకలితుఁ డగుచు

గీ॥ వర్తిలుచునున్న జానకీవదనిఁ గేళి
కావిహంగంబుగతి నెంచి కౌతుకమునఁ
బాదలుచున్నాఁడు చూడు మిప్పుడు వయస్య
యనుచు నొక్కింతచింతించి యంతమఱియు. 326

చ॥ ఖర మొగయుంగఁ గ్రుంగ వివృతప్రవిలీనఫణామణీతటి
ద్భరమున మాటికిన్ భుజగధామతమం బణఁగించు శేషుఁడ
య్యురుభుజకేళివల్గనసురోత్తమపాదభరంబుచేఁ గడున్
సొరవుగ నూర్పుఁబుచ్చు నిదినిక్కయ మంచువచించున త్తఱిన్. 327

వ. రత్నచూళుండు వయస్యా నీపలుకు నిజంబని సభయంబుగా మ
ఱియునిట్లనియె. 328

మ. దితిజక్ష్వేళమహారవోచ్చలితవార్ధిన్ వ్యక్తమౌ నాగన
క్రతతిన్ మార్గ్యాసదిగ్గజాళి విమరన్ క్ష్మాభార నూశేషు దం
గతతిం దాగను సంగరంబుల వభుల్ గన్పట్ట ఖర్వత్వవీ
వతలుం గల్గినమేనిచే ఫణపరీణామంబు వోఁదాల్చెడిన్. 329

మ. అనుచుం బల్కి చవల్ గనుంగొని వయస్యా చేరనే తెంచె నా
య్యైన వైమానికకోటిఁ జూచుమనఁ గల్యాణాంగదుం డప్పు డి
ట్లనుఁ జాతుర్యముతోడ నోయిచెలి వీరాగ్రేసరుల్ పేరిచే
నొపరింపంబను లోకభీకరమహాయుద్ధంబు వీక్షింపుమా. 330

సీ. గాధిసుతదత్తఘనదివ్యకాండమంత్ర
సంస్మరణ రామభద్రుండు సలుపునెపుడు
దితిజపతియును బ్రహ్మోపదిష్టవివిధ
శస్త్రవిద్యానుసంధానచణత మెఱయు. 331

క. కావున మనమును డగ్గఱఁ
బోవలయునటంచుఁ గదలిపోయెను వేళం
దా వెండియు నని భువికి మ
హావస్థ ఘటిల్లెనిప్పు డరయుముదీనిన్. 332

వ. అనిచూపుచుఁ దాక్రమము భానవీయంబునఁ గచ్ఛరంబు రా
హవీయంబునఁ దత్సాయకంబు వైష్ణవంబునఁ దచ్ఛలీముఖంబు
శాప్ప కేతవంబునఁ దస్త్రదరంబుఁ బాశుపతంబున నొండొంటి
మింటనంటిగెంటక తుంటలు సేయుచున్న పౌలస్త్యకాకుత్స్థవీరు
లకు నిరంకుశసంకులసమరం బయ్యెనన విని రత్నశేఖరుం డిట్లనియె.

చ॥ ఇరువురకృత్యముల్ సమము లేమనవచ్చు జయేచ్ఛ రావణుఁడున్
మఱి వధియింతు నే ననెనుమర్త్యగిరిన్ దశకంఠుఁడున్ వడిం
బఱపిన సర్వశస్త్రము లశంకగతిం దగనైనఁ దన్ముఖ
స్ఫురితసమస్తదేవతలు బొందిరి యల్పపటుత్వ మెట్లనన్. 884

చ॥ దనుజవరాశుగాగ్రయుతదైవతముల్ రఘువీరుఁ డాకు నా
ననరున మెల్లనే యతనినిష్ఠురబాణముఖస్థదేవతల్
ఘనతరభీతి వానిమెయి గాసియొనర్పఁగ నోడి రిగతిన్
దనరు మహాద్భుతంబు లివి తప్పక కన్గొనఁ మంచుఁ బల్కఁగన్. 885

వ॥ అప్పు డనతిదూరంబున. 886

చ॥ ధరణిసుతామనోహరుఁడు దారుణశస్త్రములన్ దశాస్యుపై
శిరములు గొన్ని ద్రుంచినను జిక్కినమస్తకముల్ దదంశవి
స్ఫురణ సిరుల్ దొలంకుఁ గరముల్ మఱికొన్ని ద్రుంప నిల్చునా
కరములు తత్పరాక్రమముగైకొని మత్తిలుచుండు మెండుగన్. 887

సీ॥ అని వినసైన వా రాలించి యిర్వురు
హర్షరోమాంచయుతాంగు లగుచు
శబ్దోపలంభనసంవర్తనక్రియ
నెవ్వఁడో కో భువనేంద్రియముల
నొగిఁ దృప్తిఁ బొందించుచున్నవాఁ డనుచును
బల్కుచో మఱియు నప్పట్టునందుఁ
గలకలంబొకటి యాతుణమై పుట్టిన దాని
విని భయాద్భుతసమన్వితులు నగుచుఁ

గీ॥ గపటకంఠీరవాకుంఠకంఠకలిత
కహాకహా రావఘోరమై కదలుపుట్టి

గాఢనిర్ఘోష మహాహా యకాలమందె
పగులఁ జేసెను బ్రహ్మాండభాండ మెల్ల. 338

వ॥ అని వెండియు. 339

గీ॥ కాలకూటానలోపదిగ్ధంబులైన
ధ్వనుల భువనాలి మూర్ఛనొందఁగఁ జేయు
భైరవుఁ దలంచునో చీన భ్రాంతిఁ జెంది
బ్రహ్మ నేఁ డన మఱియునప్పట్టునందు. 340

మ॥ జగదాపత్కరదివ్యసాయకములన్ జన్యంబుగావించి పై
కెగయంగొట్టినమస్తకంబుల నభంబే కాద శార్కాప్తి నెం
దఁగ రామాశుగయోగపీఠవిహితోద్యద్బ్రహ్మశక్తిన్ తుదిన్
డాఁగి దైత్యేంద్రకబంధ మిత్తఱిని జెందెన్ వీఁకయాస్థలిన్. 341

వ॥ అని వినంబడియె నప్పలుకు లయ్యిరువురు నాకర్ణించి సాశ్రు
సంభ్రమంబుగా నూర్ధ్వభాగంబవలోకించి యాశ్చర్యంబునొంది
యాప్రళయకాలాభీలకరాళానలజ్వాలికాపుంజపింజరంబులైన
పౌలస్త్యమస్తకంబు లవలోకింపుమని యొకరి కొకరు హెచ్చ
రించుచు సమీపంబునకుం బోయి క్రిందుగాఁ బరికించి రయ్యెడ
హేమాంగదుండిట్లనియె. 342

మ॥ దళితైరావణకుంభికుంభయుగళీధారాళముక్తాస్రజా
ఫలలోకాతిజయప్రశస్తిరచనాక్షీణాతురక్షోణిపై
కలితాదిత్యవధూకపోలవిలసత్కాశ్మీరపత్రావళీ
కులనిర్వాపణదోర్వ్యథాతివగు నీకున్ బ్రొక్కెదన్ రావణా. 343

వ॥ అని యతనికభివాదనంబు నేసి సఖున కిట్లనియె. 344

మ॥ గురుదైత్యేశకబంధభారమునఁ దాఁ గ్రుంగంగ వేలాధరా
ధర మత్యున్నమితాంగరాగభుజగేంద్రస్వామి దుర్వ్యాహ్యయా
ధరణిం దాలుచు నర్ధకుండలితగాత్రవ్యస్తశాంతస్ఫుటో
త్కరుఁడై నావుఁడు రత్నచూళుఁ డనియో ధారాళవాచార్భటిన్.

క॥ ఓమిత్రాగ్రణి యిత్తఱి
నీమాటనిజంబ దైత్యనేతశరీరం
బేమందును మున్ను మహో
ద్దామతఁ దనరునదిగాదె తగ నెట్లనినన్. 346

మ॥ బలసంక్షోభితలోకదారుణకకుప్సంచారవేళా చలా
చలధాత్రీధరమూలనిష్ఠురశిలాసంఘృష్టమాణిక్యసం
కులజల్పత్ఫణపఙ్క్తి చే నిజచమూకోటీసమావేష్టితా
కులగాత్రుండయి భోగిభర్త నిబిడక్షోణిన్ ధరించుంగదా. 347

వ॥ అని పొగడియు నీదైత్యాధిపదేహబంధ ముత్క్రాంతప్రాణా
నిలంబై నదిగావున నిప్పుడు మిగులదుస్సహంబయ్యె నవ్వుడుఁ
గనకాంగదుం డిత వేత్రాల్క దిక్కు భరికించి వయస్యా చూ
డుమనియిట్లనియె. 348

సీ॥ తనుఁజూచి సారెకుఁ దరుచరుల్ చపలత
ననుసరించుచుఁ జెరలాడుచుండ
న్వాఱిశింపుచు దైత్యనారులు ద్రెవ్వ లోఁ
గుములుచుఁ దోచు నూళ్ళతోడ
మదిలోవనిల్వక మట్టుమీఱినయట్టి
ఘనతరశోకవైక్లబ్యమూని

శోకప్రకారమై కడలు కాతరరావ
మునఁ బల్కుచును బెట్టు మోదికొనుచు

గీ॥ వేగ మందోదరీసతి వీరపత్ని
యాశరాన్వయవరకబంధాభిముఖము
గాఁగఁ జనుదెంచి తనమోము కాంతుమేని
మీఁదఁ జేర్చి విలపింపఁగాఁదొడంగె. 849

చ॥ చెలువుఁడ భర్త యేవగుటచే సతియయ్యెనఁ బెక్కుమోములన్
బలుమఱు జుంబనక్రియలు మాటి కనేకభుజోపగూహనా
కలనయు గన్న యిమ్మెయినికన్యకిభానను నెత్తిముత్తియ
మ్ములసరు లిత్తువన్ శపథమున్ గడతేర్పక నిద్రఁజెందితే. 850

చ॥ అని విలపింపఁజూచి యతఁ డాతనిగన్గొని శాత్రవాళికై
వను బగదీర్పనంతటిఘనంబగు నీతెగవారిదుఃఖముల్
గన వినఁగా నశక్యములు గ్రక్కున మానపమన్మఖుంతసం
బానరు మహా యసాధ్యమున నున్నది కాలునకంచు వెంచియున్.

క॥ వందనకృద్భందీకృత
బృందారకమాళిమాల్యబృందాసవమున్
మందోదరి కర్కశతం
బొందించుఁ బదాబ్జరేణుపుంజముచేతన్. 852

గీ॥ అట్టి మయుపట్టి జగజెట్టియైనయట్టి
దిట్టరాకాసిరాచెట్టబట్టి యిట్టి
చెట్ట నిట్టయ్యె నక్కటా రట్టడైన
గట్టువిలుబట్టుదొరకోర్కె నెట్టువడునె. 853

వ॥ అని విచారించుచు. 854

సీ॥ మందారభూరుహబృందముల్ వనదేవ
గలు చేర్చి రిపుఁడు నందనవనంబు
వల్లభపాలుండు వాసవాశ్వంబును
బొందించె నాత్మీయమందుర గడ
నలవిభీషణవయస్యావళి యమరులఁ
బనివడి వెడలించెఁ బందిగంబు
తేజ్జనంబులఁ జూచి తలవంచికొనిచాల
జంభారి యొందె లజ్జాభరంబు

గీ॥ ననిన విని రత్నచూడుండు హర్షమొదవ
నసురనాయకకారాగృహాధివాస
చిరతరవియుక్తబాంధవశ్రేణి నరయఁ
బోవుద మటంచుఁ జెలిఁగూడిపోవునంత. 855

క॥ ఒకరొకరిని గనుఁగొను ముని
యకలుషకౌతూహలమున నలరుచు వారల్
బ్రకటితజయుఁ డగురఘునా
యకునిఁ వీక్షించి పలికి రాశలుపొంగఁ. 856

సీ॥ ప్రహరణవిహ్వలప్లవగాదిసంవర్గ
ణవ్యగ్రసుగ్రీవభవ్యుఁడగుచు
సౌమిత్రిఘనభుజాస్తంభవిన్యస్తప్ర
చండతరాత్మకోదండుఁ డగుచు

ప్రాంతవిసీతిని తాంతనమ్రవిభీష
ణాంసకస్థాపితహస్తుఁ డగుచు
పరవిజయేంది రాపరిణయకౌతూహ
లాతిప్రకాశమానాంగుఁడగుచు

గీ॥ ధరణితనయాముఖాంభోజదర్శనైక
లాలసాలోలమత్తరోలంబుఁ డగుచు
నతిశయిల్లుచునున్న వాఁ డనుచు మఱియు
నవ్విమానచరాగ్రణు లనిరి ప్రీతి. 857

మ॥ దితిజాధీశ్వరశక్తిజవ్రణకిణాప్తిం బొల్చు సౌమిత్రి యా
యతవక్షస్థలి గాంచి నాన యఱి సారాంభోజపత్రేక్షణా
తతనిర్ముక్తసుమాభిషిక్తుఁ డయి సీతానేత యొప్పెం బుల
స్త్యతపస్విప్రియకృద్విభీషణమహాసామ్రాజ్యసంధాతయై. 858

వ॥ అని వర్ణించి హేమాంగసరత్నచూళు లాత్మీయలోకంబునకు
నిర్గమించి రంత. 859

మ॥ స్ఫటికాక్షస్ఫటకాయ కాయజనన ప్రాణాపహారిచ్ఛట
చ్ఛటదీక్షాగ్నిసహాయ హాయనపరిచ్ఛేదాత్మచాపప్రమో
త్కటసంవత్సరసాయ సాయకితమాకాంతాధిపోన్మాలితో
త్కటవక్షస్సమవాయ వాయసదృశాభంగప్రదారాధితా 860

క॥ సంకల్పసూత్రకల్పిత
పంకేజభవాండభాండపటిపోషణ ని
శ్శంకితమహిమా హిమాచల
జాంకితవామాంగ మంగళాంచితభక్తా. 861

భుజంగప్రయాతము. కరాంచత్కుఠారంగా సగంగోత్తమాంగా
యురస్సద్భుజంగా మహోక్షేట్తురంగా
నిరస్తద్విడంగా ధునీరాణ్ణిషంగా
ధరిత్రీశతాంగా కృతవ్యాళధంగా. 361

గద్య. ఇది శ్రీమద్రామేశ్వర శాశ్వతకృపాకటాక్షవీక్షణాసాదిత
సకలసామ్రాజ్యధౌరేయ శ్రాంతవిశ్రాణనావధీరిత రాధేయ
బిజ్జులకులకలశనిధానకార్త్తికనిశాకళత్ర వెన్నెళగోత్రప
విత్ర కృష్ణరాయమహాధవకుమార సంగరాంగ
ణకుమార దయాగుణగోపాల తిమ్మభూ
పాలప్రణీతంబైన యనర్ఘ రాఘ
వంబను మహాకావ్యంబునందు
చతుర్థాశ్వాసము.





శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీహయగ్రీవాయనమః

# అనర్ఘరాఘవము

## పంచమాశ్వాసము.



శ్రీ కృష్ణాకల్లోలవ
తీకపటాభ్రావగాఢభృతిస్ఫురితజటా
శీకల్పకలతికారా
జీకుసుమత్రారకేశ శ్రీరామేశా. 1

వ॥ అవధరింపుము. 2

మ॥ గిరిమం జీకటిచేత సొమ్మసిలు లోకశ్రేణికిఁ వైద్య శా
కరముల్ గల్గి కకుత్థ్సవంశపతియై కప్పట్టుభానుండు ది
గ్వరులంగూడి పురస్థుడై చనఁ బరాగారస్థితిం జెందు నిం
ద రహింం ఛాయఁగ నగ్నిఁ జొచ్చి వెడలెఁ ధాత్రీజ శుద్ధాత్మయై.

మ॥ సురవైరివ్రజమస్త్రముల్ దనదు తేజోవహ్నిలో మున్న వి
స్ఫురణన్ వేలిచి కైకసేయశిరముల్ బూర్ణాహుతింజేసి యా
చరితస్వస్త్యయనుంబు పిదప నైరావ్యాకుండు బందీకృతన్
ధరణీజంగని శోకవార్షముల నానంజెండె జాడ్యస్థితిన్ . 4

వ॥ అప్పుడు. 5

చ॥ క్రమమున రాఘవుండు కపిరాజవిభీషణు లంటికొల్వఁగా
బ్రమసముతోడఁ దమ్ముఁడును భార్యయుఁ బార్శ్వయుగంబునిండఁగా
నమరవిరోధిమందిరసమాహృతపుష్పకరాజ మెక్కి య
ర్యమకులవృత్త మేధ్యయగు నట్టియయోధ్యకుఁ బోఁ దలంపఁగన్. 6
వ॥ అయ్యవసరంబున సుగ్రీవుండు రామునకిట్లనియె. 7
మ॥ వివరింపం దశకంఠవిక్రమకథావిర్భావభంగశ్రేణి భృ
త్యవరీభూతపయోధిసేచితగృహోద్యానంబు నా లంకయుం
దు విపన్నాసురరాడ్విశాస్యములలో నూహ్నారునొక్కొక్కటిన్
దివిజేంద్రాక్షిసహస్ర మొందెముకము న్నిచే రఘూత్తంసకా. 8
గీ॥ అనిన రాముఁడు జానకి నరసి దయిత
భూరిరుచిమించు లంకకుఁ బూర్వభాగ
మున సువేలకుఁ బశ్చిమంబునను బరగు
మహిని వీక్షింపుమా యని మఱియు ననియె. 9
శా॥ నీకై కూలిన దైత్యదానవవరానీకంబు దేహాళి న
స్తోకోగ్రత్వము జెందె యుద్ధరణి యుచ్చైర్భీతి నిప్పంటికిన్
పీకం గూడెను రక్తసింధుతతులన్ వేయింటి నిం దబ్ధియున్
నాకస్త్రీలును జెంది రిందుఁ బతులన్ సల్వంద వేలతులన్. 10
ఉ॥ ఇందుల మేఘనాదుని యహీనతమోమయబాణరాజిక
ల్పం దనుదృశ్యమానఫణిశక్తిఫణామణిరాజమాత్రయా
చందనపాళి నస్త్రవరసంతతిగా గొని వానరుల్ నభం
బందుక జ్యోతిరింగణమయంబుగ జేసిరి దాని జానకీ. 11
సీ॥ అనినవిని సీత యోస్వామి యార్యపుత్ర
పన్నగాభీలతరపాశబంధదుఃఖ

మకట నాకయి మీచేత ననుభవింప
బడియెగడ యన నానంచుఁ బలికి మఱియు. 12

క. తురగముల నమిలి మ్రింగుచు
గరిమఁ దద్భోగమణుల ఖనియని యుమియుఁ
వెరనార నిట్లు ఖగకుల
వరుడా యహిబంధపారవశ్యము మాన్చెఁ. 13

వ. అని కొండొకవిచారించినసంస్మరణంబు రానక్క టావిషధరజాతి
యెంతవిషమంబని యిట్లనియె. 14

సీ. అఖిలరసంబుల నాస్వాదన మొనర్ప
సవరించుకొని రసజ్ఞాయుగంబు
శబ్దము రూపంబు సారెకు నాలింప
నీక్షింపఁగను నొక్క యింద్రియంబు
పాదముల్ కూడఁ తేఁబాటిలఁ గావించి
గమనంబు సల్పు వక్షస్థలమున
సకలసమీరణప్రకరంబులుండగా
భక్షించు నలజగత్ప్రాణవితతి

గీ. తల్లి కద్రువ వినుము నీతనయకోటి
యిట్టిక్రొత్తుకులఁ గంటివే యింతమీఁద
కాంచ వేయిట్టివారిని గ్రమ్మఱంగ
నీవె కనిమొదవేయనితేవఁ బలుక. 15

చ. అనవిని యందరున్నగిరి యయ్యెడ జానకిసానురాగయై
యనఘునిలక్ష్మణుంగని తదగ్రజుఁగూర్చి ప్రాణనాథ నీ

యనుజునికీర్తికందళచయప్రభవస్థలియొద్ది తెల్పవే
యన రఘురాముఁడిట్లనియె హర్షముతోఁ బులకాంకితాంగుఁడై. 16

మ॥ చెలువా యల్లదె మూఁడు దక్షిణమునం జేతెంట రాక్షసురేం
ద్రులసైన్యంబులలోన నిక్కలి ప్రవీణుల్ లక్ష్మణాంభోదనా
దులు వారిర్వురి ద్వంద్వయుద్ధమున శస్త్రాశస్త్రిసాక్షిస్థితిన్
వెలయంగన్నసువేలపాదముమ్మృగాభీలస్వనోద్భేదమున్. 17

గీ॥ అనినవిని సీతయోనాథ దనుజకాంత
యొకతె యనురాగజనితరోమోద్గమశ్రీ
మాంబుదీపితశమితప్రియచితవహ్ని
నను మృతింబొందుచున్నది యనిన నతఁడు. 18

మ॥ సరసీజేక్షణ యాను లక్ష్మణుని భాస్వద్వీరలక్ష్మీస్వయం
వరహర్షాయుతనంబిదే యిచట దుర్వారత్వరన్ ద్రోణభూ
ధరముం దెచ్చి మరుత్కుమారకుఁడు ముక్తదచ్ఛల్యముం బాపి యు
ద్ధురతన్ లోకచయంబు నెంతయును సంతోషింపఁగాఁ జేయఁడే. 19

వ॥ అనిన జానకి మనంబునఁ బవనతనూజుం దలంచి రఘూద్వ
హున కిట్లనియె. 20

సీ॥ నిబిడప్రతాప నిర్భిన్నద్రవానర రాజ
బంధుర సేనాధురంధరుండు
ప్రథిత రాఘవకుటుంబ ప్రాప్తదుర్వార
తరవిపద్వారాశితారకుండు
కఠినతమశోకశోకమత పాథిపయు
గ్లవన పాథోధిసంలంఘనుండు

దారుణవాలాగ్రగహన కీలాజాల
భస్మీకృతాసురపట్టణుండు

గీ॥ సాతురతుఃకులాధ్యతుశితుణాత్రి
నతురూత్నేతుణాతుయలతుణాధ్యు
డైన జగదేకవీరు డయ్యాంజనేయు
డిచటనున్నాఁడోయన రాముఁడింతికనియె. 21

చ॥ అమరవిరోధిభర్తృహతుఁడై పడమజ్జనకుండు సూర్యబిం
బమున దనంత గాననయి మక్కువనాజ్ఞయొసంగఁబట్ట బం
ధమునకు నర్హవస్తువు లుదారతఁగూర్చుటకై యయోధ్యకుం
బ్రమదముతోడ మున్న గనె వవనిఁబంపితిమంచుఁబల్కఁగన్. 22

క॥ అంత రయంబున జలనిధి
పొంతకుఁ బుష్పకముచేరఁబోయిన నతఁడా
యింతికి వెండియు నను భగ
వంతున కివ్వార్ధికీవు వందనమిడుమా. 23

ఉ॥ ఈవనరాశిపుత్త్రి సిరి యెత్తఱి శౌరియెదన్వసించియున్
దావిహరించు వీరభుజదండముఁగన్ మఱిపుత్త్రుఁడై నరా
జీవవిరోధియన్న హరశీర్షవతంసకమయ్యె లోకభూ
షావరమై తనర్చు నని జానకితో నవిమర్శనంబుగన్. 24

గీ॥ తరుణి యీవార్ధివారిసుధాప్రకృతియ
గుట మహైశ్వర్యగూఢాదు కువలయాప్త
కౌస్తుభ శ్రీసురద్రుముఖంబులెల్ల
జలచిరమ్ముగుట యాశ్చర్యమిదియె. 25

మ॥ గురునాభీవనజాతసృష్టముఖుఁడై గూఢేతరాంగాళియై
నిరతం బంబుజసూతి యుక్తిని వర్ణింపంగ నీవార్ధియం
దు రహిఁ భోగిపశయ్యమీఁద భగవంతుండైన నారాయణుం
డితవందఁ శయనించియుండు సుఖుఁడై యిందీవరాలోకనా. 26

క॥ అనవుఁడు జానకి వనధికి
ననఘుమతి నృతియొనర్చి వయ్యెడ నన్నం
గని లక్ష్మణుఁ డార్యా! ధ
ర్మనిరతుల తపోబలంబు మహి నెక్కుడుగా. 27

సీ॥ విలయకాలంబున విశ్వప్రపంచంబు
గాసిల్ల నాశంబునేసె నేని
తనుడాయవచ్చిన ధారాధరవ్రాత
ములకుఁ బూర్తి యొసఁగి పొసె నేని
బాడబముఖఘోరపావక జ్వాలలఁ
దరలక సమ్మతిఁ దాల్చె నేని
యమృతాశనం బిడి యఖిల బర్హిర్ముఖ
శ్రేణిని గరుణఁ బోషించె నేని

గీ॥ యాకృతిస్థితిఁ దానెంత యుధికుఁ డేని
యాపశోనిధి కుంభజతాపసేంద్రు
నాగ్రహంబున నొక గ్రుక్కెఁ డయ్యెఁ గానఁ
దపములకునెల్ల సాష్టాంగదండ మిదిగో. 28

వ॥ అనుటయు రఘుపుంగవుండు సబహుమానంబుగాఁ దమ్మున
కిట్లనియె. 29

గీ॥ సముద్రికాంభోధి చుళుకమాత్రముగఁ జేయు
విపులగాంభీర్యమున నలవింధ్యశిఖరిఁ
దగ్గుపరచిన యుత్తుంగతం జెలంగు
కుంభజు గణింప మునబోంట్లకొలఁది యగునె. 80

క॥ ఈవనధిఁ జుళుకమాత్రము
గావించినకలశభవుని గాంభీర్యగుణం
బావింధ్యాద్రినడంచిన
కేవలభృతియును వంశంబె కీర్తింపంగన్. 81

ఉ॥ ఇంతియ కాదు పక్ష్మ! విను మెక్కుడ లార్యుల చర్యలెన్నఁ గ
ల్పాంతదినంబునన్ రవి సహస్రకరంబుల నీపయోధి య
త్యంతము పక్వమౌట ఘనమై కమసైంధవరాశియయ్యెఁదా
నంతనె కాలరుద్రభయదాగ్ని చటచ్ఛట మించ రూపఱెన్. 82

గీ॥ అనిన జానకి ప్రాణేశ! వనధిమధ్య
మున వసించిన లంకాఖ్యపోతమునకుఁ
గరము నేరెకుదీవితోఁగట్టినట్టి
శృంఖలయనంగ నొప్పె నిదేమి యనఁడు. 83

గీ॥ ముదిత! పతితపజ్క్తిముఖ కేతుదండాను
కారియగుమ మించి సారవంశ
తతవిపద్విభాగదాయాద సుగ్రీవ
చిరయశఃపటంబు సేతు విదియొ 84

గీ॥ అనిన విని సీత విగళిత ప్రాణనాథ
దర్శనాశాలతాంకురోత్పత్తి హేతు

భూత మగు మహౌషధిం బోలు సేతు
బంధ మిదియని ద్రొక్కె నప్పార్థివుండు. ౩౫

ఉ॥ దూరమునందుఁ జూచు సురలోయజగంధులనేత్రపఙ్క్తి కి
వ్వారిధి హారలక్ష్మిగతి వర్తిలి బల్పటికంపుసొంపుబం
గారపుగట్టు కాతుదలఁ గట్టిన సేతు వెసంగె నాయకో
దారత చీనిఁ జేయునెడ నైన రయోత్కానుక వార్త దెల్పెదన్. 36

గీ॥ అద్రిసంవేశమునను నత్యధికమైన
వితతకల్లోలరాశిచేఁ బ్రతిహతంబు
లగుచుఁ గ్రమ్మఱ నగముల నందినట్టి
నదుల కంభోధి యయ్యె జన్మస్థలంబు. 37

వ॥ అనిపలికి రఘునాయకుండు కపినాయకున కిట్లనియె. 38

చ॥ తతసేతుగ్రథనస్పృహోత్కకపియూథక్షిప్తధాత్రీధర
స్థితిచేఁ బొంగి ముహూర్తమాత్రము నదీస్రోతఃప్రవాహానుసం
గతమై పాటితతన్మహోకుహరసంఘాతప్రపూర్తిక్రియా
చ్యుతదర్పోన్నత మయ్యె వార్ధి యది నీయుల్లంబునందున్నదే. ౩౯

క॥ అనవుఁడు సుగ్రీవుండో
యనఘా! భవదీయచరిత మనిశము చిత్రం
బనఘ! ఫలకంబగు నా
మనమున వ్రాయనిది కలదె మఱి యదిగాకన్. 40

శా॥ సేతూత్సంగమునందు భూమిధరవిక్షేపోజ్జ్వలద్వారిసం
ఘాతంబై కడుశూన్యమైన జలధిన్ గాధంబుగా నిమ్నగా

ప్రాతంబప్పుడె సైంధవాస్యమధురస్వాదానుసంధాయితం
బ్రీతిం దత్తిమికోటికైయొసఁగి చేరెఁ భూరివేగంబునన్. 41

వ॥ అనిశపీంద్రుండు పలికిన విని విభీషణుండు మనువంశమౌక్తికం
బున కిట్లనియె. 42

చ॥ జలధి దరీముఖంబునను జయ్యనఁగ్రోలి చిరంబుఁజూడమిం
జలిమలపట్టిపై మనతిజాలొక్కను నక్రులు రెట్టియైన ని
ర్మలఝరవారి నింపుచును రాత్రుల సేతుగిరుల్ మహౌషధీ
విలసనలీల నాటి మన వేలమునుం దలపించె మిక్కిలిన్. 43

గీ॥ అనిన జానకి నగవుతో వనఘచరిత
యీశ్వరికిఁ దండ్రియైన గిరీంద్రుని యువ
రాజు వారిధిఁ జేరి పక్షహతిఁ బాసి
స్థావరమె యయ్యె నన రామచంద్రుఁ డపుడు. 44

గీ॥ ఔఁగదాతనతండ్రి యైనట్టి హిమగి
రీంద్రు సుతుఁడైనక్రౌంచాద్రి నడసి వార్ధి
మగ్నుఁడై తన రెక్కలు మనిచికొనియెఁ
గాక యెవ్వరిఁ బ్రోచె మైనాకుఁ డనిన. 45

క॥ విని జానకి లేనగ వా
నసమునఁ గనుఁ గందళింప నయవినయంబుల్
పెనఁగొనఁగ విమానంబుం
గనుఁగొని తానిట్లుపలికె ఘనమధురోక్తిన్. 46

సీ॥ ఘనవిమానాధిరాజ యాకాశసంగ
మప్రమోదనసముత్ఫుల్లమానసాబ్జ

నైతి నెగయుము నీవన నదియు నట్ల
యెగయ నతిఁ జూడుమని రాముఁడిట్టులనియె. 47

క॥ ఈపుష్పక మంబరమున
కేఁపగిదిన మెరుఁగుచున్న దెన్నికపకి యా
టోపంబునఁ గడు మిక్కిలి
నాపగిదిన దిశలు వెనుక యయ్యెడుఁ దోడ్తోఁ. 48

క॥ వినుమింతయు కాదంబర
వననిధియానంబులైన వనదము లస్కా
ప్తినొకించుక యొంచినవై
మనపుష్పక మొఱసి తిరిగె మానిని కంటే. 49

చ॥ గురుతరభీతిసన్నసితఘూర్ణితమైనవనేత్రపఙ్క్తికిన్
పరగున రూపసంగ్రహణశక్తి నిరోధము సేయుచున్ బయో
ధరతతి మాసఁగప్పు నెలతావులచేత నబాధ చంద్రికో
త్కరతిమిరాళి చిత్రముగఁ గన్పడఁజేసె నభంబు నంగనా. 50

క॥ అని పల్కు భానుసూనుఁడు
ఘనముగఁదాఁగ్రిందుసూచి కౌతుకమున రా
ముని గాంచి దేవ వీరిం
గనుఁగొనుమని యిట్టు లనియె గంభీరోక్తిన్. 51

గీ॥ పాడపగుటఁజేసి పాడకట్టఁబడని మిట్టు
పల్లములు గల్గి తమతమ వర్ణములన
యడఁగిన పదార్థములచేత జడనిధి వృత
మైన ధర చిత్రకుట్టిమం బనఁగఁ బరఁగె. 52

గీ॥ అబ్ధిభుజగేంద్రవలయిత మగుధరిత్రి
యనుఫణా మండలంబు లోకాచ్ఛరత్న
మై తనర్చిననినువంటి యనఘమతిని
గూడి గర్వించుచుండుఁ గాకుత్స్థతిలక. 53

చ॥ అనవిని జానకీరమణి యగ్రదిశంగని చూపుచున్ యుగాం
తనిబిడ వహ్నిహేతిపరితప్తపయోనిధిఫేనరాశి బా
గున గగనంబుతో నొరయు కూటసహస్రముచేఁదర్చుచున్
గననగు గట్టిదేమి యనఁ గ్రవ్యభుగీశ్వరుఁ డప్పుకిట్లనున్. 54

క॥ జనకాత్మజ యాముందర
గనునైనది మంచుఁగొండ కంతుని న్రకిం
దు నగాత్మజ మృతసంజీ
వని యైనమహౌషధివలె వడి జనియించెన్. 55

క॥ నావుఁడు జానకి కౌతుక
మూనిహిలఁగ నడిగె నిచట నభ్భగవంతుం
డావనజాస్త్రుఁడు హరదృ
క్పావకశిఖ కాహుతి యయి కరఁగె నదేలా. 56

వ॥ అనియడిగిన విభీషణుం జోయమ్మా యాననిమఱియుఁధరాకు
మారి కిట్లనియె. 57

ఉ॥ ఈయగముత్తరంబున రతీశుమృతిస్థితిసాక్షియైన య
త్యాయతదేవదారువనమందుఁ బురారి విలోచనత్రయం
బేయెడ తుల్యరోమ మగునేనియు నొక్కటి యుండుచుండఁగా
నాయురుధూమపీడ నిసుమంతయు నోరువ వన్యనేత్రముల్. 58

వ॥ అనిపలికిన విని రఘుకులుం డిట్లనియె. 59

క॥ హరునిటలాంచన్నయనాం
తరమున నొకవహ్ని కుసుమధనురింధనని
ర్భరరక్షితమై భువనో
త్కరనాశనహేతురీతిఁ దనరుచు నుండున్. 60

చ॥ అనవుఁడు సీత వల్లభుని నారసి యప్పుడు శంబరాహితున్
ఘనతరఫాలవహ్నిశిఖఁ గాలిచి నిర్దయుఁడైన యుగ్రుఁ డే
యనువునఁ గిన్కమాని కుధరాత్మజ నింపునఁ బెండ్లియాడె నం
చనిన రఘూద్వహుండు జనకాధిపనందనతోడ నిట్లనున్. 61

గీ॥ అతనుపరిభూతి నిస్సహాయాతిదీర్ఘ
ము లగు తపముల శివుఁ డాత్మమూర్తి యొసఁగె
తనదుచేత ద్వితీయుఁడై తనరుచుండఁ
బార్వతి దనర్చె మిక్కిలి భవ్యలీల. 62

వ॥ అనిన విభీషణుండు సపరిహాసంబుగా నిట్లనియె. 63

గీ॥ ధరణిభృద్వరకన్యక తడవు దపము
సలిపి గోపకపాలభుజంగపతులె
ధనముగాఁగల్గు రుద్రునితనువు సగము
దాత సగముదాతవ్యమై తగ నొనర్చె. 64

మ॥ అనినన్ జానకి నవ్వి మోదమున దైత్యాగ్రేసరుం జూచి యో
యనఘా! యెయ్యది సర్వమంగళవివాహం బైన దేశం బనన్
వినయం బొప్ప నతండు వల్కె విను దేవీ! యోషధిప్రస్థమన్
ఘనసీహారగిరీంద్రపట్టణము వెక్కం జొప్పగున్ ముందటన్. 65

గీ. త్రిపురహరుఁ డిచ్చట మహౌషధీమయుఁ డగు
భూమిధరశేఖరుఁడు ధారవోయ గాఢ
వలయఫణిభీతిఁ బాసిన చెలువ నగజ
నపుడు పరిణయమయ్యె భవ్యంబుగాఁగ. 66

మ. అనుఁడుఁ గా రాముఁడు పల్కె నా నది నిజంబా గారి కాఁ దంద్రికై
నగేంద్రుండు స్వకీయభూరిహిమసంతానంబుచేతన్ రచిం
చిన హేమంతముకల్మి నప్డు విమనిశ్శేషాహిభూషాళిఁ దా
ల్చినభూతేశునిచెట్ట నిర్భయముగాఁ జేపట్టె ధాత్రీసుతా. 67

గీ. అనిన జానకి నవ్వి రఘూయధిప ! యిచట
దగ్ధమదనవపునస్సృష్టిఁ దలఁచియు శివ
ముగుడఁ బొలియించు నంచు నమ్మిక నిజాంగ
మునను ఘటియించెఁ బ్రాణేశ్వరుని నిజంబు. 68

వ. అనిన దశస్యందననందనుండు మందస్మితకంకళసుందరముఖార
విందుండై యిట్లనియె. 69

గీ. ననసగంబునఁ బ్రియసగంబున నిటునటు
నభవుఁ డర్ధనారీశ్వరుం డైనఁ గడమ
యర్ధముల నటునిటుఁ గూర్చి యగజచెలుఁవు
మఱియు నొకయర్ధనారి నమర్చి నగిరి. 70

మ. తనుచే నేమిధునంబు దర్పణమునన్ దర్శించ వ్యత్యస్తమై
యమరన్ శంభుఁడు మాంచు శైలసుతసవ్యాంగస్థితిచ్ఛాపర
త్వము సంభోగరసాభశుంభదనుభావస్ఫూర్తియుగ్విప్రలం
భముచేనింది మిథస్సమేతమగు నాథవ్యాకృతిం గొల్చెదన్. 71

వ॥ అనిపల్కు నవసరంబున విభీషణుండు ధరాకుమారి కిట్లనియె. 72

సీ॥ ఉభయాభిలషితమై యుబ్బుమీరిన యొంటి
సిబ్బెంపుజనుఁగుబ్బ చెలువుగలిగి
యుభయభాగంబుల నుదుటువెన్నెలఁగాయు
రేఁగొమ్మచుట్టంపు రేక గలిగి
యుభయపక్షంబుల శుభలీల వలగొని
తగుపాపరాజన్నిదంబు గలిగి
యుభయపార్శ్వంబుల విభవంపు రాకయే
కతవిరాళ్లెము కొనఁగలిగి

గీ॥ యఖిలదాహకోజ్జ్వలజ్యోతి యర్ధమందు
నర్థమందుఁ గృపాబాష్పమడరి యొండొ
రు వరుఁగింపంగ సిమసిమధ్వని గడంగు
నుదుటికనుఁగల్గు మిధున మూన్చుత శుభంబు. 73

గీ॥ ఘర్మజలసిక్తవామభాగస్తనాచ్ఛ
పత్రకౌశికకరలిప్తభస్మమగుచుఁ
బరగుశ్రీపున్నఘాంసకపగపవప్ర
కృతినిదను శంభు మేనొకరు లిచ్చుఁగాత. 74

వ॥ అని వేరొకదిక్కుఁ జూపుచు మఱియు నిట్లనియె. 75

మ॥ స్ఫురదాధారతఁ గూర్మపృష్ఠకషణక్షుణ్ణాశ్మమూలంబు మం
దరశైలంబు సురారిసూదనభుజాదారాంగదన్యస్తభా
స్వరవజ్రాంకురఘృష్టణాంకవలిసంసక్తాంగకశ్రేణిచేఁ
బరమానందముఁ జూపుచున్న యది యంబా! శర్వాణియాతోఁ.

క॥ కేవల మీమందరగిరి
యావిధి మథితంబుగాక యటమున్న మహా
శ్వావాప్తిం గనుఁగన్నది
నావుఁడు రఘునాయకుండు నగి యిట్లనియెన్. 77

మ॥ విను మాఘోరగరుచ్ఛిద్రాణముమహాశ్వేధన్యధాహేతులో
చనకర్ణాధిపరజ్జుకర్షణముఁ దా సైరించి యాదుష్టసుం
ధనగం భాకలుపాత్మయాసిరి సముత్పాదించి లోకం బహో
యనిశం బీశ్వరదుర్గతవ్యవహృతివ్యస్తంబు గాఁ జేయదే. 78

గీ॥ అనిన జానకి వేగ యీయద్రిమంద
శోషితపయోబ్ధియందు శశిని జనింపఁ
జేసి విప్రయుక్తేశ్వరస్త్రీలమొదల
నారథటిఁ జూపుచున్నది యనుచుఁ బలుక. 79

మ॥ విని వారందరు పవ్వ దైత్యపతి యూవేళన్ రఘూత్తంసుఁ డా
డినమాటల్ బరికించి యిట్లుపలుకన్ డెంకంబులో నీరమున్
వనధిన్ గ్రమ్మఱ వేయఁజూతు నయినన్ దన్మగ్నుఁడై నిచ్చలున్
జననం బందెను చంద్రుఁగాంచి వెఱ నంతన్ మానితిన్ ద్రోయకన్.

వ॥ అనివిచారించి మరియు నిట్లనియె. 81

మ॥ రమ! యేమో కపటంబుఁగోరె రమశోకపీశదీప్తాసిక
త్వమునే మించిన నీకుఁ మ్రొక్కి యిఫ్ఫుడే వాచింతుఁ గోపంబుచే
యమి నిక్కంబగునేని బన్నగిమవిద్యాగేహమందుండి ని
త్యము నీచాధికనీచసప్పణము నీరాచార్యుచేఁ గంటివో. 82

వ॥ అనిన నమ్మాటలకు నవ్వి సౌమిత్రి యిట్లనియె 83

సీ॥ నిర్జరాసురమల్లనివహారభటికావి
జయతూర్యతాళలాసిక యనంగ
శాశ్వతవిశ్వవిశ్వంభరాధీశ్వర
వారదార్జనఖర్జూర యనఁగ
కైటభాసురభేదికాలజీమూతవి
లాసోరుచంచలాలతి యనంగ
సాహసికానేకశస్త్రాస్త్రమయతమో
వ్యూహవిహారఖద్యోతి యనఁగ

గీ॥ పటఁగిగణవత్సమాజోచ్చపదవి గోరి
వీఁకఁ గౌక్షేయకశ్రితవృత్తిఁ గాంచి
ఖడ్గధారావ్రతనిరూఢిగరిమఁ గాంచు
సిరి నుపాలంభనం బిట్లు సేయ నగును. 84

వ॥ అనిన విని యమ్మిథిలాధిపతనూభవ యభ్యసూయనుం బోలె
నిజపూర్వకర్మదుర్విపాకవిచారభారాలసంబైన యాలోకంబునా
రతంబు ముకుందహృదయారవింద మందిర యగు నిందిరపై న
మందదుర్యశోగీతంబులు పాడుచున్నదియనిపుణోభాగం బవలో
కించి చూపుచు దివసరాశీకృత సాంద్ర చంద్రికాసంకాశంబై
ప్రకాశించు నిద్ధరాధరంబు నభిధానం బెయ్యది యని యడిగిన
విభీషణు డిట్లనియె. 85

మ॥ సతతస్ఫాటికభూజ్వలద్ద్యుతిచయచ్ఛన్నద్రుమచ్ఛాయ త
త్ప్రతిబింబంబులఁ గల్గఁ జేయఁదగుచుఁ గ్రాంతిస్ఫురద్భానుహ
స్తతతాంభోరుహమర్ధనీ లనము గాంచం జేయు భర్గోత్తమాం
గతఁ బొందుస్ఫుటదీప్తి నొప్పు నిది యాకైలాస ముర్వీసుతా. 86

గీ॥ అనిన రాఘవుఁ డబ్బురం బంది యాగి
రింద్రము బహువిధంబుల దృశ్యమాన
మయ్యెఁ గన్నులపండువై యలరుచున్న
దనుచుఁ బలుకుచు మఱియు నిట్లనియె నపుడు. 87

మ॥ బలవద్రావణబాహుభూషణమణిప్రాగ్భారసంఘర్షణో
జ్జ్వలరేఖామకరాంకముద్రితశిలాసంశోభియౌ నిగ్గిరిన్
బలుమారున్ వసియించి యక్షపతి విస్ఫారార్కసర్వాంగని
ర్మలవాటిన్ గనుచుండు భోగిపతి పూర్వ్యాపారమెంతేనియున్. 88

ఉ॥ శ్రీమదశాస్యబాహుకృతపీడనగాఢనిగూఢమేఖలా
స్తోమములందుఁ దత్తటుల సుస్ఫుటకాంతులు నిండుచుండఁగా
భీముని కిద్ధరాధరము ప్రేమనొసంగును వాలియంత్రగే
హామితవేదికాసుఖము నంచన దైత్యవిభుండు సీతతోన్. 89

శా॥ ఏతచ్ఛైలతటిన్ ద్రుమోత్కరము భూతేశోత్తమాంగేందుభా
సాతిస్పందవిధూపలద్రవజ పరిష్యందన్నదీ మాతృకా
స్ఫీతంబై గిరిజాత చేగుణమునం బెంపొంది ధాత్రేయక
భ్రాతృస్నేహములన్ ఫలించు గుహడింభక్రీడ సైరించుచున్. 90

వ॥ అనిమఱియును. 91

చ॥ అలరిన హ్రస్వ నేత్రకలితాంగకుఁడై నతినల్పవక్త్రబల్
కలువల దండయై యెదుటఁ గన్పడ వేగమ దానిఁ గైకొనన్
వలెననుచున్ గణానుగత వర్తను షణ్ముఖుఁ జూచి మాటికిం
గలకలనవ్వ నేతయగు కాలగళుండిదె మీకు సౌఖ్యముల్. 92

మ॥ ఘనవాత్యాభ్రమఘూర్ణమానమహిచక్ర వ్యూఢగాఢభ్రమ
త్కనకక్షోణిధరంబుపార్శ్వ నివస న్నక్తందివాచిత్రమై
తన వేవేలు తమస్తటిత్తులుప్రభాసౌదామనుల్ గల్గఁ జే
సిన కల్పాధ్వరయజ్వ శంభుఁడు మిముం జేయుం బవిత్రాత్ముల౯. 93

వ॥ అని దీవించిన విని లక్ష్మణుం డిట్లనియె. 94

గీ॥ కుంజరారినఖాంకురకుటిలమైన
భీమమకుటార్ధశశిరేఖ భీతి హరిణ
మచటఁ జేరక యుండిన నవగతాంక
మైప్రకాశించునన సీత హాస మెసఁగ. 95

చ॥ పునుకల పేను జల్వగమి పుత్త్రియు దాలిచి యీస్మశానసీ
మను విహరించు రుద్రునకు మాలివిభూషణమై కళంకియ
య్యెను శశి గాని కానలనహీంశలవం బౌనరించు లేశి చే
సిన యపరాధమేమి యనఁ జిర్నగ వొప్ప విభీషణుండను౯. 96

చ॥ అనుచరమైన భూతనిచయంబుసకుండగ నామరూపక
ల్పనకయి యీశివుండు సిశి భాసిలఁ జేయఁదలంచి మాలిసీ
మను శశిరేఖ నుంచుకొన మానక యెన్నఁగపాలిగోపునే
మినుకు లటన్న నందఱును మిక్కిలి నవ్వగ రాముఁడిట్లను౯. 97

మ॥ కరముల్ మౌక్తికపర్ద బంధన సమగ్రక్లాంతకాకోదరే
శ్వర దష్టంబయి బింబపూర్తి గొఱకు౯ నందంశికం బట్టియు
ద్ధురఫాలానల కీలజాలముల యందుం ద్రిప్పుచుంగాచునై
ఖరిఁగనప్పట్టు హరోత్తమాంగశపరిష్కారైణభృద్రేఖక౯. 98

వ॥ అనియంతఁబుష్పకంబు నాలోకించి విమానరాజమా! యించు
క పైకెగయుమిమ్ముగుడ సుమేరుశృంగంబుల నాలోకింపఁగు

కూహలాయత్తచిత్తయై యున్నదనవుడు నదియు నట్లచేయ వి
భీషణుండద్ధేవికిట్లనియె. 99

మ॥ ప్రతిమాసామర పీయమానకళ తారానాథ బింబాంతరో
ద్గత సంచారికళంకశంబర రదాంత చ్ఛిన్నదర్భాంకుర
ప్రతతి న్నించి యథశ్చరద్గిరిహగణ ప్రాప్తోపరిచ్ఛాయక
ల్పతరు వ్రాతముచే ముగం బొసఁగు నీభర్మాచలాధిత్యకల్. 100

మ॥ కనకక్షోణులఁబట్టుటన్ రుచిరమై కన్పట్టు వృక్షాళి మిం
చిన గాంగేయధరాధరేంద్రతటికిన్ సీమంతమావీధిపైఁ
జను నర్కాతపతప్తకాంచనశిలాజంబాలనిర్మగ్నకో
కనదాప్తోరు శతాంగనేమిఁబెరుకుః గంభాణముల్ బల్మిచేన్. 101

మ॥ అన సావిత్రి మహీజతో ననియె నంబా! చూడు మీహేమశై
లనితంబంబులఁ గల్పభూరుహవనుల్ మధ్యందినంబాదు నై
నను బార్శ్వస్థిత భానుబింబమహిమన్ దైర్ఘ్యాంచితచ్ఛాయఁ గో
కనదోల్లోచమనోహరంబులయి వేడ్కం జేయు నెంతేనియున్. 102

గీ॥ అనినిరూపించి హర్షస్మితాస్యఁ డగుచుఁ
బలికెఁ బుష్కలావర్తకాభ్రముల కుపరి
భాగమునఁ గ్రీడసల్పు శుభ్రద్వీపంబు
నల్లదిగో చూడుమని చూపి యంత మఱియు. 103

మ॥ గురుదోర్గాత్రసహాయుఁడైన దశవక్త్రుం డాజి నాత్మీయదు
ర్భరహస్తావళిచేతఁజిమ్మి ముదమొప్పం బట్టఁ గూపెట్టు నే
సురభద్రేభము నాగజంబు విహరించున్ నేఁడు నిశ్శంకని
ర్ఝరకాంతాపరిభుక్తకల్పకుసుమప్రస్యంద నాకస్థలిన్. 104

క॥ అనవిని సుగ్రీవుండి
ట్లను నిజ మిూయర్థ మెల్ల వల గళముఖు శౌ
ర్యనిరూఢక్రీడితములు
ప్రణుతింపఁగ వాగగోచరంబులు కావే. 105

మ॥ అనినన్నైక సమర్థులుంద్రు మఱియుం హాయేమనన్ వారి నై
నను వీరస్థలియుద్యోత్హ్మ గళముఖుండాఁబూని యవ్వాలియా
ఘనునే యాహ్వాయమానుఁ జేసి యధికుం గావించె నీవేమనన్
వినఁ గన్గో శ్రుతులక్షు లిచ్చెవిధి వర్ణింపంగ శక్తుండనే. 106

వ॥ అనిన సబహుమానంబుగా రాముం డిట్లనియె 107

చ॥ ఘనభుజపంజరమూలమున గాఢముగా దశకంఠుఁ జేర్చియు
వ్వనధుల సాంధ్యకృత్యములు వారక సల్పిన వాలిశౌర్య మే
మన నగుఁ దత్కృతోపకరణావగతంబు మునిల్చెధాత్రిన
వ్వనిచమనంబు నట్టి సురవైరి దశాననునెన్న శక్యమే. 108

చ॥ అనవుఁడు సీత యాత్మవిభు నాగని వల్లభ! కప్పురంపుఁబల్
తునియలగుత్తికై వడి గనుంగొనవమ్మెయను మిన్న దేమనన్
విని దనుజేంద్రుడప్డు పృథివీసుత కోనను దేవి! పుష్పకం
బెనసెను జంద్రలోకమున కింతయుడగ్గఱఁజూచుమిూతనిన్. 109

మ॥ లలిఁబ్రాక్ప్రత్యగవాగుదక్కు లను పేర్లన్ దిక్కులం గూర్చుచున్
దళుకున్ వెన్నెలజాలుచే ఘనతర ధ్వాంతచ్ఛటల్ వాపుచున్
జెలువై లోకవిలోకబీజమగు ప్రాచీనాద్రిపైఁ దోచు కం
దళమైమొప్పశశింగనన్ జనము ప్రాణంబుల్ భరించుంజుమీ. 110

మ॥ స్మరవిద్వేషిజటాళికట్టిను పరిష్కారప్రదీపప్రభాం
బరముల్ గాఢమహోత్తమాపటిలికాకుంఠీభవిల్ స్వీయరు
గ్వరముక్తాకృతయావతోత్సవుని గ్రావద్విట్సుధాపాకమం
దిరపారోగవు నుత్పలాప్తు నుదయాద్రిం గంటి మేలొందెడున్. 111

సీ॥ తోయజమునికిఁ బ్రాణాయామ కలనోప
దేశంబొసంగను దేశికుండు
నవయావనోద్భవోన్మాదలీలాగోష్ఠి
మహిమకెల్లను బీఠమర్దకుండు
లోకత్రయాంగనాలోక లోచ నపత్త్ర
కాయితంబగు మధురాంగ రాజి
యమితశృంగార రసాద్వైతమతసము
ద్ధరణదీక్ష వహించు ధన్యమూర్తి

గీ॥ సూనసాయకాయుష్టోమసోమయాగ
కమితకై రవిణీప్రియా జాత జాత
మానముద్రతేఁదనరు శుంభద్విలాసి
యగుచుఁ జంద్రుండు విలసిల్లె నభ్రవీధి. 112

వ॥ అనిన విని లక్ష్మణుండు సకౌతుకంబుగా విలోకించి యిట్లనియె.

మ॥ శ్రవణోత్తంసయవాంకురాళి గరసంజాతంబులం బట్టి నా
కవధూరత్నము గొండుగుల్ నగుచు వేడ్కన్ గొల్లునం బిల్వ ను
ద్దవిడిం జిహ్వామృగంబు గ్రాసమునకై తారాగఁ జోగా శ్లథం
బవు నాయిందుకళాఖ్యకంథ యిక నేమౌనో కదా యక్కటా.

మ॥ చిరరోమంధచలోష్ఠసంపుటసుఖాసీనంబు లత్యున్నతము
ద్ధురకాంతూహలసిద్ధకామినులు చేతులం దూటికిం దట్టఁ జే
వెలిచేతం బ్రతిమానసవ్యఘటనానిస్సంధిబంధత్వపా
కరగాత్రం బురుశల్యరీతిఁ జొరఁ ద్రొక్కగాసిల్లుఁ బాడొంగిరా. 114

గీ॥ మృడుఁడు ప్రతిమాసమునఁ జేయబడుచు నున్న
యీసుధాకరకళ నొంచు నెలమి వర్ణ
నీశ్చయశకలవైఖరి నిరతి మూను
ననిన రాముండు సాదరుం డగుచు మ్రొక్కె. 115

మ॥ సతతం బీవు సుధాశనాళికి సుధాశ్రాద్ధంబు లోకైకజీ
వితసంశోభిభవత్ప్రభాతతి మహావీరుచ్ఛటాధాత్రి మ
స్తతటిఁ గిన్ని తకెవ్వఁ డాగరళముం దాఁ ద్రింగి తద్వ్యాజని
ర్మితకంఠస్థితకాలపాకుఁ డగుచుఁ మృత్యుంజయుం డౌ శశీ. 1.6

సీ॥ నిఖిలలోకానీకనేత్ర పఙ్క్తికి నెల్ల
మధుపర్క సత్రసామ్యంబు దాల్చి
గంభీరవారాశి ఘనతరాంగమునకు
మేదస్కరస్ఫూర్తి మిగులఁ గాంచి
కామినీకాముక కామితశృంగార
మునకు రసాయనం బనఁ దనర్చి
వివిధసుధాశననివహంబులకు సుధా
గంజాగృహత్వంబుఁ గడిమిఁ బూని
గీ॥ హరశిరోభాగరత్నవిఖ్యాతిఁ దనరి
కలశపాథోధిశుక్తిముక్తాఫలంబు

నైన తారేశు నెంతని యభినుతింతు
మనిన విని భూమిసుత నవ్వి యనియె నిట్లు. 117

చ॥ సమకులరూపయౌవనల జాల సపత్నుల నెత్తిఁద్రొక్కి దు
ర్దమమదవృత్తి నున్నయది దక్షకుమారిక యోర్తు గానఁ ద
త్కుముదహితుండు రోహిణికిఁ గూర్మివిభుండని యెన్నఁగాఁబడెన్
తమపయి నన్న రాఘవుఁడు జానకి కిట్లను నవ్వు దొల్కఁగన్. 118

గీ॥ అరయ నాసప్తవింశతి యైన తార
లకుఁ బ్రియానుభవంబు తుల్యంబె యైన
విభునితోడ నొకానొక సుభగభావ
గరిమ రోహిణి గననోచెఁ గాక యనుచు. 119

వ॥ స్పర్శంబు నిరూపించి వెండియు. 120

మ॥ దళితేందీవర కుట్మలోష్మజచికిత్సాధూతచాకోరని
ర్మల చంద్రాతపపాన జాడ్యములు చంద్రగ్రావనిష్యందవా
ర్వాలసన్నిర్ఝరబింబితంబు లభిసారీమూకదూతీప్రజం
బులు చంద్రాంశువు లాత్మసౌఖ్యదములై పొల్పొందెడుం జూచితే.

గీ॥ భ్రమదళికలకంఠతాళముల్ బరగఁ గుముద
ముకుళముల నంగహారముల్ మొనయఁ జేసి
దృప్తముఖరచకోరికాతృష్ణఁ దీర్చి
శశి తృతీయాక్షియై మించెఁ జగతి కలివ. 122

చ॥ ఘననిపుణాభిసారికల కన్నుల కంజనమో త్రిలోకలో
చననిబిడాంధపట్టములొ చాలొ యనందగు నిర్ల నిండియుం
డిన ధరఁ గాంతిపుంజమును సీటను క్షాళన మొప్పఁ జేయు మా
జనకజ! శర్వరీవిభుఁడు చల్లని రా జడయించెఁ దూగ్యనన్. 123

గీ॥ అనుటయు విని యాప్రియవా
దిని నీవాక్యములు సుధకు దీటై మృగలాం
ఛనరుచిక న్నను నాకుం
బెనువేడుకఁ జేసె నన విభీషణుఁ డనియెన్. 124

మ॥ శ్రవణాభోగనిరస్తకుండలగణారావంబుగా నమ్మహో
హినరేణ్యుండు శిరంబు లూఁపుచు మహీభృన్మాలసంఘృష్టగో
ద్భవచూడామణికాంతిపీతబహుల ధ్వాంతచ్ఛటంబైన భో
గివరావాసమునందుఁ దావకమహాకీర్తిన్ వినున్ రాఘవా. 125

వ॥ అని నవ్వి మఱియు నిట్లనియె. 126

ఉ॥ పన్నగభర్త భోగినులపాటల నీఘనకీర్తి రెండువే
ల్కన్నులుగల్గియుండి వినఁగా శ్రవణద్వయహీనుఁడౌచు వే
గన్నులవేల్పు దాను సుఖకారణదృక్శ్రుతిగాక యుండుటన్.
గిన్నరకామినీమణుల గీతములన్ విను దాని నెట్లుగాన్. 127

క॥ అన రాముఁడు హ్రీస్మితములు
పెనఁగొన వదనాబ్జమున విభీషణుపల్కుల్
వెనరువఁ గైకొని తాఁ గో
కనదాక్షి సీతమోముఁ గని యిట్లనియెన్. 128

మ॥ దయితాస్యప్రతిమల్లుఁడై తనరఁగాఁ దన్ జేయుచున్నంతలో
రయమొప్పన్ సమజన్మకాలమిళితప్రాంచన్మయూఖావళిం
బయి వర్షింప నవాంబురుణ్ముకుళనప్రాప్తాతిదుఃఖస్థితుం
డయి వర్తిల్లెను బ్రహ్మనేర్పు గన నవ్యాలోచనన్ మిక్కిలిన్. 129

వ॥ అని సీత నవలోకించి యిట్లనియె. 130

క॥ సతి! తావకవదనతులా
ధృతుఁడగు కమలారి కాదన దీర్చుటకో యకాఁ
ప్రతిమానఖండములనఁ
వితతరుచిం దనరె గగనవీథిం దారల్. 131

సీ॥ దేనిగోత్రమునందు దివిజపూజితుఁడైన
భగవంతుఁ డుదయించెఁ బద్మయోని
దేనివికాసంబు దినదినంబును నిరం
తరముగం బిచ్చుఁ బంభరవితతికి
దేనిభక్తిసమగ్రదీప్తి లోకారాధ్యుఁ
డైన భాస్కరునందుఁ గాన నయ్యె
దేనిబిసావళి పూని యంచల కెల్ల
మృదులాన్నరీతి నామెత లొసంగు

గీ॥ అట్టికంజ పుంజము తన్మహత్వకలిత
మాటఁ దావక వదన సామ్యము వహించు
ననిన జానకి సస్మితావనతవదన
యగుచు రఘువంశతిలకున కనియె నపుడు 132

గీ॥ స్వామి! భగవంతుఁడైనట్టి శంకరుండు
విమలపరిపూర్ణ శశిని దా విడిచి యొంటి
కళను జూడావతంసంబుగాఁగ నెట్లు
తాల్చె నన నవ్వి రాముండు తరుణి కనియె. 133

గీ॥ సకలలోకోపజీవ్యుఁడా శశిని బూర్ణ
కళుని రుద్రుండు మాళి నిక్కముగ నిడిన

నతేఁను శంకరనిర్మాల్య మయి యుపు డుప
భోగమున కర్హుఁడే కాకపోవుఁ దరుణి. 184

క॥ అన నందఱు నొక్కట న
వ్వినఁ రాముఁడు జనకసుతకు వెండియు ననిరో
వనితా! మూసప్రమితా
జ్ఞున కేతత్సంపదాప్తి చోద్యము తలపఁ. 185

సీ॥ లోకత్రయీచారు లోచనోత్పలపాళి
కనుమపీయూషధారాగ్రయణము
నధ్వనీనోన్మాది హవ్యవాహోచ్చల
దాలాతనిబిడ లేఖాంచలంబు
ప్రకటతమఃపుంజ ముకుళితవిష్టపో
ద్ఘాటనపాటవోదగ్రకుంచి
జగము లొక్కట గెల్వఁజాలు వీరులలోన
కమలసాయకు నాద్యగణితరేఖ

గీ॥ సతతవికసనజాగ్రన్మసారకచభ
రాముఖాంబుజశ్రీ ప్రతిరాజ బీజ
మనుపమానందకల్పద్రుమాంకురంబు
నిందుఖండంబుఁ గనుఁగొంటె యిందువదన. 186

మ॥ అనినఁ జానకి మోదమంది హృదయేశా! ధాత్రి నెందైనఁ గ
న్గొన సంపూర్ణగుణుల్ ప్రకాశమును గైకొం డ్రన్యు లేవంవిధం
బునఁ జూపట్టరు శంభుమస్తకనదజ్ఞుం డిందు కెన్నఁగ నిద
ర్శన మన్న న్నగి రాముఁ డోవిధు షి! యీ సత్యం బటం చిట్లనున్.

శా॥ సేతూపక్రమ కౌతుకాహృత గిరిశ్రేపాలివేగోచ్ఛల
త్ఖ్యాతాకేవ పయస్స్ఫుటోదరదరీగాంభీర్య మంభోధి మున్
బ్రీతిన్ గోష్పదరీతిదాటిన ఘనున్ భీతాత్ముఁ జేసె న్మరు
త్సూతి న్నాల్పసమృద్ధికన్న దర మిచ్చున్ దుచ్ఛదార్లంఘ్యమే.

సీ॥ ప్రాచీన విశ్వంభరాధరైందవకాంత
దేదీప్యమానపాదోదకంబు
నిజవపుర్నిర్యాసనిభ తార నిర్వ్యాఢ
కలితార్ఘ్యలాజ కాంజలిపుటంబు
నూతనాంకుర శిఖాఘాతవై భావరి
కప్రగాఢ ధ్వాంతకందళంబు
స్వచ్ఛతరాభితఃసాంద్ర తమాంతరా
ళప్రౌఢిమారూఢ లాంఛనంబు

గీ॥ సకలలోకైకకౌతుకాస్పదము నైన
యీమహాభాగు తేజ ముద్దామబింబ
నిర్గతంబయి జగమెల్ల నింపి దండి
మెందుకొని యుండు సమద వేదండగమన. 139

గీ॥ హరినఖాభపలాశ జాలావతంస
లతివ లతిభీతి సంకుచదంకహరిణ
మాట విప్పయి యొప్పు నీయబ్జబింబ
మివ్విధంబునఁ జూచెద రిపుఁడు దరుణి. 140

క॥ అనిన విభీషణుఁ డిట్లని
యెను హరుఁ డజ్ఞైక కళ గ్రహించి జటావా

టి సిడినవాఁడగు నచ్చో
టనిశంబుఁ గళంక మయ్యె ననుచుఁ నగుచుఁ. 141

గీ॥ మఱియు రామున కనియె నాశరవిభుండు
రోదసీకూపభేక మీరోహిణీప్రి
యుండు స్వల్పప్రకాశుఁ డయ్యెను భవద్య
శంబుతోడను బ్రతిగర్జ సలుప దేవ. 142

గీ॥ అనిన మహిజాత నవ్వి యోనాథ నెఱుఁగుము
నీమహాత్మ్యయశఃకాంతి నెదిరి యోడి
పాఱి భగవంతుఁ డగు శీతభానుఁ డంత
రమున నిదిగో! కళంకకాళిమ వహించె. 143

క॥ అన వంగజు నవ్విన నా
జనకక్షితిపాలతనయ సాద్భుతహృదయం
బునఁ గనుఁగొని రామునితో
ననియెను మృదువచనరచన యతిశయిలంగన్. 144

సీ॥ హరిభూజాక్షిప్తమందరఘూర్ణితసుధాబ్ధి
భంగగర్భప్రభాస్పర్ధి యగుచు
బహులపక్షాంతరప్రభవ్యైందవకళా
జాలకోద్గారసచ్ఛాత్రి మగుచు
హరశిరఃశశిఖండ దరవికస్వరగాంగ
కైరవశ్రీప్రియంకరణ మగుచు
శిశిరావహప్రపుష్పితసారభూరుహ
వాటికాగల్లచపేట మగుచు

గీ॥ భారతీసాంద్ర కర్పూర భాగురోజ
మౌక్తికస్తైక పాణింధమంబు నగుచుఁ
దనరు నీరఘుసింహుని ధవళయశము
నెవ్వ రేనియు వినుతింప రే ధరిత్రి. 145

వ॥ అనిన నట్టియెడ భగవంతుండగు వసిష్ఠమునిశ్రేష్ఠుం డనుగ్ర
హించిన గరిష్ఠంబగు మంగళాభిషేకముహూర్తం బాసన్నం
బయ్యెనను నునువు వినంబడిన దశరథనందనుం డు విని యమం
దానందకందళిత హృదయారవిందుం డయి వీఁడె స్వామికా
ర్యనిర్వహణ ధూర్వహతాగరిష్ఠుండగు మనసమీరకుమారుం
డు సాకేతనగరంబున కతివేగంబునం జని మగుడి మనల దీవ
రించుచున్నవాఁ డనిన నాకర్ణించి యకించిదామోదకంచుకి
తాంతరంగయై సీతాకురంగనయన యంజనానందనవచనానుగు
ణంబుగా మహనీయమహిమానమానంబగు నద్దివ్యవిమానం
బుఁగాంచి పుష్పకంబ యించు కవనతంబవగుము మేదినీసన్నిహి
తమార్గంబునం జనుగమని యథఃప్రదేశంబుపరికించి రాము న
వలోకించి యిట్లనియె. 146

క॥ స్వామి! నవాంబుద మేచక
యామహీ నలక్షైటభారి యాతతవక్షః
స్సీమఁ దగుకౌస్తుభము సిత
దామము వలెఁ గానవగుచుఁ దనరున దేమో. 147

చ॥ అనిన రఘూద్వహుండు దనుజాధిపుతో ననఘాత్మ! తర్కుటం
కసలిలతారకావముఁదాని గాఢతరోత్తరఘోఘభాసితై

తనరెడువిశ్వకర్మనముపంచితశిల్పనికేతనంబు దా
రిని గనవయ్యెఁ గంటె మృగతృష్ణ యనా నదె నావు దయ్యెడన్.

క॥ వనజాప్తవంశనాథున
కనియె విభీషణుఁడు గోహాగాచలరాజం
బనఘాత్మా! యిది యేత
దఘనమహిమ మగోచరంబు కనుగొన నచటన్. 149

స్రగ్ధర॥ జేష్ఠామూలీయయాత్రోద్గితజవకరభిశ్రేణికామోర్యల్లసద్భ్రుం
హిష్ఠారణ్యాధ్వతం సృగ్విథ గవులఁ గొనన్ విస్ఫురజ్జాంగలశ్రీ
సిద్ధంబై గాఢ్బు ఏప్పజ్ఞ హితశశికళానిష్కవానేందుకాంత
శ్రేష్ఠంబుల్ నుగ్వ్యగట్టున్ సెగనుడికిరవాచ్ఛిన్నవార్బుద్బుదాప్తిన్.

చ॥ అనఁఘవిమాన మందఱును నయ్యెడ డిగ్గిన నన్నిదిక్కులుం
గని మహిజాతకుం డనుజకాంతుఁడు వల్కెను దేవి! సింహళా
ఖ్య నెసఁగు దీవి వారినిధి కల్పె మణీనగకేసరచ్ఛటాం
చనరుచిరంబు దీనిఁ గను సమ్మతి నన్న మహీజ యిట్లనున్. 151

క॥ శరతులిత మగస్త్యమునీ
శ్వరహంసం బిటఁ జరించు సతతం బన దా
శరథి యనుఁ గుంభభవుఁడి
గ్గిరిమీఁద నకా ద్వితీయగేహ మొనర్చెన్. 153

మ॥ ఘన పాత్రైకనివేశ్యభూరిజలమూ కంధిం బిచండాంతరం
బున నీషత్పరిపాన మట్లనుచు నీపుణ్యాత్ము వింధ్యాద్రిశృం
గనవోన్మేషవిశోషణాంచదగడంకారున్ సమర్పించి య
య్యనఘఁ డాశ్వీనమునాగ నెకి, చనఁ గాదే యాకసం బెవ్వనున్.

మ॥ పుడమిం బార్థి నితంబు గ్రోల నలమోహాప్తుల్ రెక్కలంగయత్నమే
ర్పడ నిట్టట్టును మాటికి న్నగయుచున్ వ్యత్యస్తపాదంబులై
కడుఁ గాళీరదకీలితుల్ కుధరసంఘంబుల్ వడిం దూరి క
న్పడు నొక్కించుక సేపు కాన నతనిం వర్ణింపగా శక్యమే. 154

గీ॥ ఇంతమాత్రంబె యననేల యున్న గేంద్ర
సీమ శృంగారరససార్వభౌముఁడైన
యంగసంభవు రత్నసింహాసనముగ
సింహలద్వీపమున సంజచివురుసోగు. 155

ఉ॥ అనియు దేవ్యుదైఁదవక శాంశుక గాఢ్రివిభూపలస్థలా
నూనపథంబు లంఘులకు నొత్తి సలత్తుక్రావాలు పూని యు
డ్డీనచకోరపాళికిఁ గడిఁదిభయంబిసి మాటిమాటికిం
జానలు గిన్కచే మగుడుజాడలు దెల్పెడు నేఁడు గంటివే. 156

ఉ॥ వెట్టొకదిక్కుఁజూపి రఘువీరుఁడు పల్కెను మౌక్తికోదకా
ధారము తామ్రపర్ణి తదుదంచితసంతతియైన యుల్లస
ద్వారికణాళి శుక్తిపుట వాసితఁబూనియగట్టి యంగనా
వారవిభూషణాకృతుల వాటిలుఁ గంఠములందు నల్లెడన్. 157

గీ॥ యువతికుచభోగమహిమఁ జెన్నొంది శుక్తి
గర్భభృత్తామ్రపర్ణ్యుదకములు దిరము
లైనకరకలభాతిచేఁ నతిశయిల్లు
చుంచునస సీత వలికె రఘూద్వహునకు. 158

మ॥ తనభార్యామణులందుఁ బెద్దయనుచున్ దాక్షిణ్యమాత్రంబె యం
బుధిధానంబున గల్లగంగపయి సంపూర్ణానురాగంబునన్

ఘనమై రంజిలు నెప్పుడుఁ సహజముక్తాభూషణోదత్సమ
స్తనిజాంగోజ్జ్వల తామ్రపర్ణియెడలన్ దర్శింప వల్లాఁగదా. 159

చ. అనవిని నవ్వి రాముఁడు దిగంతర మారయఁజేయుచుం బ్రియుం
డు నిరపరాధియయ్యును గడుఁ మృషలాడు సఖీజనంబుచే
త నలుగుఁబోఁట్లకున్ సుకరతన్ మదమూన్చు పటీరశైలము
య్య నుపవనానిలాప్తి మనకందఱకున్ ఘటియించుహర్షముల్.

మ. అనినన్ ముంగరఁజూపి లక్ష్మణుఁడనున్ హస్తాంతరాలోలతా
కినదుత్తాన జలంబునందుఁ దనకుం గన్పట్టు క్లిశ్యత్తిమీం
ద్రనికాయంబులమీఁదికూర్మి మగుడన్ వారాశి వేగ్రాసి యొ
ప్పిన కుంభోద్భవు నాశ్రమాంతరము దీపించుం గనుంగొంటిరే. 161

గీ. మఱియు వార్ధిచతుష్టయీ మహితపాన
చేష్ట దృష్టాత్మతృష్ణుఁడై చెలఁగు నిమ్మ
నీంద్రు డుదయింప నాడప్పి యెల్లఁ దీర్ప
ననువు పడఁ దాని యన నచ్ఛమయ్యె జలము. 162

క. అన సుగ్రీవుఁడు నగి యి
ట్లను సప్తాంభోధి మాని యాపోశనముం
గొనినన్ సప్తభువన మో
దనముగఁ దనుఁ జేయునొక్కొ తానని వడకెన్. 163

మ. నలుదిక్కుల్ పరికించి సాద్భుతమహానందంబుగా వెండియుం
బలికెన్ నేఁడిదె యిన్నినాళ్లకును ధర్మస్థాపనాచార్యతా
చలుఁడై రాముఁ డశేషలోకపరిరక్షాదక్షుఁడై యుండఁజే
వ్నలరెం దండకఁగాననస్థమునిగార్హస్థ్యైకసంరంభముల్. 164

క। అనుపు సలజ్జాస్మితుఁడై
యనఘుఁడు రాఘవుఁడు పుష్పకాతిత్వరచే
గొని చూచి కనకమృగకే
లన పదములమీఁద నిడెమెలంగెద మునివర్. 165

మ। వరమారీచశరీరమే యుపదగాఁ బాటించి దర్శించునా
శరలోకేశ్వరుదంభ మాన్కరిక వేషప్రౌఢిమాడంబర
స్థిరమర్మంబు తెలుంగుపంచవటి గాదే యీప్రదేశంబటం
చురహిం బల్కెను సోపహాసముగ నాసుగ్రీవుఁ డత్యాదృతిన్. 166

మ। రవివంశాగ్రణి రెంకు మార్గు ధను రారంభంబు గావించె దా
నవులం దెవ్వనిమీఁదఁ జిత్రతనుసౌందర్యంబునర్ వల్లభా
న్యవలద్భూమినుతాత్ములర్ మలపె నేశౌర్యాభ్యుఁ డాగాధిసం
భవ యాగారికిఁ దాటకేయునకు నేఁబల్మారునుఁ ద్రొక్కెదర్.

క। నావిని జనకాత్మజ ల
జ్జావనతముఖాబ్జయైన నతివకు గాను
త్మావిభుఁడును బ్రస్రవణ
గ్రావేంద్రముఁ జూపి సూత్మగతిఁ జెవిసందర్. 168

మ। కలికీ! రాత్రిరి రత్నదీధితికనత్కాకోలకోలాహలా
విలహృత్కాశికభుక్తకందరతమో విస్ఫారమా నిమ్మహా
చలమం దేదమి నీదుపద్యోద గ్రహించం బక్షముల్ కోయునీ
కు లతాచ్ఛాదనమూన్చి రీవెలుఁగుదే కూర్మిత్ పనీదేవతల్. 169

వ। అనినం జోద్యము నొంది జానకి తగర్ హస్తాబ్జముల్ మోడ్చియా
వనికాదేవతలార మీకుదితసేవాతత్పరస్వాంత నీ

త వతుల్ చేసెను నన్ను నొంచుదెన నంతంబాపుచుఁ రాముఁ డి
ట్లను గోదావరి ప్రేయసీ! యిదిగో జోహారున్న మీయుష్మకున్.

శా॥ భామా యీపులినైక కుంజకుటికం బాలాశ కోశస్ఫుర
ద్దామంబుల్ నఖరక్షతాసహకుచద్వంద్వాంచితోరస్థలిం
ప్రేమ న్నేనిడి నవ్వి నేరములు గావింపంగ నీమోము దాఁ
గామార్తవ్రతభంగరోషితము నై కాంచెంగదా న వ్వనన్. 171

గీ॥ సత్రపాస్మితవదనంబు జనకతనయ
వంచి గోదావరికి భక్తి వందనంబొ
నర్చిన రఘూద్వహుండు నంతటను దిరిగి
చూచి ఖిన్నాత్ముఁడై తనసుదతి కనియె. 172

మ॥ చెలి! యీమాల్యవదద్రినేత్రము పయిం జీమూత సంరంభణం
బులు వర్షింపకయే మదశ్రుజలవిస్ఫూర్తి ప్రదానంబులై
చెలఁగన్ నన్నని నీవు వెంచిన తరుశ్రేణుల్ ప్రవాళాప్తిరం
జిలనయ్యెంగద కేకిలోకము విసర్జించెంగదా గానమున్. 173

చ॥ అనవుడు దైన్యగద్గదగళారవయై మహిజాత పుష్పకం
బునకు విమానరాజ! కృపంబూనుము నాహృదయం బధైర్యభా
జనమయి ప్రీలెడున్ మిగుల సత్వరవృత్తిని దాటు దండకా
వనము నటన్న రాఘవుఁడు వామవిలోచన తోడ నిట్లనున్. 174

గీ॥ అదె పురోభాగమున గానవయ్యె నీల
కచ! మహారాష్ట్రమండలైకప్రమండ
నము కుండిననగరంబు నర్మదా త
రంగ నిజహేమకేతు సంరంభమిందు. 175

చ॥ అనితరదుర్లభస్ఫురణమై మలయాచలసంభవంబునౌ
ననిలము సూనబాణ మకరాత్యనుభూత ఘనశ్రమాంబుల౯
దనిసి విదర్భదేశవనితా జనతాంగములంబ్రియోపహా
హాసమున నిస్మరించుపులకాళి ఘటించు నటించు వెండియు౯. 176

క॥ బలు దవులనుండియును మి
క్కిలి వాసన గుటియు కైశికీవృత్తిని రం
జిలు నిచటికావ్యరీతిం
బలుమరు గవి మండలం బుపాసన సేయు౯. 177

గీ॥ నావుడు విభీషణుడు దక్షిణంబుసూపి
తెలియనిట్లను నిదె యాంధ్రదేశలక్ష్మి
పూను గోదావరీహారమునకు నాయ
కంబు భీమేశలింగంబు గానవయ్యె. 178

మ॥ అలకాలంబునఁ బుట్టి బిట్టడరు నత్యంతార్భటీధాటిభీ
తిలి వామార్థము జార నేకచరణాప్తి౯ భైరవంబైన మే
నల౯ శేషకళేబరంబును సమంబౌనట్టుగాఁ గేకసా
హాలసామ్యాని లయాంత యాజ్ఞికతచే నొప్పారునీతం డిల౯.179

వ॥ అనిన విని పరమానందకందళితహృదయారవిందుండై రఘునం
దనుండు కృతాంజలియై యిట్లనియె. 180

మ॥ భ్రమదాశాసిచయంబుఁ జూచుచు జటాభగ్నార్ణాహీ రాణ్ముఖ్యులౌ
కృదియుగ్మ ఘూర్ణితనక్షత్రులై యలసినం గానీ నినన్నమ్మరై
రి మదిం దన్నటనత్రినద్గిరిసుతా రిక్తార్ధసంపూర్తికై
భ్రమిఁగావించితి వట్టి నీకుఁద్రిజగత్పాలా! నతుల్ సెసెద౯. 181

క॥ గళముఁ బ్రళయాంధతిమిరము
గిళనం జొనరింప వేఱ గిఱిగొని నృత్యం
బులు సలుపు కబంధశిరం
బులు గనఁగొని కాళరాత్రి పొంజెఱ ఛిఱా. 182

గీ॥ అనుఁడు నందఱు నగ లక్ష్మణాగ్రజన్ము
డవల నొకదిక్కుఁజూపుచు ద్రవిడమడం
లీశిరోరత్నగుచ్ఛకలీల నలరు
కాంచికాపురి మరున కేకాంతగృహము. 183

చ॥ అనిమహిజాత కేకతమ యారఘువీరుఁడువల్కు నిందు నూ
రిన చెమటల్ దొరంగను శరీరములం బిగిదప్ప దంపతుల్
మొనసినకౌఁగిలింతలను మొత్తముగాఁబులకాంకురాళిగ్రు
చ్చినగతి నిండి పిక్కటిలఁ జేయునటంచుఁ దలంచి వెండియుఁ౯. 184

క॥ ఇం దభిముఖనిపతచ్ఛ్రమ
బిందుకము విధూతపత్రబృందము కాంతా
సుందరకపోలభాగము
నందము పుంభావసూచియై తగు ననిన౯. 185

గీ॥ సూర్యతనయుఁడు దాపలఁ జూచి యిదియె
కనుఁడు శృగారదేవతాగర్భగృహము
నివ్వటిలుచుండు నుజ్జయినీపురంబు
మహిత మాళవసీమంత మౌక్తికంబు. 186

క॥ ఇం దిందుధవళరాత్రుల
యం దెగిరిచనుక్రియనున్న యభిసారికయా

సుందరగా రాంగములగల
చందనగంధిజనాళి చాయ లెసంగున్. 187

మ॥ ఇటసౌధాధరసీమ నైందవశిలాభిష్టాళనప్రోల్లస
త్పటిమన్ వెన్నెల సిద్దెలట్లు గననౌ భాస్వచ్చకోరాళి వి
స్ఫుటచంచూస్ఫుటులందుఁ జూడ్కు_లిడి పూఁబోఁణుల్ వినశ్యత్తమః
పటలంబుల్ విశదంబులౌనుదరముల్ భావించి కన్గొంద్రొగిన్. 188

క॥ ఇంతియు కాదిచటంగల
కాంతల ముఖకాంతిఁగనిసి కమపునిమిటికొం
చెంతయు శశిరుచిఁ దినిత్రిన
కంతపురచరచకోరమట కయనించున్. 189

గీ॥ అన విభీషణుఁ డనియె ధనాధినాథ
కటకశాఖానగరమనఁ గలుగు నిందుఁ
ద్రిపురహరణప్రతిష్ఠకుఁ దీవియగుచు
నాట్యనాడు మహాకాళనాథుఁడెపుడు. 190

మ॥ వరనాట్యభ్రమివేగవిస్తృతజటావల్లీప్రణాళీపత
త్సురగంగాజలవేణికాపటలికాస్తోకస్ఫురత్పంజరాం
తరసంభ్రామ్యదభంగదోర్నికరపత్రం బీశహంసంబు దు
స్తరలోకవ్యయ నాటికానటము విశ్వత్రాణముం జేయుతన్. 191

మ॥ అనిన౯ రాముఁడు గేలుమోడ్చి యనుఁ గల్పాంతాహుతిభూతవి
శ్వనిటాలేక్షణకేలి తత్ప్రసవమున్ బంధించెనా మీనకే
తుని వహ్నిమంటానరించు యజ్వకు సుధాంధోమాళిమాణిక్యపుం
డనకింజల్కితపాదపద్మునకు వేడ్క౯ నీకు నేమొక్కెదన్. 192

ఉ॥ ఓహర! నీనిటాలమున నుద్భవమొందిన వీతిహోత్రుడ
య్యాహవశస్త్రహస్తుఁడయి యూగిన కంతునిఁ గెంతఁబూడిలో
స్వాహాదలంచిరో మిగుల జాడ్యముచే నొకకొంత సేపుత
ద్దాహమొనర్పఁడయ్యెఁ బరతంత్రుల వర్తన మిట్టిదే కదా. 193

గీ॥ అనుఁడు నవనిజవల్కెఁ బూజార్హుఁడైన
హరుఁడు సర్వజగద్గిలనాప్తి వలనఁ
దనదు పేరాకటిని బాపుకొనియెఁ గంతు
నకట మ్రింగని యన నవ్వి రంద ఱపుడు. 194

మ॥ సవిమర్శంబుగ రాముఁడిట్లనియె నీచాయన్ శరీభూతమా
ధవధృత్యాశను బర్వు వెట్టు విహగాధ్యక్షుండు తద్వహ్ని రా
యవడిన్ బ్రుక్కుచుఁబో నతోన్నతఫణిజ్యాకృష్టకోదండదం
డవిముక్తాశుగుఁ డాపురారి పటుసంధానక్రమం బొప్పెడున్. 195

గీ॥ అనుచు వేఱొక దెసఁ జూపి యదిగొ ఖలచు
రీనసాఖండలైక సాధారణాగ్ర
మహిషి మాహిష్మతీపురి మహితచేది
మండలాఖండమండన మాల్యమిందు. 196

మ॥ తరుణశ్రేణికిఁ గల్పునోటములఁ గందర్పుండు గాఢోల్లస
త్పరిరంభాధరచుంబనైకసుఖతోత్సాహాదికేళీ దురో
దరవిద్యాపణలగ్నకంకణుఁడయి యుద్యద్భోగముందానమై
మఱియున్ నిచ్చలు తన్మనంబులు జయింపంగోరెడిన్ మిక్కిలిన్.

వ॥ అనిపలుకునవసరంబున దివిజసమాజకృతవివిధపూజంబగు వి
మానరాజంబు వేగోత్తేజంబుగాఁ జన నవక్ర విక్రమాభి

రాముండగు రాముండు చండతర దుష్కృతదమనయగు యమును
నం జూచి వెండియు నిట్లనియె. 198

సీ॥ సర్వసర్వంసహాజలజాతనేత్రకు
మహితకస్తూరికామండనంబు
దివ్యకల్లోలినీ దేవతామణితోడు
నీడయౌ సహచారిణీలలామ
భువనసరోవరంబునఁ బాఱుదేర ద
ట్టంబుగానిగుడు కాదంబపంక్తి
సత్కవిసమితికి సారస్వతతటాక
కమనీయసాంద్ర శృంగారకుల్య

గీ॥ శైవయానది తవతటి నధివసించు
జనులఁగూరిమిచేఁబోలెఁ దనకు నన్న
య్యైన జముచేతివారల నస్త్రబాధ
ముగ గురుండగుభాను సమ్ముఖముఁ జేర్చు. 199

చ॥ అనిన సుమిత్రపట్టి దనయంగుళిఁ జూపుచుఁబల్కె మారథి
ద్యానమకుటైక ఖేలల జగంబులుదన్ని సుధాంశు బాలమి
త్రనవపయశ్ఛటాప్తి సగరప్రజ వేఁబరిపూతఁ జేసినీ
రనిధికిఁ బత్నియై యిదిగో రంజిలుగంగ యభూపహస్థితిన్. 200

గీ॥ అనిన రాముఁడు ప్రీతుఁడై యనియె శైల
జావిభయమానార్ధమై సంకుచితము
నైనహారుపూర్ధమున కట్టియగు గభీర
తగల భాగీరథీ నీకు దండమమ్మ. 201

సీ॥ అంభోజసంభవు నాలయం బెడఁబాసి
కడిమిమై నాకలోకంబుఁ జేరి
యంతఁ బ్రాలేయాచలాధిత్యకఁ బసించి
వెనుక భూమండలంబునకు డిగ్గి
జహ్నుతపోధనాశ్రమమున వెసఁ బాఱి
పిదప సముద్రునిఁ బ్రేమఁ గొంది
యహిలోకవాసుల యఘమెల్లఁ దొలఁగించి
త్రిపథగా సంజ్ఞచేఁ దేజరిల్లి

గీ॥ కడుఁ బ్రవాహత్రితయముల్ గాఁగ నిచట
కాయములు వైచిలేచిన ఘనుల బ్రహ్మ
పదముసేర్చు ప్రవాహజవంబు మిగిలి
యొసఁగు భాగీరథికి మ్రొక్కు మిందువదన. 20

క॥ అన సీత కృతాంజలియై
యనియెను నైజప్రవాహ మనియెడు నిగళం
బున ముజ్జగములు సంధిం
చినమందాకిని జోహారు చేసెద నీకున్. 20

ఉ॥ అంతట నందఱున్ వినతులైన సుమిత్రతనూజుఁ డిట్లనుం
బ్రాంతమునందుఁ జూపి యిది రాజవరప్రణయానురోధ సి
ద్ధాంతితగాఢతుష్టి ధరాధిపమందిరుఁ డప్పురారి క
ల్పాంత కపాలపాణి యనయంబు వసించు పురంబు కాశినాన్. 20

గీ॥ రాఘవుం డిట్టులను సహర్షముగఁ జూచి
చాలఁ దరిగఁగరాని సంసారజలధిఁ

గడఁకనీదెసఁ జనత యాకాశికాంత
రీపమున విశ్రమించి తరించు మఱియు. 205

సీ॥ గళకాంతిపీతాహిగణఫణామాణిక్య
వారమాత్రంబైన హారమరసి
భయమేది శైలజా బాహులతాద్వయి
గాటంబుగా మెడఁ గౌఁగిలింప
సర్వగాత్రీవిరాజ ఖర్వితశైరిక స్వ
రమున సామంబు గానము లొనర్చ
పంకేజసూతి కపాలంపు హరివాణ
మొక్క కేల్దామరనొప్పచూప

ఆ॥ నిందుభగవంతుండైన యయ్యిందువాళి
నెమ్మి నిత్యనివాసియై నిఖిలభువన
సార్ష్టిదాయకుఁడగుఁగాక యనుచు నొంపు
దెస విలోకింపుమని తనదేవి కనియె. 206

చ॥ ఘనవనవీథిఁ గీకిశితకార్కశిఁ జూచి గమ్యాప్రవృత్తిమై
దనరెడునీడు వాణి బలితంబగు పీడన మూన్పనాకరం
బనితర కృతార్థమయ్యె నట నట్టి భవత్కులవృద్ధు లేలుచు
న్ననగర మస్మదీయనయనంబుల నాకగొనెం గృశోదరీ. 207

వ॥ అనిన విని జనకరాజతనయ సవిస్మయానురాగంబుగా సాచీకృ
తతారకయై రఘుకులోత్తారకు వారక వీక్షించి యక్కించి దా
నందంబూని దానిం గౌఁగిలించి యాయమ్మ విరించి కృతనిర్మాణ
నైపుణీధుర్గీణ శిథిల! మిథిల! నీకిదె వందనంబు సలిపెద నస్మ
ద్విషయైకవత్సలతాధనమ్ములగు గురుజనమ్ములకు నాయభివాదన

మ్ములు విన్నవింపుమనునెడ నిర్హేతుకకృపాళి రాముండగు రా
ముండు విభీషణ సుగ్రీవులంజూచి యిట్లనియె. 208

క॥ అనుగుంజెలులార యీనీ
తను గనుపారంగం గన్నతల్లికి ధరకున్
జనకపుర మిష్టగృహం
బన వారలు గాంతుకాప్తి నని రికడంకన్. 209

చ॥ నిజముగ నిందుమూరమణ నిష్ఠురకార్ముక శిష్యులై నయా
యజగవ భార్గవుల్ మదమ*డంగిరి నీదుకతానం గాన న
క్కజముగ వాటికేళి సహకారిణివై తగు వీరలక్ష్మియే
రజనిచరాన్వయాధిప తిరస్కృతిం బ్రౌఢిమగాంచెగా యనన్. 210

మ॥ విని కాకుత్స్థుసునాన నవ్వొసయుంగా వేత్రోక్కుడం జూపి యి
ట్లను కంటే యడె చంపనాం డవరు సల్లాచాయ గాడాంగనా
జన శృంగార వినీతివిభ్రమ విలాసశ్రీలసన్మత్స్యలాం
ఛనకామారి ఘనవ్రతోద్భట తపస్యావాటి యా పీఁడిలన్. 211

మ॥ అని యేకాంతముగాగ సీత తను నిందన్నల్ గగుర్పొంది పొం
గినగాత్రంబులం బిక్కటిల్లు బిగికౌంగిళ్లం దమింబుచ్చి మం
తనవున్నేర్పులు దెల్ప నప్డు దివియల్ నళ్యద్దళంబుల్ వెలుం
గనిచో బొక్కటిబంటి చీకటు లొగిం గప్పన్ నివాసంబులన్. 212

మ॥ అన నాముందటం జూపి లక్ష్మణుంను ధన్యంబౌ ప్రయాగంబుతూ
ర్పునం గృష్ణాగురుచందనద్రవము లింపుల్ మీఱంగానొండొరుల్
దనుభాగంబుల యం దలందెదరు నాం దార్కొన్న యీభానుమ
త్తనుజం జాహ్నవిం గంటిరే యనుచు నుద్యత్ప్రీతిహై వెండియున్.

* „యతిక్షంగము.”

తే॥ హిమవనగ్రప్రవర్తితంగ బొరపురు వారు
నుసితజడయయి యొందె పాండిమగంగఁ
దంష్ట్రిడియగు చండకరు వంకతలమునందు
నుండి నిండారుకాళిమనొందె యమున.

సీ॥ సారహీరకకిరీటశాణకోత్తేజిత
బలిభిత్ప్రద నఖాంశుపటచేత
సహిరాట్ప్రభాభ్రమేడితాభవ చూడాబ్జలి
విమతమరీచికా వితతిచేత
చంద్రకాంతోపలస్థలనిస్సరత్తుషా
రభూమాధరనిర్ఝరములచేత
మార్గశారదరజోమహితభగీరథ
రమణీయకీర్తిపూరంబుచేత

గీ॥ సత్వసంపదఁ జెన్నొందు జహ్నుమౌని
సరసకరుణాకటాక్షవీక్షణముచేత
నీసు రాపగ ప్రతిపదంబెక్కుడైన
కాంతిచే వృద్ధిఁబొందుచుఁ గానవచ్చె. 21

క॥ ఇంతయొకాదటఁ బెద్దల
నంతంగలతీర్థములఁ బ్రయాగము ఘనమం
చెంతు రిట నున్నవారు ని
శాంతము సంసార వనధి దరిఁ గాంతురొగిన్. 216

గీ॥ అనిన రామునకు సాదరుం డగుచుఁ బలికె
గంగ యమునయుఁ బార్శ్వభాగముల నెనయు

దగుప్రయాగంబు ముక్తికిద్వారమగుచు
నిక్కమిది దీనిమహిమ వర్ణింపఁ దరమె. 217

గీ। అని మహీసుతఁ గూర్చి రామ యంబుజాక్షి
సాద్భుతంచరిత్ర మిదియు చూ శ్యామవటము
దీనినీడ వసించిన ధీరవర్యు
లాపరంజ్యోతిఁ గనిభక్తి నాశ్రయింత్రు. 218

క। అన నందఱు ప్రొక్కిన న
య్యినకులుఁడు విమానవేగ మెసఁగం జనుచున్
గనుఁగొని ముదమున వారికిఁ
బ్రణుతసుధామధురవచన ఫణితిం బలికెన్. 219

మ। ఘన యూపాంకురదంతురాత్మతట రేఖారూపసంఖ్యాతతి
స్స్నానసంతానకసప్తతంతు సరయూం దర్శింపుఁ డత్యాదరం
బున నీసింధుమతల్లి మేదినికిఁ గూర్పున్ భానుమద్వంశరా
డ్జనదీపీపదపట్టబంధ సుమహాసౌభాగ్య భాగ్యోన్నతిన్. 220

వ। అనిపలికి యిడె పురోభాగంబున విరోధి మహీధవాసాధ్య య
గు మనయయోధ్య గగనపథ్యాగతాస్మదవలోకకౌతుకోత్తాన
పృథుల నిష్పంద పత్రంబులగు జన నేత్రంబుల నున్నాళికస్థల కువ
లయ వనంబు డంబునఁ గనంబడియెడు ననువెడ నందఱు నానం
దితహృదయారవిందులై వందనంబాచరించి రందు సుగ్రీవ దశ
గ్రీవానుజు లుదగ్రకుతూహలంబునం బ్రశంసించి యిట్లనిరి. 221

చ। సవనహవ్యసంభవ శిఖాలఫలోత్కర వృంతముల్ బలెం
దవిలిన యూపజాలములఁ దద్దయునొప్పు నయోధ్యఁ గాంచి యిం

దవితథశక్తిఁ బుట్టినకృపావలి సిద్ధివిశేష మెంచినం
డివిని శచీసహాయుఁ డగు దేవుఁడు మాకు రుచింపఁ డెంతయున్.

వ॥ అనిన వారలఁ గుఱించి రఘువరుండిట్లనియె. 223

కం॥ ఓబంధులార! యిట్టిమ
హాబలులగు రాజు లేక గన్వయభవులై
ప్రాఁబడు టన్నదురు నైం
ద్రాబార్హస్పత్యచరువరప్రతిభఁ గదా. 224

సీ॥ అనిపురోభాగ మీక్షించి యతఁడె మద్గు
రుఁడు వసిష్ఠుండు సంభృతారూఢ మదళి
షేకసంభారుఁడై ప్రవీక్షించు వాఁడు
భరతశత్రుఘ్నులను గూడి పరమకృపను. 225

కం॥ అనిపుష్పకంబుఁగని యి
ట్లనియె విమానావతంసమా యాకాకు
త్స్థనృపోపకార్యకడ డిగు
మనవుడు నటుసేయ డిగ్గి రందఱు దానిన్. 226

గీ॥ అంత భరతుండు శత్రుఘ్నుఁడఱుత రావ
సిష్ఠ ముష్టింపచాన్వయశ్రేష్ఠుఁ డంతి
కమున కేతెంచి రఘుకులోత్తమునిఁ జూపి
వారికిట్లనిపలికె గంభీరఫణితి. 227

మ॥ ఘనలంకాధిప దోర్వనీమథన జాగ్రద్బాహుదండంబుచే
వినఁ డీపావడు ముజ్జగంబులకు నుద్వేలప్రమోదంబుఁ గూ
ర్చిన దాశ్చర్యము గాదు పిన్నపుడె చేసెం బిస్పగా జామద
గ్న్యుని విస్సన్తమహాతపఃప్రబల తేజోవీర్య నిర్వాసమున్. 228

వ. అనిపెండియు సహర్షంబుగా నిట్లనియె. 229

మ. శరవిచ్ఛిన్నదశాస్యకంఠవదవీ సంక్షిప్తదోర్వ్యగ్రవా
ద్ధురభూయస్తరుకర్మకాండుఁడయి పాథోనాథదర్పైకసం
హారణుండీ రఘుసత్తముండు త్రిజగన్మాంగల్యకృత్కీర్తిఁగ్ర
మ్మఱ రా నాకును జూడఁ గల్గెఁ బతికింపఁగ భాగ్యమేమంచనన్.

సీ. అప్పు డైక్ష్వాకుండు హర్షాంబుతో వసి
ష్ఠునిపాదములు మాళిసోఁక నెఱఁగి
యారఘుబ్రహ్మక్రియాచార్యునకుఁ బురా
ణబ్రహ్మవాదికి సత్యమతికి
బ్రహ్మర్షివరునకు రాఘవుఁడిదెనీకు
వందనంబులు సల్పువాఁడటంచు
బ్రొక్కఁగ్రక్కునఁ నెత్తి యక్కునఁ గీలించి
శిరము మూర్కొని మునిశ్రేష్ఠుఁ డతని

గీ. దివిజపోషక యాశీర్వదింతు నిన్ను
నేనటంచు సుధా మాధురీనితాంత
కాంతవాచా చమత్కార గౌరవంబు
పరిఢవిల్లంగ నిట్లని పలికె నపుడు. 231

చ. అరుల యశః పతంపగలజాండము మూషికసంఘటించి సు
స్థిరనిజదోఃప్రతాపశిఖిచే నెడఁద్రవ్వక యూదియూది ని
ష్ఠురపుటపాకశోధితము చొప్పునఁ దేర్చి గుణోత్కరంబునై
తరలని గట్టుగట్టి రజతం బగు కీర్తి వహించి తీవిలన్. 232

గీ॥ సకలభువనైక లంఘనజంఘికంబు
లైన భవదీయ కీర్తుల నాదిధరణి
కాంతియశములు గంగోదకములచేత
నితర నదులట్లు కడుఁ బవిత్రితము లయ్యె. 233

క॥ ఇన రవీందులగతి భువ
నానీకాలోక ధుర్యులగు గోత్ర క్రా
ణానూనుల నిర్వురఁ గను
సూనుల నిజభుజములటుల శోభిలువారిఁ. 234

గీ॥ అనిన జానకి మ్రొక్కిన నతఁడు వలికె
జనక వంశసువాసిని! సాధ్వి! నీదు
ధవుని కిప్పుడె యుభయసాధారణముగ
దీవన లొసంగితి మటన్న దేవి మునిని. 235

గీ॥ చెలఁగి కులగురుఁడైన వసిష్ఠమౌని
యనన్యశాశీర్వచస్ఫూర్తి యరయ రామ
భద్రు గృహిణిపదం బనపత్నముగఁ దె
లిపెను నాకన సౌమిత్రి యపుడు గదిసి. 236

గీ॥ సగరగోత్రైక దేశిక! నిగమనుత్య
కాండ! మైత్రావరుణి లక్ష్మణుండ నేను
మ్రొక్కెద నటంచు నలిసల్ప ముని వరేణ్యుఁ
డిట్టులనివల్కె వాత్సల్య మొనక మొసఁగ. 237

ఉ॥ బాలక! యొల్లదీవనలపైకదవర్తిల దెట్లుయున్న నీ
వాలమునందు నింద్రజిద హంకృతి మాయఁగఁజేసి దేవతా

పాలకపాలనప్రతిభఁ బాటిలినాఁడవు గాననైన ను
ద్వేలమహావిభూతి జగతీతల మేలుచు మీరలందఱున్. 238

క॥ ఒకరొకరిద్దర నిద్దర
సుకుమారులఁ గనుఁడు దాన శోభిలు మీయా
ద్య కువలయాధిప వంశం
బకుటిల రూఢాష్టశాఖమై యివ్వసుధన్. 239

మ॥ అనునంతన్ రఘుభర్త హర్షమున హస్తాంభోజముల్ మోడ్చియి
ట్లను నోదేశికసార్వభౌమ యిపుడీయిక్ష్వాకువంశంబు భా
జన మయ్యెం గద మీయనుగ్రహవిశేషశ్రీకి నిక్కం బటం
చనఁగా నాభరతుండు రామునకు నెయ్యంబొప్పఁ దానిట్లనున్. 240

గీ॥ ఆర్య! రాఘవ! శూన్యగృహప్రకోష్ఠ
రక్షణైక పదాతి భరతుఁడు మీకు
వినతి యొనరించుచున్నవాఁ డనుచు మ్రొక్కఁ
గడు ముదంబంది రాముండు గాఁగిలించె. 241

ఉ॥ అంబుజశాత్ర వాంశుకలనానిశ మేమరచంద్రకాంతపుం
గంబము వోలె భాసిలెడు కాయము నాయెదఁ జేర్చుదాన సౌ
ఖ్యంబువహించు నట్లపు నిజానుజసంగ సుఖాసికాప్తి ని
త్యం బెడఁబాయునే చపలయై రమ శౌరి నకాస్త్రభోరమున్. 242

క॥ అన నట్లచేసి యంతట
జనకజ కభివాదనంబు సలిపిన నయ్యం
గన యన్న భరత రవికర
ఘనచుంబిత కంజపుంజగతి వికసిలుమా. 243

చ॥ అనునెడ లక్ష్మణుండు భరతాంఘ్రులకున్ నతినల్ప నాతఁడి
ట్లనియెను వత్స! నన్నుఁ దడవారఁగఁ గౌఁగిటఁ జేర్పుభక్తి చేఁ
దనరెడి భ్రాతయంగములు దద్దయు నూతనగంధసారమం
దును ఘనసారమం దరుచినూల్కొనఁ జేయుసటంచు దమ్ముని౯.

మ॥ అతిగాఢంబుగఁ గౌఁగిలించి యవురా! యైక్ష్వాకవస్వచ్ఛకీ
ర్తితటాకాంచితయూపదండము క్రియం దీపించు సౌమిత్రియా
యతబాహాద్వయిచే నిగూహనము నాకబ్బెన్ గదా నేఁటి కీ
గతి నన్నాశ్లేషనేను శీతలతరాంగశ్రీ విరాజిల్లితి౯. 245

క॥ ఇంతియకాదైందవకర
సంతతిసాంద్రముగఁ జేర్చి సమకూర్చిన య
శ్శాంతయుఁదగు తమ్మునిభుజ
మంతస్సంతాపభరము నటఁ దలఁగించు౯. 246

చ॥ అన శత్రుఘ్నుఁడు రాఘవుంగుఱిచి యార్యా! పాదుకాభృత్యభృ
త్యసమసాక్షర మనుగ్రహింపుఁ డని జోహారొనర్ప నా రాముఁడా
యన నిండారఁగ కౌఁగిలించి యవురా! యాకార సంపత్తిఁ జూ
చిన సౌమిత్రియ పో యితండనుచుఁదోచెన్ మాకు నిక్కంబుగ౯.

మ॥ అని ధాత్రీజకుఁ జూపి పల్కు నతఁడే కాంతంబుగా జూచితే
వనితా! యీముఖ మబ్జతాబ్జరిపుసంవాదంబు సౌమిత్రి యా
ననమేపో యివి పూర్వ దిక్కరటి శుండాదండ పాండిత్యమం
డనముల్ లక్ష్మణుబాహుదండములపో నన్ గౌఁగిలించెం దగ౯.

క॥ అను నవసరంబున శత్రుఘ్నుండు మ్రొక్కిన వన్న! వినయైక
సంపన్న! సకలలోక శంకూదరణ ధౌరంధరీ పాత్రంబులగు చ

చిత్రంబుల తుల్యుణ తుల్యుండవు గమ్మని సుధారసంబుగమ్మ
నెమ్మిందీవించి గురుజనం బెచ్చట నున్నయది నాపుకు నతండిదె
కృతమంగళాచారమై నిరంతర కరుణావలంబయగునంబ నిన్నదుకు
చూచుచున్నయది యని యెఱింగించి నిజాగ్రజు డాయంజోయి
నమస్కరించిన నతండు సహర్షంబుగా నాలింగనంబు సేసి దీ
ర్ఘాయుష్మంతుండవు గమ్మని నీవు చివ్వమానుండవైయుండనుం
డ నన్నుభరతుని నొంటిగా విడిచి పోయిన వారముగదా!
యనునంత రాఘవుండతినిష్ఠాగరిష్ఠుండగు వసిష్ఠు గుఱించి. యి
ట్లనియె. 249

గీ॥ ఏఁపుమైలంక గిష్కింధ నేలునాథు
లిజె విభీషణ సుగ్రీవు లిపుకు విూకు
మొక్కెద రటన్న నమ్మునిముఖ్యుఁ డపుడు
మధురసోదార మధునసమధురభణితి. 250

క॥ లలితపులస్త్య వికర్తన
కులకీర్తిప్రసవమాల్య గుంభస్తంభం
బులరై తడవు సుఖంచుచు
నలరెదరన రాఘవుండు హర్ష మెలర్పఁ. 251

గీ॥ భరత శత్రుఘ్నులనుఁజూచి పలికె నపుడు
వీరెనుమ్మాపౌలస్త్యసావిత్రులు నతి
నలుపుఁ డనవుఁడు వారు వారల యథోచి
తముగ సౌహార్దములొనర్చి రమలమతిని. 252

చ॥ పలికె వసిష్ఠుఁ డత్తతినిఁబ్రాక్తన భాగ్యవశంబునం జనం
బలరెదు నల్లుగా దశరథావనిపాలకుటుంబ మిద్భుతా

కలనఁ జతుర్దశాబ్దములఁ గ్రమ్మఱఁ బుట్టిన యట్లు తోఁచెనం
చలఘుమతింగణించి దశహాసవికాస ముఖారవిందుఁడై 253

సీ. శారభూధర సముద్ధరణప్రచండిమో
ద్దండపాండితి మించె దశముఖుండు
వానిజయించె రేవాబంధ బంధుర
బాహాసహస్రుండు హైహయుండు
వానిఁగీటడఁచె సర్వంసహాఖరోర్వ్యగ్ర
పార్థివమథనుండు భార్గవుండు
వానిసారమునొంచె వడిఁగాకపక్షాభి
రాముఁడై మున్నయీ రాఘవుండు

గీ. తత్ప్రపూరిత మేతత్కథ యిది కాల
చరితమున కూర్ధ్వమగుదాని సంఘటించు
నిక్కవిత తత్ప్రక్రియాగారవేతర మగు
నైన భువనశివంకరం బైచెలంగు. 254

మ. అనికాకుత్స్థు గుఱించి మానియను పన్నా! కామ యేతెంచె గ్ర
క్కన నిర్దోషశుభాంశమాంగళికలగ్నం బీవు సీతాన్వితిన్
మను సింహోన్నతసింహపీఠిక రహింపం జేయు నానన్ జగ
జ్జనగీతోత్తరకోసలంబులకు రాజన్వత్త చే నొప్పుతన్. 255

మ. అనినన్ రాఘవుఁ డట్లుచేయ మహనీయైంద్రదాభిషేకంబుదా
మనుపూర్వంబుగఁ జేసె దేశికుఁడు సంభావించుచున్ దక్కువా
రును నానాగతులం దదుత్సవము దూర్మ్యల్ మీఱఁ గావించి తో
దన పంచాంగి ధరిత్రి మోయఁగడు వేడ్కన్ ప్రొక్కి రాక్షున్ముదన్.

క॥ వాద్యమంగళకీతికానాందికాద్య
హృద్యవాద్యంబు లప్పు డెంతేని మొరయ
రఘుకులాచార్యుఁ డగు మునిప్రవరుఁ డనియె
గాంగలహరీఘుమంఘుమాభంగఫణితి. 256

మ॥ అకలుంకా పరమాత్మునల్లనలజీవాత్ముల్ బలెన్నీ విభీ
షిక లాశాపతులై దిశాష్టక మునం జెల్వొంది రాచంద్రతా
రక మల్లాట నవోద్య దుస్సదురు ధర్మస్కంధ భావంబు మి
న్నక నీవూనఁ గ నిందు నందును బ్రజల్ సత్కారముల్ గాంతురే

వ॥ అనిన సద్గుణ సముద్రుండగు రామభద్రుండుమ్రీడావనతవదనుం
డై యూరకుండు నెడ విభీషణుండు కృతాంజలియై యతని కిట్లనియె॥

చ॥ అరిహర లంక పుష్పకము నగ్రజుఁ డా నిధిభర్తయైన నా
శరపతికిచ్చెఁ గైకొనియె సత్కృపనిచ్చితి వందు నాకు ని
త్తటిని కదాని రెండవది తావక శాసనమైన నమ్మహే
శ్వరసఖుఁ జేరునన్న విని సంయమినాథుఁడు సమ్మతింపఁగా. 258.

వ॥ అప్పు డనమానంబగు విమానంబు గుఱించి రాఘవుం డొప్పు
కంబ నీప్రథమస్వామియగు పౌలస్త్యాగ్రజుం జేరు మనిన నదియట్లు
చేసె ననంతరంబున నఖిలమునిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుండు భరతశ్రేష్ఠున
కిట్లనియు 259

క॥ వినుమన్న రామ నేనీ
కొనరించు ప్రియంబు లేమి యున్నవి? నీవ
త్యనుపమితధర్మచరితుఁడ
వనినం గాకుత్స్థతిలకుఁ డసదృశఫణితిన్ 260

సీ॥ త్రిదివేంద్రరణజయప్రదుఁడై నతేంద్రియూ
జ్ఞాహాకీర్తికంబు మస్తమునఁ దాల్చి

యాదివరాహదంష్ట్రాంకురద్వింధ్య భూ
ధరపత్రశబరి నిద్ధరణిఁగాంచి
దక్షిణపశ్చిమోదధులకు మేర యే
ర్పడునట్లు సేతుసంబంధమూన్చి
కల్పాంతసమవధికంబుగా భువనమం
డల మరావణమయి యలరఁజేసి

గీ॥ రక్షవహించుట మీయనుగ్రహముకాదె
యింతకన్నను మాకు మీ రెట్టిహితము
సేయవలయు నటంచు వసిష్ఠమునికి
వందన మొనర్చి పలికె నానందగరిమ. 261

సీ॥ కవులు వచోగుచ్ఛకమరంద ధారల
శ్రుతుల మజ్జన మొనర్చుదురు గాక
జనులు వాగ్బ్రహ్మవాసనలానకయ కవి
సూక్తిదోషము లెంచకుండ్రుఁగాక
త్రిపథగయగుచు ధాతృకమండలుజలంబు
పూతత్రిలోకమై పొలుచుఁగాక
వీరయశస్సుధాసారనిష్యందముల్
శ్రవణాగ్రగుణములై ప్రబలుఁగాక.

గీ॥ ధర్మదేవత నాల్గుపాదముల నిలువ
బహుళసస్యసమృద్ధిచేఁ బ్రజ యెసంగ
వితత రాజన్వతీసంజ్ఞ వెలసిధరణి
తనరుఁగావుత మాచంద్రతారకముగ. 262

శా। తూణీభూతసముద్ర! ముద్రఘనసంస్తుత్యోల్లసద్భక్త గీ
ర్వాణౌఘార్పితభద్ర! భద్రవిలసద్వ్యాహార్యటీధాటికా
రీణాహిప్రభునిద్ర! నిద్రవిహీనక్రేయ పదప్రస్ఫుర
ద్వాణీకాళలముద్ర! ముద్రదగజావక్షోజకస్తూరికా. 263

శ। సారంగధర! ధరాధ్యక్షా
మారీవర! వరయతీంద్ర మానసపదసం
చారా! చరితానతసుర
వారా! వారాన్నిధానవరతూణీరా 264

పంచచామరము। ధరాధరాధిరాట్సుతానితాంతకాంతి హృత్సరో
వరాంతరాళరాజహంస! వారిరాజదుష్టపా
వరాసురామరార్యనీయ నవ్యభవ్యవాఙ్ఞ్వరం
వరాభిరాధనానిశాప్త భావనీయ యశఃపా. 265

గద్యము

ఇది శ్రీ మద్రామేశ్వర శాశ్వతకృపాకటాక్షవీక్షణ సమాసాదిత
సకలసామ్రాజ్యధౌరేయ అశాంతవిశాంతనాతధిరిత రాధేయ
బిజ్జలకులకలశనిధానకార్తినిశాకరత్ర వెన్నూళ్ళగోత్రపవిత్ర
కృష్ణరాయ మహీధవకుమార సంగరాంగణకుమార
నయాగుణగోపాల తిమ్మభూపాల ప్రణీతంబైన
యనర్ఘ రాఘవంబను మహాప్రబంధంబునందు
సర్వంబును బంచమాశ్వాసము
సంపూర్ణము
రామేశ్వరార్పణమస్తు.

---